TPLA10UB

ఆయుర్వేద & అలోపతిక్

# ఇంజక్షన్ గైడ్



గ్రంథకర్త:

**డాక్టర్ డి. హనుమంతరావు**

ఎ. ఎ. పి. ఎ., ఆయుర్వేదిక్

సికింద్రాబాద్.

★

శ్రీ వే... గ్రంధాలయము

ప్రకాశకులు:

**కొండా శంకరయ్య**

**సికింద్రాబాద్, హైద్రాబాద్ & వరంగల్.**

**1955**

కాపీరైట్ రిజిష్టర్డు వెల I. G. 3—8—0

సర్వహక్కులు
ప్రకాశకులవి.

314 అల్లోపతి ఇంజక్షనులు
72 ఆయుర్వేద ఇంజక్షనులు
25 స్పెషల్ ఇంజక్షనులు
25 అల్లోపతి కంపౌండింగులు
20 అల్లోపతి పేటెంటు ఔషధములు
24 ఆయుర్వేద కంపౌండింగ్

ప్రీమియర్ ముద్రాక్షరశాల
యందు ముద్రితము
సికింద్రాబాద్.

౧౧౦ శ్రీ వేమన గ్రంథాలయము

# విషయసూచిక.

—:o:—

పుట


ఇంజక్షన్ చేయవలసినప్పుడు తీసికొనవలసిన జాగ్రతలు. ౩
ఇంజక్షన్ చేయుటకు కావలసిన పరికరములు. ౪
వ్యాధియొక్క సాధారణమైన పరిస్థితులయందు ఇంజక్షన్ చేయుటకు అనువగు వేళలు. ౧౩
ఇంజక్షన్ చేయు వైద్యుడు శుభ్రముగానుండుట. ౧౫
ఇంజక్షన్ కడుజాగ్రతతో చేయుట. ౧౬
అజాగ్రతగా ఇంజక్షన్ చేసిన సంభవించే అపాయములు ౧౯
ఇంజక్షన్ చేయునప్పుడు గాలిబుడగలు సిరంజినందేమాత్రము లేకుండా చేయుట ముఖ్యావసరము. ౩౦
ఇంజక్షనే సూచీముఖయంత్రము. ౩౧
ఇంజక్షనులు యెన్నివిధములు, వాటిని ఉపయోగించు స్థలములు. ౩౨
స్టెరులైజ్ (అనగా) నేమి. ౩౬
డెటాల్ యొక్క ఉపయోగములు. ౩౮
సాధారణముగా అవసరమగు ఇంజక్షన్ సిరంజీలు మొదలైన పరికరములు. ౪౦
ఇంజక్షన్ చేయుటకు పూర్వము అంపుల్సు కదలించుట ముఖ్యము. ౪౧
"వయల్స" ఔషధద్రవ్యముతో నింపి రబ్బరుమూతతో లభించుచుండును. ,,

సంఖ్య పుట


ఇంజక్షను అంపుల్స్‌తో నుండుపెట్టె దాన్నిపైనుండు వివరములు. ౪౨

## అల్లోపతి ఇంజక్షనులు.

1. థియోసల్ఫేటు ఆఫ్ సోడియం ... ౪౪
2. కాల్షియం గ్లూకోనేట్ ... ౪౫
3. కోలాయిడ్ కాల్షియం విత్ విటామిన్ డి ... ౪౬
4. కాల్షియం క్లోరైడ్ ... ౪౭
5. కోలాయిడ్ అయోడిన్ ... ౪౮
6. కోటార్నిన్ ... ౪౯
7. కస్తూరి, మస్క్, ఇన్ ఈథర్ ... ౫౦
8. కార్పొరాల్ టాటియా యెక్స్‌ట్రాక్టు ... ,,
9. కాఫిన్ అండ్ సోడియా బెన్‌జోయెట్ ... ౫౧
10. క్యాంఫరు ఇన్ ఆయిల్ ... ౫౨
11. క్యాంఫరు ఇన్ ఈథర్ ... ,,
12. క్వినైన్ బై హైడ్రో క్లోరైట్ ... ౫౩
13. క్వినైన్ ఆసిడ్ హైడ్రో బ్రోమైడ్ ... ౫౪
14. క్వినైన్ బై హైడ్రో క్లోరైడ్ విత్ యుర్‌థ్రైన్ ౫౫
15. బైసల్ ఫానమైడ్ ... ,,
16. స్పెటమైడ్ - సోలు ... ౫౬
17. సిటోప్రైన్ ... ,,
18. బై అమ్‌నిజీన్ ... ౫౭
19. బై ఓవరెక్సు ... ,,
20. ఫెర్రి క్వినారిసిన్ ... ౫౮

సంఖ్య ... పుట

21. ప్రొకైన్ హాయిడ్రోక్లోరు ... ౫౮
22. కోల్లాయిడ్ స్టానో మేంగనిసు ... ,,
23. ఆర్థ్రరెటిన్ ... ౫౯
24. యూ్రటిన్ కాస్టైన్ ... ,,
25. మైయోసిన్ ... ౬౦
26. బైహిస్ట్రాడైన్ ... ,,
27. బైగనోలెక్సు ... ౬౧
28. గనోడెరుమ్ ... ,,
29. బై హైపరు బిసుమత్ ... ౬౨
30. లేడర్ ప్లక్సు ... ,,
31. కాసిలోమిన్ ... ౬౩
32. సిలోటోప్రిన్ ... ,,
33. కారడపోన్ ... ౬౪
34. కార్డటోన్ ... ,,
35. కాసినోసాల్ ... ౬౫
36. కోలోసాల్ అయొడిన్ ... ,,
37. కోలోసాల్ కాల్షియం ... ౬౬
38. లివరేక్సు ... ,,
39. హీపరెక్సు ... ౬౭
40. బై బిసుముతాల్ ... ,,
41. బెస్ - బోబిస్మిత్ ... ౬౮
42. సల్ఫార్సనల్ ... ,,
43. మిల్కుప్రొటిన్ ... ౭౦

| సంఖ్య | | పుట |
|---|---|---|
| 44. అడ్రినలిన్ క్లోరైడ్ | ... | ౨౧ |
| 45. ఎడ్రిపా ఎఫిడ్రిన్ | ... | ౨౨ |
| 46. ఎఫిడ్రిన్ హైడ్రో క్లోరైడ్ | ... | ,, |
| 47. ఒవేరియన్ రెసిడ్యూ | ... | ,, |
| 48. ఇన్సులిన్ | ... | ౨౩ |
| 49. ఎమిటిన్ హైడ్రోక్లోరైడ్ | ... | ౨౪ |
| 50. అయిరన్ అర్సినైట్ | ... | ,, |
| 51. అయిరన్ అర్సినైట్ స్ట్రిచ్ నైన్ | ... | ౨౫ |
| 52. అయిరన్ సిట్రేట్ | ... | ,, |
| 53. ఎర్గటిన్ | ... | ౨౬ |
| 54. ఎన్ట్యూట్రిన్ | ... | ,, |
| 55. ఐసొటానికు సెలైన్ సొల్యూషన్ | ... | ౨౭ |
| 56. సైలాన్ విట్ అయోడిన్ | ... | ,, |
| 57. బిస్మిథాలు | ... | ౨౮ |
| 58. మల్టిన్ | ... | ,, |
| 59. అక్టలారసన్ | ... | ౨౯ |
| 60. గ్లూకోస్ ఇంజక్షన్ | ... | ,, |
| 61. థయోసారామిన్ | ... | ౩౦ |
| 62. పొటాషియం యాంటిమొనిటార్ ట్రై | ... | ,, |
| 63. సల్ఫోడైన్ | ... | ౩౧ |
| 64. సిబాజాల్ | ... | ౩౨ |
| 65. డిజిటాలిన్ | ... | ,, |
| 66. డిజిటాలిన్ అండ్ స్ట్రిచ్ నైన్ | ... | ౩౩ |

సంఖ్య | పుట


67. పలుడ్రిన్ ... ౮౪
68. సింకోనిన్ బై హైడ్రోక్లోరైడ్ ... ౮౫
69. లారోస్టిడిన్ ... ౮౬
70. పిట్రెసిన్ ... ౮౭
71. పిటోసిన్ ... ,,
72. పిట్యూట్రిన్ ... ౮౮
73. రోమటిజం బై ఫైలాజిస్టన్ ... ౯౦
74. మెగ్నీషియం సల్ఫేటు ... ,,
75. మేరుక్యూరు సాల్ సొల్యూషన్ ... ౯౧
76. యోహింబిన్ హైడ్రోక్లోరైడ్ ... ,,
77. లీవర్ యెక్స్ట్రాక్టు ... ౯౨
78. పెరోట్రోన్ ... ,,
79. మార్ఫిన్ సల్ఫేటు ... ౯౩
80. మార్ఫిన్ అండ్ మెగ్నీషియం ... ౯౪
81. మార్ఫిన్ అండ్ ఎట్రోఫిన్ ... ౯౫
82. వెలెరియన్ ఫాస్ఫేట్ ... ,,
83. సోడియం కోకో డైలేటు ... ౯౬
84. స్ట్రిచ్ నైన్ సల్ఫేటు ... ,,
85. స్ట్రోఫెరిథిన్ ... ,,
86. మెమోసిన్ హైడ్రో బ్రోమైడ్ ... ౯౮
87. హమోసిన్ మార్ఫిన్ కంపౌండు ... ౯౯
88. విటామిన్ బి ... ౧౦౦
89. విటామిన్ సి ... ౧౦౧

| సంఖ్య | | | పుట |
|---|---|---|---|
| 90. | హెగ్జామిన్ | ... | ౧౦౧ |
| 91. | కామ్ఫోలాన్ | ... | ౧౦౨ |
| 92. | సలారుగన్ | ... | ౧౦౩ |
| 93. | లూమినల్ సోడియం | ... | ,, |
| 94. | నెప్టాల్ | ... | ,, |
| 95. | హిక్జాటరు | ... | ౧౦౪ |
| 96. | హెమొప్లాటోల్ | ... | ,, |
| 97. | డిహైడ్రో కోలిన్ | ... | ౧౦౫ |
| 98. | చాల్ మోగ్రిన్ | ... | ,, |
| 99. | పల్ మోట్రాన్ | ... | ,, |
| 100. | ఎటెబ్రిన్ | ... | ౧౦౬ |
| 101. | బిజాక్టల్ | ... | ౧౦౭ |
| 102. | బిజాక్టల్ విత్ లీవర్ | ... | ,, |
| 103. | ప్రొంటోసిల్ | ... | ౧౦౮ |
| 104. | అన్టిపైరిన్ | ... | ౧౦౯ |
| 105. | ఒరోయిన్ గోల్డు | ... | ,, |
| 106. | ఎం. అండ్ బి. 693 | ... | ౧౧౦ |
| 107. | అరోవర్సన్ | ... | ౧౧౧ |
| 108. | హైడ్రార్జు సాలిసికేట్ | ... | ౧౧౨ |
| 109. | నికోనిన్ | ... | ,, |
| 110. | కాల్షియం రెక్టేట్ | ... | ౧౧౩ |
| 111. | మెరుక్యూర్ క్రోమ్ | ... | ,, |
| 112. | అర్సెనిక్ | ... | ౧౧౪ |

సంఖ్య పుట

113. గ్లైకోల్ ... ౧౧౪
114. యూకలిప్టల్ ... ౧౧౫
115. ఎటోపాసీల్ ... ,,
116. రిటికోలోజిన్ ... ,,
117. మఫర్సైడ్ ... ౧౧౬
118. ఎస్. ఎ. బి. ... ౧౧౭
119. విబెక్సు ... ౧౧౮
120. యురాసల్ఫాసైడ్ ... ౧౧౯
121. హెప్టాల్జిన్ ... ,,
122. కెప్లిన్ విటామిన్ ... ౧౨౦
123. అస్టిలిన్ పౌడ్రు ... ౧౨౧
124. లీపి. బీ. ... ౧౨౨
125. ఫోలిక్ ఆసిడ్ ... ,,
126. స్టిరోడాన్ ... ౧౨౩
127. గవోక్రిన్ ... ౧౨౪
128. పెనిసిలిన్ జి. ఇంజక్షనులు ... ,,
129. పెన్సీలిన్ ఔషధము యెన్నివిధములుగా మనకు లభించును ... ౧౨౫
130. పెనిసీలిన్ ఇన్ ఆయిల్ ఇంజక్షను ... ౧౨౮
131. ప్రొకేన్ పెనిసీలిన్ జి. పొడిరూపముతో లభించు ఇంజక్షను ... ౧౩౩
132. పెనిసీలిన్ జీ. సోడియం ఇంజక్షను ... ౧౩౭

సంఖ్య పుట

133. పెనిసిలిన్ ఇంజక్షనులు యెట్టి క్రిమిరోగ
ములను నిర్మూలించును ... ౧౪౧

134. పెన్సిలిన్ ఇంజక్షనుయొక్క మోతాదులు ... ౧౫౩

135. పెనిసీలిన్ ఔషధము గిట్టనివారియందే
ర్పడు దోషములు ... ౧౬౫

136. డిహైడ్రో స్ట్రెప్టోమైసిన్ సల్ఫేటు ఇంజక్షను... ౧౬౭

137. కాల్షియం ఇంజక్షను ... ౧౭౭

138. కాల్షియం శరీరమున క్షీణించుటకుగల
మొదటి కారణము ... ౧౭౮

139. కాల్షియం పదార్థము శరీరమునక్షీణిం
చుటకు రెండవ కారణము ... ౧౮౦

140. కాల్షియం ఇంజక్షను కార్యక్రమము
యొక్క కాలపరిమితి ... ౧౮౪

141. కాల్షియం శాండోజ్ యొక్క ప్రయోగ
ప్రయోజనముల వివరము ... ౧౮౬

142. కాల్షియం ఇంజక్షనులయొక్క మోతాదులు. ౧౯౨

143. చిన్నవారికి వాడునట్టి మోతాదులు ... ౧౯౩

144. కాల్షియం విత్ విటామిన్ సి. ఇంజక్షనులు. ౧౯౫

145. విటామిన్ 'ఏ' ఇంజక్షను ... ౨౦౦

146. విటామిన్ 'బి' 12, ,, ... ౨౦౪

147. విటామిన్ 'బి' కాంప్లక్స్ ఇంజక్షను ... ౨౦౯

148. హైడ్రినాల్ ఇంజక్షను ... ,,

149. గ్లూకాల్షైన్ ,, ... ౨౧౨

సంఖ్య ... పుట


| | | | |
|---|---|---|---|
| 150. | నోవాల్‌జిన్ | ఇంజక్షను | ... ౨౧౪ |
| 151. | లాకార్నాల్ | ,, | ... ౨౧౯ |
| 152. | ఓమ్నాడైన్ | ,, | ... ౨౨౩ |
| 153. | గ్యాస్‌ట్రీడైన్ | ,, | ... ౨౨౫ |
| 154. | రోమినాల్ | ,, | ... ౨౨౭ |
| 155. | అయిరోజాల్ | ,, | ... ౨౨౮ |
| 156. | కొరామిన్ | ,, | ... ౨౩౦ |
| 157. | కొరామిన్ అడినోసైను | ,, | ... ౨౩౫ |
| 158. | కొరామిన్ ఎఫిడ్రిన్ | ,, | ... ౨౩౮ |
| 159. | కొరామిన్ కాఫియన్ | ఇంజక్షనులు | ... ౨౪౧ |
| 160. | హింపాఫోలిన్ | ఇంజక్షను | ... ౨౪౩ |
| 161. | డైయూరిన్ | ,, | ... ౨౪౮ |
| 162. | క్వినాన్సలు | ,, | ... ౨౫౦ |
| 163. | కాల్షిబ్రోన్యాట్ | ,, | ... ౨౫౩ |
| 164. | న్యూజేల్లిన్ | ,, | ... ౨౫౯ |
| 165. | వెలేరియన్ | ,, | ... ౨౬౨ |
| 166. | అన్‌ట్రాక్సిన్ | | ... ౨౬౩ |
| 167. | అకటిన్ | | ... ౨౬౪ |
| 168. | అన్‌టిమొయిన్ | | ... ౨౬౫ |
| 169. | అన్‌టాక్సు | | ... ౨౬౬ |
| 170. | అఫిమ్ విరోస్ | | ... ౨౬౭ |
| 171. | అరోకాలు సోడియమ్ | | ... ,, |
| 172. | అరోకార్బన్ | | ... ౨౬౮ |

సంఖ్య ... పుట


173. అడ్రోస్ కార్బిన్ ... ౨౬౯
174. అల్కామైడ్ ... ౨౭౦
175. అగోమెన్సిన్ ... ౨౭౧
176. అంటిస్టిన్ ... ,,
177. అరోమైసిన్ హైడ్రోక్లోరైడ్ ... ౨౭౨
178. అరోమైసిన్ ... ,,
179. బ్రోమికాల్ ... ౨౭౪
180. సిన్టారిన్ ... ,,
181. కార్బొఅనిమాలిన్ ... ౨౭౫
182. సిసుటాక్సిన్ ... ౨౭౬
183. కోబురావినమ్ ... ౨౭౭
184. కాల్షిబైన్ ... ,,
185. క్యాంఫర్ ఇన్ ఆయిల్ విత్ యీతర్ ... ౨౭౮
186. క్రోటాలిన్ ... ౨౭౯
187. కార్డయోఫైయిన్ ... ౨౮౦
188. కార్డయోనైసిన్ ... ౨౮౧
189. కార్డయో ఎఫిడ్రిన్ ... ,,
190. కార్రోర్మోన్ ... ౨౮౨
191. ఇనార్సఫ్ ... ౨౮౩
192. ఫేర్రియిత్ అర్సెని ... ,,
193. గ్రెప్ సుగర్ సొల్యూషన్ ... ౨౮౪
194. హమోస్టైటిన్ ... ౨౮౫
195. హమోస్టైటిన్ విథౌట్ అయిరన్ ... ,,

శ్రీ వేపన గ్రంథాలయము తేలప్రోలు. (కృష్ణా జిల్లా).


| సంఖ్య | | పుట |
|---|---|---|
| 196. హాపాపోలిన్ | | ౨౮౬ |
| 197. హాపాజిన్ | | ౨౮౭ |
| 198. లాకోలాన్ | ... | ౨౮౮ |
| 199. అయిడోలాకోలాన్ | ... | ,, |
| 200. నాట్రోటోన్ | ... | ౨౮౯ |
| 201. ఒపాసోడిన్ | ... | ౨౯౦ |
| 202. ఫోస్ఫోటోన్ | ... | ,, |
| 203. క్వినోకాల్షిమా | ... | ౨౯౧ |
| 204. సెపుటోసిల్ అల్‌బమ్ | ... | ,, |
| 205. స్ట్రామిటిన్ | ... | ౨౯౨ |
| 206. టోటాలిన్ బి. కాం. | ... | ,, |
| 207. యిస్ట్రోరైడ్ | ... | ౨౯౩ |
| 208. మాస్సిన్ వి. డి. | ... | ౨౯౪ |
| 209. పాపకోడిన్ | ... | ,, |
| 210. పాప్పెలిన్ | ... | ,, |
| 211. యూని బి. కాన్‌సెన్‌ట్రావెడ్ | ... | ౨౯౫ |
| 212. యూనిఫెర్రోన్ | ... | ,, |
| 213. యూనిపైరి డవోక్చిన్ | ... | ౨౯౬ |
| 214. యూనిపెతాదిన్ | ... | ,, |
| 215. యూనిపన్టాటోన్ | ... | ౨౯౭ |
| 216. యూనిరైజీ | ... | ,, |
| 217. యూనిసోడి లక్సు | ... | ,, |
| 218. యూనిటాహారిటిన్ | ... | ౨౯౮ |

| సంఖ్య | | పుట |
|---|---|---|
| 219. ప్లోటోన్ | ... | ౨౯౮ |
| 220. హైపారిన్ | ... | ౨౯౯ |
| 221. లక్టోమస్క్యూ | ... | ౩౦౦ |
| 222. లక్సిన్ | ... | ౩౦౧ |
| 223. మెకురో అసిమ్ | ... | ౩౦౨ |
| 224. మెకురో కుప్రమ్ | ... | ౩౦౩ |
| 225. మెకురో ఫెర్రమ్ పాస్ | ... | ,, |
| 226. మెకురో ఫుట్ క్లోరైడ్ | ... | ౩౦౪ |
| 227. మెకురో కాల్షియమ్ పాస్ | ... | ౩౦౫ |
| 228. మెకురో ఫులుముభమ్ | ... | ౩౦౬ |
| 229. మెకురో మేగ్నిషియమ్ పాస్ | ... | ౩౦౭ |
| 230. మెకురో స్టానుమ్ | ... | ,, |
| 231. మెకురో అయోడుమ్ | ... | ౩౦౮ |
| 232. మిజ్కో | ... | ,, |
| 233. మిన్కార్ | ... | ౩౦౯ |
| 234. మైర్ మెక్సు | ... | ,, |
| 235. మిమాటిన్ | ... | ౩౧౦ |
| 236. మికార్సిస్ | ... | ౩౧౧ |
| 237. పైరోల్ | ... | ,, |
| 238. రైనాక్సిన్ | ... | ,, |
| 239. స్ట్రిమోజిన్ | ... | ౩౧౨ |
| 240. సైకోన్ | ... | ౩౧౩ |
| 241. సైనెక్సు | ... | ,, |

| సంఖ్య | | పుట |
|---|---|---|
| 242. టాక్సిన్ టాక్సిన్ | ... | ౩౧౪ |
| 243. డిరీషిన్ | ... | ,, |
| 244. లైవోజిన్ | ... | ౩౧౫ |
| 245. టుబర్ కోలిన్ | ... | ,, |
| 246. లైసోల్ | ... | ,, |
| 247. యుల్.టూలా మర్కు | ... | ౩౧౬ |
| 248. యురోకాఫిన్ | ... | ,, |
| 249. వీర్లిన్ | ... | ౩౧౭ |
| 250. వీర్లిన్ ఫుల్ పల్ | ... | ,, |
| 251. విసాక్ వినూమ్బి | ... | ౩౧౮ |
| 252. విటోన్ | ... | ,, |
| 253. ఎక్సురో కార్బిన్ | ... | ౩౧౯ |
| 254. బారాపోల్ | ... | ,, |
| 255. బిప్లక్సు | ... | ౩౨౦ |
| 256. బిప్లిక్సు ఫోర్టు | ... | ౩౨౧ |
| 257. గార్డియన్ | ... | ,, |
| 258. నోహైలిన్ | ... | ౩౨౨ |
| 259. అమినో ఫారమ్ | ... | ,, |
| 260. బివి. మిన్ | ... | ౩౨౩ |
| 261. కోలోకాల్ | ... | ౩౨౩ |
| 262. కోలో కాల్ పోర్టు | ... | ,, |
| 263. కోర్ పోల్ టిన్ | ... | ౩౨౪ |
| 264. ట్రోయిరినా | ... | ,, |

| సంఖ్య | | పుట |
|---|---|---|
| 265. హమొరాల్ | ... | ౩౨౫ |
| 266. హపోరాల్ పోర్టు | ... | ,, |
| 267. హపోరాల్కోమ్ విటమిన్ సియిట్ బి. కాం. | | ,, |
| 268. మిటిజాన్ | ... | ౩౨౬ |
| 269. మెన్స్టోనా | ... | ౩౨౭ |
| 270. న్యూ అపోరాల్ | ... | ,, |
| 271. టెస్టో ప్రోపెన్ | ... | ౩౨౮ |
| 272. టెనెక్బల్ | ... | ,, |
| 273. యురాక్బల్ | ... | ౩౨౯ |
| 274. లిటల్లైన్ బి. సి. | ... | ,, |
| 275. సిబాల్జిన్ | ... | ౩౩౦ |
| 276. కోగూలిన్ | ... | ౩౩౧ |
| 277. డిజిపోలిన్ | ... | ,, |
| 278. యిస్టో డ్రోన్ | ... | ౩౩౨ |
| 279. పర్కోర్టిన్ | ... | ౩౩౩ |
| 280. పారిస్కోల్ | ... | ,, |
| 281. రైసైల్ | ... | ౩౩౪ |
| 282. సిస్టోమెన్సిన్ | ... | ,, |
| 283. స్టాసిన్టిన్ | ... | ౩౩౫ |
| 284. ఆరోస్క్వికిన్ | ... | ,, |
| 285. బికోక్సు | ... | ,, |
| 286. ఫోలికోబిన్ | ... | ౩౩౬ |
| 287. హపాటిప్ | ... | ,, |

| సంఖ్య | | పుట |
|---|---|---|
| 288. పల్ మోక్స్రైన్ | ... | ౩౩౭ |
| 289. విటమిన్ కె. | ... | ,, |
| 290. నివార్స్రైన్ | ... | ౩౩౮ |
| 291. టి. బి. జైడ్ | ... | ,, |
| 292. నికోలాన్ | ... | ౩౩౯ |
| 293. బిక్ రా | ... | ,, |
| 294. సిస్ రా | ... | ౩౪౦ |
| 295. అనురక్చైన్ | ... | ,, |
| 296. విబిలీన్ | ... | ౩౪౧ |
| 297. లీవా డెక్సు | ... | ,, |
| 298. అనామిన్ | ... | ౩౪౨ |
| 299. లైపా డెక్చైన్ | ... | ౩౪౩ |
| 300. అనాకోబిన్ | ... | ౩౪౪ |
| 301. అనాపోలిన్ | ... | ,, |
| 302. చినోపిల్ | ... | ౩౪౫ |
| 303. స్టిబినాల్ | ... | ౩౪౬ |
| 304. ఒపికాల్ జిన్ | ... | ,, |
| 305. జిడోక్చైన్ | ... | ౩౪౭ |
| 306. అమినోపైలిలిన్ | ... | ,, |
| 307. ప్లోరోసిడ్ | ... | ౩౪౮ |
| 308. సల్ కో కెడిన్ అల్ బమ్ | ... | ౩౪౯ |
| 309. సాలురిన్ | ... | ౩౫౦ |
| 310. కార్ డి మోన్ | ... | ,, |
| 311. అంటిస్ సన్ | ... | ౩౫౧ |

| సంఖ్య | | | పుట |
|---|---|---|---|
| 312. పెతాదిన్ హైడ్రోక్లోరైడ్ | | ... | ౩౫౧ |
| 313. సైసిప్టోన్ | | ... | ౩౫౨ |
| 314. పోల్‌బి సైన్ | | ... | ,, |

ఆయుర్వేద ఇంజక్షనులు.

| | | | |
|---|---|---|---|
| 1. అమృత | ఇంజక్షను | ... | ౩౬౫ |
| 2. టి. బి. | ,, | ... | ,, |
| 3. అశోక | ,, | ... | ౩౫౪ |
| 4. బైరినాల్ | ,, | ... | ,, |
| 5. దశమూల | ,, | ... | ,, |
| 6. కుమారి | ,, | ... | ౩౫౭ |
| 7. ఎనెస్టాల్ | ,, | ... | ,, |
| 8. యాంటిఓపియం | ,, | ... | ౩౫౭ |
| 9. యాంటి సిఫిలిసు | ,, | ... | ౩౫౮ |
| 10. అర్శరిపు | ,, | ... | ,, |
| 11. అర్జున | ,, | ... | ౩౬౦ |
| 12. బర్త్ఎట్ ఈజి | ,, | ... | ,, |
| 13. కాల్కులిన్ | ,, | ... | ,, |
| 14. దీప్య | ,, | ... | ౩౬౧ |
| 15. గానోగాన్ | ,, | ... | ,, |
| 16. గుల్మాంతక | ,, | ... | ,, |
| 17. కంటకారి | ,, | ... | ౩౬౨ |
| 18. కాసాంతక | ,, | ... | ,, |
| 19. హార్టోనికు | ,, | ... | ౩౬౩ |
| 20. జ్వరాంతక | ,, | ... | ,, |

21. హిరణ్యా ఇంజక్షను ... ౩౬౩
22. కుర్చి „ ... ౩౬౪
23. కుష్టాంతక „ ... „
24. లెక్టస్ „ ... „
25. మధుశిలా „ ... ౩౬౫
26. నక్సువామిక „ ... „
27. ల్యూ్యానేకూ్యార్ „ ... ౩౬౬
28. పునర్నవ „ ... „
29. ఏరండ „ ... „
30. అగ్నిమంద „ ... „
31. కుటజా „ ... ౩౬౭
32. లివర్ కూ్యారు „ ... „
33. రెజువినాల్ „ ... „
34. రక్తదోషాంతక „ ... ౩౬౮
35. వనాష్టా „ ... „
36. స్తన్యవృద్ధి „ ... „
37. అజువాను „ ... ౩౬౯
38. నాయిూ ఇంజక్షను (కుక్కపొగాకు) ... „
39. సర్పగంధ ఇంజక్షను ... „
40. వాసక „ ... ౩౭౦
41. వాతరిపు „ ... „
42. సప్తవర్ణ „ ... „
43. సువర్ణ „ ... ౩౭౧
44. చంద్రోదయా „ ... „
45. పరివాళ „ ... ౩౭౨

| | | | |
|---|---|---|---|
| పుట | | | సంఖ్య |
| 46. కస్తూరి | ఇంజక్షను | ... | ౩౭౨ |
| 47. మకరధ్వజ | ,, | ... | ౩౭౩ |
| 48. లోహాభస్మ | ,, | ... | ,, |
| 49. అద్రికు | ,, | ... | ,, |
| 50. ఇంద్రవారుణి | ,, | ... | ౩౭౪ |
| 51. జ్యోతిష్మతి | ,, | ... | ,, |
| 52. బినోలా | ,, | ... | ,, |
| 53. ధత్తూరు భల్లాంతక | ,, | ... | ౩౭౫ |
| 54. పిప్పలి | ,, | ... | ,, |
| 55. ఖదిరా | ,, | ... | ,, |
| 56. అనారు | ,, | ... | ,, |
| 57. బిరోజాతైలముతో | ,, | ... | ,, |
| 58. అపరజిత | ,, | ... | ౩౭౬ |
| 59. కంచనార | ,, | ... | ,, |
| 60. వరుణ | ,, | ... | ,, |
| 61. ఉశీరా | ,, | ... | ,, |
| 62. పలాసు | ,, | ... | ౩౭౭ |
| 63. పిత్తాపిపర | ,, | ... | ,, |
| 64. పటోల | ,, | ... | ,, |
| 65. చోప్ చీని | ,, | ... | ౩౭౮ |
| 66. నైరేయక | ,, | ... | ,, |
| 67. నిర్గుండి | ,, | ... | ,, |
| 68. తాళపత్ర | ,, | ... | ౩౭౯ |
| 69. భల్లాతకారి | ,, | ... | ,, |
| 70. లహాసన్ దూద్ | ,, | ... | ,, |

71. రసకర్పూర ఇంజక్షను ... ౩౮౦
72. వసంతకుసుమాకర ,, ... ,,

స్పెషల్ యింజక్షనులు.

1. శతావర్ ఇంజక్షను ... ౩౮౦
2. సోమలత ,, ... ౩౮౧
3. స్వర్ణక్షీరి ,, ... ,,
4. స్పెషల్‌నాయి ,, ... ౩౮౨
5. స్పెషల్ కుజ్జీన ,, ... ,,
6. స్పెషల్ లుకోరియా ,, ... ,,
7. స్పెషల్ శులారిక్ ,, ... ౩౮౩
8. స్పెషల్ రక్తప్రదర ,, ... ,,
9. స్పెషల్ కలరా ,, ... ,,
10. స్పెషల్ క్షయ ,, ... ౩౮౪
11. స్పెషల్ టానిక్ ,, ... ,,
12. స్పెషల్ మాలతి ,, ... ౩౮౫
13. త్రిఫల ,, ... ,,
14. స్పెషల్ పైరాలిసిన్ ,, ... ౩౮౬
15. స్పెషల్ శ్వాసిక్ ,, ... ,,
16. మహాలక్ష్మి విలాసరస్ ,, ... ,,
17. మహావాత విధ్వంసిరస్ ,, ... ౩౮౭
18. ముక్తపిష్ఠి ,, ... ,,
19. రౌప్యభస్మ ,, ... ,,
20. శిలాజిత్ ,, ... ౩౮౮
21. స్వర్ణపర్పటి ,, ... ,,
22. వసంతమాలతి ,, ... ౩౮౯

23. గంధక్ ఇంజక్షను ... ౩౮౯
24. కనకసుందరరస్ ,, ... ,,
25. జవాహిర్ మొహరా ,, ... ౩౯౦

అలోపతి పేటెంటు ఔషధములు.

1. మిల్కు ఆఫ్ మేగ్నిషియా ... ౩౯౧
2. విటామిన్ బి. కాంప్లెక్సు ... ,,
3. వాటర్ భ రిస్ కాంపౌండు ... ౩౯౨
4. పారోక్కోఫెరోక్ ... ,,
5. క్వినిన్స్ మలేరియా మిక్చర్ ... ౩౯౩
6. సిల్ డ్రిక్ టానిక్ ... ,,
7. జెఫ్రోల్ ... ౩౯౪
8. ఈనోస్ ఫ్రూట్ సాల్టు ... ,,
9. లివర్ జన్ ... ,,
10. కాల్ బిస్మా ... ౩౯౫
11. ఎంబజైన్ ... ,,
12. ఎలిక్జిర్ గ్లిసరోట్ ... ,,
13. పెన్ కిల్లర్ ... ,,
14. పెప్సిన్ బిస్మత్ కో ... ౩౯౬
15. బైకో లెట్సు ... ౩౯౭
16. లివోక్విన్ ... ,,
17. యెలిక్జిర్ హెమోగ్లోబిన్ ... ,,
18. క్వినాగ్లోబిన్ ... ౩౯౮
19. అయోడైజ్డు సరసపరిల్లా ... ,,
20. ఎపిడ్రెక్స్ ... ,,

అల్లోపతి ఔషధయోగములు.


| | | |
|---|---|---|
| 1. మలేరియా జ్వరమునకు మిక్చరు | ... | ౨౦౨ |
| రెండవవిధము | ... | ,, |
| 2. జ్వరములకు మిక్చరు | ... | ౨౦౩ |
| రెండవవిధము. | ... | ,, |
| 3. కడుపునొప్పికి మిక్చరు | ... | ౨౦౪ |
| 4. పాండువ్యాధికి మిక్చరు | ... | ,, |
| 5. దగ్గులకు మిక్చరు | ... | ,, |
| 6. క్షయవ్యాధులకు మాత్రలు | ... | ౨౦౫ |
| 7. జీర్ణశక్తికి మిక్చరు | ... | ,, |
| 8. నీళ్ల విరేచనములకు | ... | ౨౦౬ |
| 9. గుండెవ్యాధులకు | ... | ,, |
| 10. మలబద్ధకమునకు | ... | ౨౦౭ |
| 11. బలహీనమునకు | ... | ,, |
| 12. గర్భస్రావమునకు | ... | ౨౦౮ |
| 13. సన్నిపాతజ్వరమునకు | ... | ,, |
| 14. శుక్రనష్టమునకు | ... | ,, |
| 15. తిమురువాయువునకు | ... | ౨౦౯ |
| 16. చర్మవ్యాధికి | ... | ,, |
| 17. గనేరియావ్యాధికి | ... | ౨౧౦ |
| 18. మూర్ఛకు | ... | ౨౧౧ |
| 19. కలరావ్యాధికి | ... | ౨౧౨ |
| 20. కామిలకు | ... | ,, |
| 21. తలనొప్పికి | ... | ,, |
| 22. కీళ్ళనొప్పులకు | ... | ౨౧౩ |

| సంఖ్య | | పుట |
|---|---|---|
| 23. జలోదరమునకు | ... | ౪౧౩ |
| 24. బ్రాంకో న్యూమోనియాకు | .... | ౪౧౪ |
| 25. చెవిపోటుకు | ... | ,, |

ఆయుర్వేదిక్ కంపౌండింగ్

| | | |
|---|---|---|
| 1. మలేరియా మిక్చర్సు | ... | ౪౧౬ |
| 2. రెండవ విధము | ... | ,, |
| 3. కడుపునొప్పికి | ... | ,, |
| 4. పాండురోగమునకు | ... | ౪౧౭ |
| 5. దగ్గులకు | ... | ,, |
| 6. క్షయవ్యాధులకు | ... | ౪౧౮ |
| 7. జీర్ణశక్తికి | ... | ౪౧౯ |
| 8. నీళ్ల విరేచనములకు | ... | ౪౨౦ |
| 9. గ్రహణివ్యాధికి | ... | ,, |
| 10. గుండెవ్యాధులకు | ... | ,, |
| 11. మలబద్ధకమునకు | ... | ౪౨౧ |
| 12. బనహీనతకు | ... | ,, |
| 13. శ్వేతప్రదరములకు | ... | ,, |
| 14. నంజులకు | ... | ౪౨౨ |
| 15. శుక్రనష్టములకు | ... | ,, |
| 16. ఆమవాతమునకు | ... | ౪౨౩ |
| 17. చర్మవ్యాధులకు | ... | ,, |
| 18. గనేరియాకు | ... | ,, |
| 19, ఆమ్లపిత్తమునకు | ... | ౪౨౪ |

A

౨౦౨/



గ్రంథకర్త:

డాక్టర్ డి. హనుమంతరావు, ఎ. ఎ. పి. ఎ

ఆయుర్వేదిక్

సికింద్రాబాద్.

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)



సిరంజీలోనికి మందును తీసికొనుట.



సిరంజిలోనికి మందును తీసికొనుట మరొక విధము.



సిరంజీలోనుంచి వాయువును తరిమి వేయుట
ముఖ్య అవసరము.










సరియైన పద్ధతి

ఇప్పుడు రక్తనాళములోనికి సిరంజి సూది

సవ్యముగా ప్రవేశించియున్నదను విషయమును గమనించుము.





సరియైన పద్ధతి
రక్తనాళమునందు సిరంజి సూది ఇప్పుడు
సరియైన పద్ధతిలో గుచ్చబడినది.




తప్పు పద్ధతి
రక్తనాళమునందు సిరంజియొక్క సూది,
ఇప్పుడు తప్పు పద్ధతిలో గుచ్చబడినది.




తప్పు పద్ధతి
రక్తనాళమునందు గుచ్చబడిన సిరంజి సూది
ఇప్పుడుగూడా సరియైన స్థానమున ప్రవేశించక
తప్పు పద్ధతిగానున్నదను విషయమును చక్కగా గుర్తించుము.



**పిరుదుల** కండరములందు ఇంజక్షను యిచ్చుటకు
తగిన తావులను గుర్తించుము.



చేతియొక్క రక్తనాళమునందు ఇంజక్షను ప్రయోగించుటకు
అనువైన రక్తనాళమును గుర్తించుము.



కండరములోనికి ఇంజక్షను యిచ్చుట.



చేతి మడతవద్ద రక్తనాళమునందు ఇంజక్షను
ప్రయోగించుటకు పూర్వము వ్రేళ్ళతో రక్తనాళమును సర్దుచు
స రి చూ చు కొ ను ట.



పాదము ప్రక్కన నేర్పడిన దుష్ట వ్రణములను
మాన్పుటకు కాలియొక్క రక్తనాళమునందు ఇంజక్షను
ప్రయోగము గావించునట్టి పద్ధతిని గమనించుము.



మోచేయివద్ద రక్తనాళముల సంబంధమైన రుగ్మతవల్ల
యేర్పడిన దుష్ట రక్తపుగడ్డకు చేయబడు
ఇంజక్షను చికిత్స.



చేతి మణికట్టువద్ద రక్తనాళముల సంబంధమైన
రుగ్మతవల్ల యేర్పడిన దుష్టతత్వపు గడ్డకు
చేయబడు ఇంజక్షను చికిత్స.



పురీషమార్గమున యేర్పడిన మూలవ్యాధిని నివారించుటకు
చేయబడు ఇంజక్షను చికిత్సయం దొకవిధము.



మోకాలిపై ఇంజక్షను చేయుట.



ప్రకాశకుడు:

కొండా శంకరయ్య

# నా మాటలు

ఈ గ్రంథమును మొదట వ్రాయుటకు నన్ను సర్వ విధముల ప్రోత్సహించి, తమ యమూల్యములగు సలహాల నొసంగిన ఆయుర్వేదకేసరి వి. ఎల్. ఎన్. శాస్త్రి, ఎ. ఐ. ఎ. డి. ఎఫ్, రిజిస్ట్రారు, నందంపూడి అగ్రహారం, అంబాజీపేట పోస్టు, అమలాపురం తాలూకా, తూర్పు గోదావరిజిల్లా వారికెంతయు నాఅభివందనాలు. వారి సలహా, నా అనుభవమును రెండింటిని సమ్మిశ్రితముచేసి నీ "ఇంజక్షన్ గైడ్" నీ విధముగా చదువరుల కందించితిని. ఇందలి గుణగ్రహణములు చదువరులే నిర్ణయింతురు గాక.

ఇందులో గల అల్లోపతి ఇంజక్షనులు, ఆయుర్వేదిక్ ఇంజక్షనులు, అల్లోపతి కంపౌండింగు, ఆయుర్వేద కంపౌండింగు అనుభవపూర్వకముగా వ్రాయడమైనది. ఆయుర్వేద కంపౌండింగులో ఆసవారిష్ట చూర్ణములతో స్వయముగా చేసి చూచి వ్రాయడమైనది.

ఇట్లు
డాక్టర్, డి. హనుమంతరావు,
ఆయుర్వేద వైద్యశాల, సికింద్రాబాద్.

# మా మాట

ఇదివరలో, అనేక ఆంగ్లేయ వైద్య సంబంధమగు పుస్తకములు తెలుగున వ్రాయించి ఆంధ్రుల కందించి వారి ఆదరాభిమానములకు బాత్రులమైతిమి. తెనుగున ఇంజక్షనులు చేయుపద్ధతిగల పుస్తకములు బొత్తిగా లేనందున ఇంజక్షను గైడు పేరుతో మొదటికూర్పు మీకందించి యుంటిమి. ఇప్పుడు అనేకమైన నూతన ఇంజక్షనులతోను విషయములతోను యీ రెండవకూర్పు మీ కందించ గలిగినందులకు మిక్కిలి సంతోషించు చున్నాము.

ఇందల్లోపతి ఇంజక్షనులు ఆయుర్వేద ఇంజక్షనులు అల్లోపతిమిక్చర్సు, ఆయుర్వేద కంపౌండింగు టానిక్సు యిందిమిడ్చి, అనుభవశీయులును, సుప్రసిద్ధ వైద్యులును నగు డాక్టర్ డి. హనుమంతరావు ఎ. ఎ. పి. ఎ, సికింద్రాబాద్ వారిచే మొదట వ్రాయించి, దీనికిగల సర్వహక్కులును వారిచే పొందియున్నాము. గాన యిందు కొంతగాని, అంతయుగాని, మార్చిగాని, మార్పుచేయకగాని అచ్చొత్తించు వారిపై మాకు కలిగే నష్టమును సివిల్, క్రిమినల్ చర్యలద్వారా రాబట్టుకొనబడునని ఇందుమూలముగా యెల్లరకును తెలియపర్చడమైనది.

ఇట్లు
కొండా శంకరయ్య
ప్రకాశకులు
కాపీరైట్ హక్కుదారులు

సికిందాబాద్,
**14—2—1953**

# 3

## ఇంజక్షన్ చేయవలసినప్పుడు
## తీసుకోవలసిన జాగ్రత్తలు

---

ఇంజక్షన్ చేయుటకుముందు గమనించవలసిన విధులు:-

సిరంజి సూదిని వేడినీళ్ళలో బాగుగా మరగించి, వేడినీళ్ళను సిరంజిలోనికి లాగి వదలిపెట్టవలయును. సిరంజీ యొక్క భాగములను వేరు వేరుగాజేసి వేడినీళ్ళలో మరగించ వలయును. అట్లు మరగించిన తరువాత మరలి చల్లారిన నీళ్ళతో శుభ్రముగ కడిగి పిమ్మట, శుభ్రముగా నున్నట్లుచూచి ఇంజక్ష నిచ్చుట చాలమంచిది. అంత జాగ్రతగా శుభ్రము చేయనియెడల ఇంజక్షన్ చేసినచోట వాపు, బాధ, పోటు యేర్పడును, రోగికి ఇంజక్షన్ చేసేచోట కార్బాలికుసబ్బుతో శుభ్రముచేసి టించరుఅయిడిన్ వ్రాసి ఇంజక్షన్ చేసిన యేబాధయు లేకుండ నుండును. తరువాత ఇంజక్షన్ పెట్టెయందు గల ఆంపుల్సును రంపముతోకోసి సిరంజిలోనికి యంపుల్సు లోపల గల మందును లాగుకొన వలయును. సిరంజిని పైకియెత్తి గాలిబుడగలు లేకుండ చేయవలయును. గాలి బుడగలుయుంటే చాల ప్రమాదము సంభవించును. గనుక ఈ విషయమునందు చాల జాగ్రతగాయుండి గాలిబుడగలు లేకుండ తరిమివేయవలయును. చేతులు శుభ్రముగా కడుగుకొని సిరంజీని నిట్టనిలువుగ

చేబట్టి మందును రెండుమూడు చుక్కలు ముందు పైకి వదలిన సిరంజీలోని గాలిబుడగలు గాలి మొత్తము సిరంజి నుండి బయటికి వెడలిపోవువరకు పిష్టనును పైకి నెమ్మదిగా నొక్కి పిదప అంతయు సరిచూచుకొని ఇంజక్షనియ్యవలెను. అట్లిచ్చిన తర్వాత సూదిని, సిరంజీని డెటాల్‌తో శుభ్రము చేసి సూదియందుండు సన్నని తీగకు, తెల్లవాజులేను వ్రాసి, సూది బెజ్జములోనికి యెక్కించవలయును. సూదికి త్రుప్పుపట్టకుండ నుండును. సూది యెల్లవేళలయందు విడిగా నుండవలయును. సూది మొద్దుబారిన యెడల మరొక క్రొత్తసూదిని మార్చవలయును. అట్లు మార్చక బలవంతముగా చేయుచో ఇంజక్షన్ చేసినచోట అమితమగు బాధ కలుగును. ఇంజక్షన్ చేసే ముందు డెటాల్‌తో ఆస్థలమును శుభ్రము చేసిన చాలా మంచిది.

### ఇంజక్షన్ చేయుటకు కావలసిన పరికరములు.

2 CC సిరంజి పెట్టె ఒకటి.

5 CC సిరంజి పెట్టె ఒకటి.

10 CC సిరంజి పెట్టె ఒకటి.

పరిశుభ్రమైన అర్ధపౌను తెల్లనిదూది.

రెండు ఔన్సులు టించరు అయిడిన్.

నాలుగుఔన్సుల కార్బాలికు సబ్బు.

స్పిరిటు ల్యాంపు ఒకటి. డిస్టిల్డు వాటరు 10 CC అర్ధడజను తెల్లవాజులేసు. మేడికల్ సంబంధమునకు పనికివచ్చునది. సిరంజిపైపై త్రుప్పుపట్టకుండ దాచుకొన వలయును. సూదులు, సిరంజీలు అన్ని వేళలయందు శుభ్ర ముగా నుంచుట మంచిది. వ్యాధిగలవారి కప్పటికప్పుడు ఇంజక్షను యిచ్చుటకు వీలుండును. ఇంజక్షన్ అంపుల్సుపై 1CC 2CC 5CC 10CC అని వ్రాసియుండును. 1CC అనగా (ఒక క్యూబికు సెంటుమీటరు) ఒక క్యూబికు సెంటు మీటరు పరిమాణముగా స్వచ్ఛమైన నీరు ఒక గ్రాము బరువుయగును. 17 చుక్కల ద్రవ పరిమితియనియందురు. సూదిని చర్మముక్రింద గ్రుచ్చి ఔషధము విడచుదానిని హైపొడరుమికు, ఇంజక్షన్ అనబడును. చేతిదండ చర్మ మునకు తీయుచుందురు. సూదిని మాంసకండరము లోనికి గ్రుచ్చి ఔషధము విడచుదానిని ఇంట్రిమస్కులరు ఇంజ క్షన్ అందురు. పిఱ్ఱపై ఉండు గట్టి కండరములోనికి తీయుచుందురు. సూదిని చేతిపైనుండు పెద్దనరము రక్త నాళములోనికి విడచుదానిని ఇంట్రివీనసు ఇంజక్షన్ అందురు. ఈ ఇంజక్షన్ చేతిమడతవద్ద పెద్దసిరాలోనికి యెక్కించవలయును. ఈ ఇంజక్షన్ చాల ప్రమాదమం దురు. జాగ్రతగాచేసిన చాల బాగుగా నుండును. ఈ సూది మందు చర్మముక్రిందకు పోయిన ఉబ్బుట పోట్లుమంటలు గలుగును. చాల జాగ్రితగా అనుభవముతో చేసిన యేమా

త్రము అపాయము గలుగదు. ఇంట్రవీనసు ఇంజక్షన్ నెమ్మదిగా చేసిన చాలమంచిది. మనగ్రామములలో యీ మూడు విధముల ఇంజక్షనులు చేయుచుందురు.

హైపొడర్మిక్ ఇంజక్షన్ చర్మముక్రింద విడచుటకు సూదిని చర్మములోనికి యేటవాలుగ గ్రుచ్చవలయును. దీనినే చర్మవస్తి ఇంజక్షననబడును. ఇంట్రి మస్క్యులరు ఇంజక్షన్ చర్మముక్రింద ఇచ్చు ద్రవముకంటె శరీరములోనికి పోయి హెచ్చుగా పనిజేయును. సామాన్యముగా ఈ ఇంజక్షన్ పిఱ్ఱపై నుండు కండరములోనికి యివ్వవలయును. రోగిని బోర్లగా పరుండబెట్టి సూది యెముకలకు తగులకుండ యివ్వవలయును. ఎముకలకు తగిలిన నమితమగు బాధ కలుగును. కాలు నరము సమీపమున పడిన యెక్కువబాధ కలుగును. జాగ్రతగా స్థలము నిర్ణయించి యివ్వవలయును. చర్మమునకును, సూదికిని ఎనిమిది డిగ్రీలు వాటముగా నుండునట్లు చూచుకొని కండరము లోనికి లోతుగా సూదిని గుచ్చి మందును వదలుదానిని ఇంట్రమస్క్యులరు ఇంజక్షన్ యని యనబడును. దీనిని కండరవస్తి అందురు. ఇంట్రవీనసు ఇంజక్షన్ ద్రవము శరీరములో వెంటనే పనిజేయవలెనన్న ఔషధము రక్తనాళములోనికి యెక్కించుట మంచిది. ఔషధములు చర్మము క్రిందను కండరములోనికి చక్కగా యివ్వవచ్చును. ఈ ఇంజక్షన్ సామాన్యముగా చేతియొక్క పెద్దసిరాలో జేసె

దరు. రోగిని బల్లపై పరుండబెట్టి చేతిని చాపవలయును. దండపైన త్రాడునుగాని, రబ్బరునుగాని చుట్టి నరములు ఉబ్బునట్లుగా కట్టవలయును. బాగా తేలిన పెద్దనరమును గమనించి కార్బాలికు సబ్బుతో శుభ్రముజేసి వెంట్రుకలు లేకుండ జూచుకొని టించరు అయిడిన్ రుద్దవలయును. సిరంజిని నిటారుగా పట్టి దానిలోని గాలిబుడగలు యేమాత్రమును లేకుండ జూచి, ఒకానొక సమయముననున్న తరిమివేసి ఇంజక్షను చేయవలెను. గాలిబుడగలే యున్న యెడల యవి వెంటనే రక్తములోనికి ప్రవేశించి ప్రాణాపాయము గలుగజేయును. గనుక ఈఇంజక్షన్ చేయువారు బహు ఆలోచనతో గమనించి చేసిన చాల మంచిది. పొంగిన నరమును చేతితో నొక్కి ఆనరమును గుర్తెరిగి సూదిని అర అంగుళమువరకు మొనను పోనియ్యవలెను. చేతిని కదలనివ్వకుండగ చూచుకొనవలయును. సూది సరాసరి రక్తనాళములోనకు ప్రవేశించిన వెంటనే రక్తము సిరంజీలోనికి కొంచెముగా వచ్చును. వెంటనే చేతికి కట్టిన కట్టును విడువవలయును. ఇంజక్షన్ ఔషధమును చాల నెమ్మదిగా విడువవలయును. అతురతకొలది ఔషధమును తొందరగా యెక్కించగూడదు. సామాన్యముగా ఒక నిమిషమునకు 1 CC ఔషధము యెక్కించవలయును. ఒకవేళ రక్తము సిరంజీమొనకు రానియెడల వెంటనే సూదిని బయటకులాగి యింకొక చేతినరమునకు యెక్కించ వల

యును. రక్తము సిరంజీమొనకు వచ్చినపిదప చూచి ఔషధము వదలుచుండవలయును. రక్తము సిరంజీ మొనకు రానిదే ఔషధము విడువరాదు. విడచినయెడల గొప్ప ప్రమాదము సంభవించును. ప్రమాదమేకాక ప్రాణాపాయముకూడ కలుగుటయందు యేమాత్రము సందేహము లేదు. ఔషధము సరిగా రక్తసిరాకు యెక్కినవెంటనే ముక్కులలోనికి, నోటిలోనికి ఔషధముయొక్క వాసన అప్పటికప్పుడె కనిపించును. అప్పుడు డాక్టరుగారుగాని, ఇంట్రవీనసు ఇంజక్షను యిచ్చేవారుగాని, ఇంజక్షన్ రక్తనాళమునకు సరిగా ప్రవేశించినదని గ్రహించుకొనవలయును. పాషాణ సంబంధమైనవి సల్ఫరు సనాల్ యిత్యాదులను బాగా. వాడుటకు అనుభవముతో యెరుంగవలెను. ఆఇంజక్షనులుతొందరలో ప్రాణాపాయమును గలుగజేయును. మనము యేఇంజక్షనులుచేసే వేళలయందు ఆ ఇంజక్షనులుచేయుటయెరింగి వాటిగుణములుతెలిసికొని,వాటిమోతాదులుగమనించి ప్రకృతి, రోగిబలము, వారికి యింతకముందేవ్యాధిగలదో, ఆ వ్యాధికి యే యే ఔషధము లుపయోగించారో యెందుచేత మరల యీ వ్యాధి అంకురించిందో, పూర్వమందు సుఖవ్యాధులేవైన శరీరమునందు జీర్ణించి యున్నవా, యెన్నాళ్ళ క్రితమని వాటి స్థితిగతులు తర్జన భర్జన జేసి యింజక్ష నిచ్చుట మంచిది. గాని కారణము విచారించకుండ కంగారుపడి ఇంజక్ష నిచ్చిన అపాయము

కలిగి చెడ్డవైద్యుడను పేరు వెనువెంటనే తన యూరంతయు ప్రాకిపోయి, తన జీవనోపాధికి దెబ్బకొట్టి, తనకీర్తిని మంటగలిపి, తన ఆసుపత్రిని గబ్బిలముల శాలగా మార్చి వేయును. కాబట్టి యెంతటి పేరు మ్రోగిన డాక్టరైనను తన విధిని నిర్వహించుటలో యేమరుపాటు యెంతమాత్రమును పనికిరాదు. ఇంజక్షన్ యెందుకిచ్చుచున్నావో తెలియునా? రోగిని నిరోగిని చేయుటకు. వేళననుసరించికూడ ఇంజక్షనిచ్చుట మంచిది. రోగికన్నులు మూతలుబడి ఔషధము మ్రింగుటకు అశక్తుడై యున్నపుడు నీధైర్యమును పురస్కరించుకొని యింజక్షనియ్యవచ్చును. అంతమాత్రము చేత నేమియుగాదు. నీహస్తమే శుభహస్తమైనచో నీ యదృష్టమును హరిహరు లడ్డలేరు.

ఈ కాలములో ప్రతి వ్యాధికి ఇంజక్షనిచ్చుటయే మంచిదని యందురు. కాని, ఇంజక్షనిచ్చిన యెప్పటికప్పుడు వ్యాధిబాధలు నివారించునేగాని దానికి మానవలోకమునందు హెచ్చుస్థాయిలేదు. ఇప్పుడిప్పు డుద్భవించుచున్న నూతన వ్యాధులకు పాత ప్రణాళిక లేమి పనికివస్తవి. క్రొత్త సరిక్రొత్తవ్యాధు లుద్భవించు చున్నవని పెద్ద లనుచున్నారు. కాలము మారినందువలననో, మనవారి ప్రవర్తనలే సరిగా లేనందువలననో క్రొత్తరోగములే కానవచ్చుచున్నవి. నేను మాతాత తండ్రులనుండి అనువంశికముగా వచ్చుచున్న వైద్యవిద్యను బురస్క

రించుకొని, ఆయుర్వేదమే గొప్ప పటుత్వముగలదని నేను చెప్పుటకు సాహసించుచున్నాను. నవభారతములో ఆయుర్వేద యింజక్షనులు కూడ యవతరించి సర్వరోగ నివారణము లగుచున్నవి. అందుకనే ఆయుర్వేదశాస్త్ర మన్ని శాస్త్రములకన్న మిన్నయని చెప్పకతప్పదు. మన భారతీయులు ఆయుర్వేదమును పునరుద్ధరించి ఆయుర్వేద శాస్త్రమున కఖండయశోవిశాలమగు కీర్తి నార్జించి, తమ యశశ్చంద్రికలు దిక్తటములయందు పిక్కటిల్లునట్లు జేయుదురుగాకయని ప్రార్థించుచు నింతటితో విరమించుచున్నాడను.

ఇట్లు

గ్రంథకర్త.



# ఇంజక్షన్ విధానము.
# ఆయుర్వేదసమ్మతమా?

---

"ఇంజక్షన్" అనగా సామాన్యార్థ్యము తగిన పని ముట్టుతో శరీరములోనికి ఔషధద్రవమును ప్రవేశపెట్టుట. పిచికారులతో గాని అటువంటి పనిముట్టుతోగాని ప్రవేశ పెట్టబడు పద్ధతినే వైద్యశాస్త్రమున ఉపయోగింపబడు పదము "ఇంజక్షన్" అను మాట వాడుకలో నున్నది.

వేదకాలము మొదలు వాగ్భటునికాలము వరకు మనదేశమున ఆయుర్వేద వైద్యాంగములగు "సూచీముఖ యంత్రి" "శల్య తంత్రము" మొదలగునవి మిక్కిలి ఉచ్ఛదశలో నున్నట్లును శుశ్రుతాది శస్త్రచికిత్సా నిపుణులు గొప్ప గొప్ప రోగములకు శస్త్రచికిత్సలు సూచీముఖ యంత్ర ప్రయోగములు జయప్రదముగా జరిపినట్లు చరిత్ర కాధారములు కనబడుచున్నవి. రెండువేల సంవత్సరము లకు పూర్వమే శస్త్రచికిత్సయందు సూచీముఖ యంత్ర ప్రయోగముల యందును పూర్వాచార్యులకు గల నైపుణ్య మును జూచి ఈకాలపువారు ఆశ్చర్యమును పొందుచుండ అత్యంతము సల్పవిషయమగు "ఇంజక్షన్" ల పద్ధతి

ఆయుర్వేదమున లేదనుటగాని దేశీయవైద్యులు వీనిని వాడ రాదనుటకు గాని వీలులేదని అంగీకరింపక తప్పదు.

సూచీకాభరణ రసము, సూచీముఖరసము, పాశు పతాస్త్రరసము, బ్రహ్మాస్త్రరసము, అఘోరాస్త్రరసము ఈ మొదలగు ఔషధములను "సూచీ" వ్యధనముచే వాడు చుండినటుల నిదర్శనములు కనుపించుచున్నవి. వీనిని బ్రహ్మద్వారమునగాని, తాలుప్రదేశమునగాని, శిరస్సున గాని చీరి సూదితో యిట్టి ఔషధములను ప్రవేశపెట్టుచుం డెడివారు. ఇట్టి ఔషధములు రక్తముతో కలియుటతోడనే అపాయస్థితియందున్న వ్యాధికూడ ఆరోగ్యముపొందునని కొన్ని ప్రాచీన ఆయుర్వేద గ్రంధములయందు చెప్పబడి నది. వీనివాడుక నేటికిని ఆయుర్వేదవైద్యమున గలదు. వీని ఫలితములను మనము చికిత్సాచరణమునకును గాను చునే యున్నాము.

ఇందుకు ఉదాహరణము.

శ్లో॥ యావత్స్వాచ్యాముఖేలగ్నం । కూప్యానిర్యాతిభేషజం
తావన్మాత్రో రసోదేయో । మూర్ఛితేసన్నిపాతిని॥
క్షురేణప్రచ్ఛితేమూర్ధ్ని । తత్రాంగుళ్యాచ ఘర్షయేత్
రక్తభేషజసంపర్కా । న్మూర్ఛితోపిహిజీవతి॥

(సూచికాభరణరసము - బసవరాజీయము ద్వితీయప్రకరణము.)

బ్రహ్మద్వారేక్షురేణైవ । క్షతంగుంజావిమర్దితం ॥

(సూచీముఖరసము - బసవరాజీయము ద్వితీయప్రకరణము)

బ్రహ్మద్వారేవికేర్ణలోహీత । లవేసంజైకమాత్రందదేత్॥

(సూచీముఖరసము - రసరత్నసముచ్చయము ఉత్తరఖండము CH 12)

ఈ ఔషధములకు రక్తసంయోగము కలిగి శరీరమంతట త్వరితగతిని వ్యాపించి రోగహర మగుచున్నది. ఇందుసూదితో ఔషధపరిమాణ నిర్ణయము జరుగుచున్నది. నవీన వైద్యములోని ఇంజక్షన్ విధానము దీనిపై అభివృద్ధి చేయబడినది. ఔషధములు రక్తముతో కలియుటచే వెంటనే సర్వశరీరమున వ్యాపించు చున్నది.

---

## పచ్చపొడుచు విధానము.

అతి ప్రాచీన కాలమునుండి పచ్చపొడుచు ఆచారము మన దేశమునందే గాక. విదేశములందు కూడ ఆ చరణలో నున్నట్లు తెలియుచున్నది. మందుల నమ్ము దేశదిమ్మరులు కొందరు పచ్చ పొడుచుట వృత్తిగా పెట్టుకొని వీధులవెంట యిందు నిమిత్తమై తిరుగుచు మందుల నమ్ముచుందురు. నేటికి మనము వీరిని చూచుచునే యున్నాము. అనేకులు వీరిని పిలిచి సొమ్మిచ్చి పచ్చ పొడిపించుకొందురు. దేహమంతయు పచ్చలు పొడిపించుకొనుట వల్ల శీతోష్ణములనుండియు, విషకీటకముల బాధల

నుండియు, శరీరమురక్షింప బడుననియు, మరియు శరీర మునకు అలంకారమును. యుద్ధమున భీకరస్వరూపమును కలుగునని కొందరి నమ్మకము.

రెండు మూడు సూదులు కట్టగాకట్టి కాకరాకు పసరున గాని సోరాకు పసరునగాని సూదులు ముంచి ఆ సూదులచే శరీర భాగమునందు పొడుచుటకే పచ్చ పొడుచుట యందురు. అంతట ఆ పొడుపులకు నెత్తురు చెమర్చి క్రిమముగా ఆరి పోవును. కొందరికి ఆనాడో లేక మరునాడో జ్వరము కూడవచ్చును. ఈపచ్చ పొడుచు ఆచారము కేవలము అనాగరక పద్ధతి యనియు, మూఢాచారమనియు కొందరు నిరసించుచున్నను, ఇందేదో కొంత అర్థముండుట చేతనే నేటివరకు ఈ ఆచారము రూపుమాయకున్నది. చిరకాల గతమైన చలిజ్వరముచే, ప్లీహాభివృద్ధి నొంది బాధపడుచుండు ఒకానొక స్త్రీచేతి దండమీద తన పేరు పొడిపించుకొన్నంత మాత్రిమున ఆరోగ్య వతియైనదని కొందరు స్వయముగా నెరిగి యున్నారు. ఈ పద్ధతి ఆరోగ్యరక్షకమను నమ్మకముతో పాటు వ్యాధి నివారకముగా కూడ నుండుటజూడ ముసలమ్మలచే నాచరింపబడు ఈ మోటువ్యాపారము గూడ "ఇంజక్షన్" పద్ధతికి ప్రాతిపదికగా నున్నదని మనము అంగీకరింపవలసి వచ్చుచున్నది. నేడు హెచ్చుగా చెప్పబడుచున్న 'ఫారన్-ప్రోటిన్ థిరపీ' రహస్యమింతకంటె వేరైనది కానేరదు.

"సూచీముఖ యంత్రిము" ద్వార రక్తము లోనికి ఔషధ ద్రివమును ఎక్కించుటయే యిందు ప్రధానకర్మ. అందుకే అల్లోపతీయులు రక్తనాళములోనికి ఎక్కించుచునే యున్నారు.

వివిధ వ్యాధులకు ఇంజక్షన్ రూపమున మందులను వాడు పద్ధతి పూర్వీకులకు తెలియక పోలేదు. చరక, సుశ్రుతాదులనుండియే భిన్నభిన్న శాఖలుగల వివిధవైద్య పద్ధతులు బయలు వెడలినవి. ఇందునుగురించి వర్ణన ఆయుర్వేదములో లేదనియు యెక్కువగా ప్రిజలు సందేహించుచున్నారు. కాని యిది నిజముకాదు. మనశాస్త్రములోను ఈ పద్ధతి స్పష్టముగా నిరూపింప బడియున్నది. రసశాస్త్రములో ఇట్లు చెప్ప బడినది.

"రక్త భేషజ సంపర్కాన్ మృతావస్థోపి జీవతి"

కొన్ని సంవత్సరముల క్రిందట. బెంగాల్ ఆయుర్వేద రిచేర్చి అధ్యక్షుడు. శ్రీ జగదీశచంద్రిబోసు. మన సూచికాభరణ రసముతో ఒక కప్పకు ఈ ఔషధమును సూదితో ప్రియోగించి దాని జీవముపైనను హృదయగతి పైనను ఆశ్చర్యకరమయిన బలమును కలుగజేసిన విషయము మనకు విదితమైయున్నది. ఈవిధంగానే పాశ్చాత్య వైద్యులు సూదులనుండి ఔషధముల ఉపయోగించు చుండుట విదితము. ఇట్టి ప్రియోగములయందు ప్రాచీన

కాలమునాటి ఆర్యులు నేర్పరులనుట కనేక ప్రమాణములు కనఁబడుచున్నవి. నవీన యంత్రశస్త్రముల స్వరూపము ప్రయోజనము పరిశీలించి చూచినచో నేటివన్నియు చాల వరకు ప్రాచీనకాలపు ఆయుర్వేదశాస్త్రము ననుసరించి యేర్పడినవేనని కూడ తెలియగలదు. ఈ విషయములు విస్తారముగా తెలిసికొన గోరు మా వైద్యసోదరులు నాతో ప్రత్యేకముగా కలసి మాట్లాడవచ్చును. గ్రంథవిస్తరభీతిచే నెక్కువగా వ్రాయక ముఖ్యమైన విషయములనే వ్రాసి యున్నాడను.

నేడు విదేశవైద్యంలో వాడుకలోనున్న యంత్రశస్త్రములన్ని ఆయుర్వేదము ననుసరించి యేర్పడినట్లు తెలియుచున్నది. యిందుముఖ్యంగా చూడతగిన గ్రంథము "సర్జికల్ ఇన్‌స్టుమెంట్సు ఆఫ్ హిందూస్" అను గ్రంథము శ్రీగిరీంద్రనాథ్ ముఖర్జీ బొంబాయినివాసి రచించినది.

ఆయుర్వేద వైద్యశాస్త్రమున ఇట్టిపనులకు తగు యంత్ర సాధనములు లేవని వాదసౌకర్యమునకై అంగీకరించినను అవసరమునుబట్టి నూతన యంత్ర పరికరముల నిర్మించుకొనుటకుగాని వాడుటకుగాని శాస్త్రకారులు అనుజ్ఞయిచ్చియే యున్నారు. నేడు ఇంజక్షన్‌లకై వాడబడు పలురకముల పిచికారులు దేశకాల పరిస్థితులను బట్టి అందరును పరిగ్రహింప తగినవేననుటగూడ శాస్త్రరీత్యా పైవాక్య

ములవల్ల సిద్ధించుచున్నది. ఈ పరిస్థితులలో ఔషధమును శరీరములోనికి ప్రవేశపెట్టు సూచీముఖ యంత్రసాధనము మనకులేదని చెప్పువారుండరు. ఇక నీ విషయము ఆయుర్వేద శాస్త్రసమ్మతమే యగుచో ఆశాస్త్రమునందు చెప్పబడిన సాధనములతో ఆఔషధములను ఏల వాడుచున్నారను ఆక్షేపణ రాగలదు. ఈ ప్రశ్నకు లోక ప్రవృత్తియే సమాధాన మీయగలదు. దేశకాల పరిస్థితులనుబట్టి మార్పునొందని దేదియునులేదు. చైతన్యమయమగు లోకము యెడతెగక అభివృద్ధి నొందుచున్నప్పుడు లోకశ్రేయమును గోరి ప్రవర్తిల్లిన శాస్త్రములు అభివృద్ధి నొందుచుండుట సహజము. నేటి సిరంజి నిర్మాణము సాజూకుగా నున్నప్పుడు మనము దానిని వాడుట తప్పగునేని ఇట్టి సౌకర్యములను ఉపయోగించుకోలేని మనము ఈకాలమున ఉండుటయే ఒక తప్పుగా పరిగణించు కొనవచ్చును. మానవ బాధా నివారణమే వైద్యశాస్త్ర ప్రయోజనము. అసలు ఈ పద్ధతి మంచిదికాదని వాదించువైద్యులులేరు. ఇందు నమ్మకముండి వాడగోరువారు ఆయుర్వేద సూచీముఖ యంత్రముద్వార ఔషధముల ప్రయోగించి ప్రజాసామాన్యమునకు మన వైద్యముపై ఆదరాభిమానములు, పురోభివృద్ధికి వలయుమార్గముల ననుసరింప జేయవలసియున్నది.

ఆయుర్వేద ఇంజక్షనులు తయారుచేసే సంస్థలు నేడు దేశమున బహు ప్రచారములోనున్నవి. ఆయుర్వేద

వైద్యులందరును విరివిగా కొలదికాలమునుండి ఉపయో గించుచునే యున్నారు. శాస్త్రరీత్యా వీని పుట్టుపూర్వోత్త రములు విచారించి ఆయుర్వేద వైద్యశాస్త్రమున ఇంజ క్షన్ పద్ధతి నిరూపించబడి యున్నదోలేదో లోకమునకు తెలుపవలసిన బాధ్యత యిప్పుడు మనందరిపై కలదు. ఇట్టి విమర్శనకు గడంగుటకు ముందు ఇంజక్షన్ శిక్షణ పొం దుట ముఖ్యావసరమై యున్నది. ఇంజక్షన్‌విధానము ఆయు ర్వేద శాస్త్రమునకు క్రొత్తకాదు. ఆయుర్వేద వైద్య శాస్త్రిను సారముగా వాటి రసవీర్య విపాకాదులను పరి శీలించి వాడుటకు ఈ శాస్త్ర మర్యాదల నెరిగినవారెవ రును అభ్యంతర పెట్టజాలరు.



# పెద్దల అభిప్రాయములు

Dr. ఆచంట లక్ష్మీపతి B. A. M. Bc. యం. గారి అభిప్రాయము.

వివిధవ్యాధులకు ఇంజక్షనుల రూపమున మందులను వాడుపద్ధతి పూర్వీకులకు తెలియకపోలేదు. చరక సుశ్రుతాదులనుండియే భిన్నభిన్న శాఖలుగల వివిధ వైద్య పద్ధతులు బయల్వెడలినవి.

సూతికాభరణమను ఔషధమును రక్తములోనికి ప్రవేశ పెట్టబడు పద్ధతి చెప్పబడియున్నది.

స్వర్గీయ ఆయుర్వేద పునరోద్ధారక.

పండిత D. గోపాలాచార్యులు గారు ద్వితీయ ద్రావిడ వైద్య మహాసభ తిరువహీంద్రపురం అధ్యక్షోపన్యాసం.

పిచికారీద్వారా ఔషధమును రక్తములోనికి ప్రవేశ పెట్టబడు పద్ధతిని డాక్టరులు క్రొత్తగా కనిపెట్టి యున్నారనియు, దాని ప్రచారమును ఆరోజు కారోజు వృద్ధిచేయుచున్నారనియు ఇందును గురించిన వర్ణన ఆయుర్వేదములో లేదనియు యెక్కువగా ప్రజలు సందేహించుచున్నారు.

కాని యిది నిజముకాదు. మన శాస్త్రములో ఈపద్ధతి స్పష్టముగా నిరూపింపబడి యున్నది.

త్ర్యంబకలాల్ త్రిభువనముని గుజరాత్ వైద్య సమ్మేళన అధ్యక్షోపన్యాసము.

సూదులచే ఔషధముల ఉపయోగము. ప్రకృత కాలమున పాశ్చాత్య వైద్యులు సూదులనుండి ఔషధముల నుపయోగించుట విదితము. ఇట్టి ప్రయోగముల యందును ప్రాచీనకాలముననే ఆర్యులు నేర్పరులనుట కనేక ప్రమాణములు కనబడుచున్నవి. అందు రసరత్న సముచ్చయ మందలి సన్నిపాత ప్రకరణమందిట్లు నిరూపితము. తీవ్ర సన్నిపాత వ్యాధియందు తాలు (చెలివెలు) ప్రదేశమున చిల్వి మిక్కిలి వాడియైన మొనగల సూదిచే ప్రయత్న పూర్వకముగ సూచికాభరణము నుపయోగించునది. బ్రహ్మ ద్వారమున చీలి నెత్తురు వచ్చినమీద సూచీముఖరసమును ఉపయోగించునది.

ఉపోద్ఘాతము, రసప్రదీపిక పుట (XVI)

1. M. విశ్వేశ్వర శాస్త్రి H. P. I. M. ప్రిన్సిపాల్ ఇండియన్ మెడికల్‌కాలేజు. మద్రాసుగారి అభిప్రాయము కూడ యింతే.

2. అరవింద కెమికల్ వర్క్సు. ప్రముఖ ఆయుర్వేద ఇంజక్షనులు తయారుచేసే సంస్థ చెందువార M. P. వారి యొక్కయు.

3. ది. అపొల్లో ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్ బరోడవారి యొక్కయు.

4. ఆంధ్రదేశమున గల ప్రముఖ ఆయుర్వేద ఇంజక్షనులు తయారుచేయు సంస్థయొక్క కర్త, వైద్య విద్వాన్ దూబగుంట సుబ్రహ్మణ్యం ఇండియన్ మెడిసన్ హౌసు విజయవాడ వారి యొక్కయు.

5. హోమియోపతి మెడికల్ హాల్ Dr. B. L. నారాయణరావు. కింతాడ కోటపాడు విశాఖజిల్లా, వారి యొక్క అభిప్రాయ మేమన,

ఆయుర్వేదములో ఇంజక్షను వైద్యవిధానమున్నది. ఇది చాలకాలము క్రిందటనే ఆచరించబడినది. ఇప్పుడు క్రొత్తగాదని నా అభిప్రాయము.

6. సంపాదకుడు ధన్వంతరి మాసపత్రిక. వేటూరి శంకరశాస్త్రి ఆర్షరసాయనశాల ముక్త్యాల క్రిష్ణాజిల్లా వారి యొక్క అభిప్రాయముకూడ యింతే.

7. లేడి డాక్టర్ కమలారాణి పబ్లిసిటి కార్యదర్శి. ఆల్ఇండియా మెడికల్ Exhibition Xth. Grand Session of U. P. Provincial Homoeopathic Medical Conference బేరిలి U. P. గారి యొక్కయు.

8. Dr. C. P. Samuel B. Ph. C. A. V. M. మెంబర్ of. ది. ఆల్ఇండియా మెడికల్ సొసైటి కాళహస్తి గారి యొక్కయు.

9. వైద్యభిషక్ G. రామశర్మ R. M. P. అనంతాపూర్ గారి యొక్కయు.

ఇంకా యెందరెందరో ఆయుర్వేదోద్ధారకులగు పెద్దలగు వారలు ఆయుర్వేద వైద్య విధానమునకు ఇంజక్షన్ విధానము నూతనము కాదనియు ప్రాచీన కాలము నుండియు వాడుకలోనే యున్నాదనియు అభిప్రాయ పడియున్న విషయము మీ అందరిముందు నిరూపించి యుంటిని. నా అభిప్రాయముకూడ వీరితో ఏకీభవించుటకు నాసర్వశక్తిని ఆయుర్వేద ఇంజక్షన్ వైద్యాభివృద్ధి చేయుటయే నా ప్రథమకర్తవ్యము.

ఇట్లు

డి. హనుమంతరావు.

గ్రంథకర్త.

# వ్యాధియొక్క సాధారణమైన పరిస్థితుల యందు ఇంజక్షనుచేయుటకు అనువగు వేళలు.



ఉదయము, సాయంకాల సమయములందు, ఇంజక్షను చేయుట ఉచితము.

క్షయవ్యాధి కొఱకు "స్ట్రెప్టోమైసన్" వంటి ఇంజక్షనులను సాయంకాలము నాలుగు గంటల సమయమున ఇంజక్షను యిచ్చుట మంచిది.

సాధారణమైన అన్ని పరిస్థితులయందు భోజనమైన వెంటనే ఇంజక్షను చేయరాదు. అట్లు చేసినచో ఔషధము గాని తత్వముగాని వెంటనే వికటించవచ్చును. భోజనమైన పిదప రెండు మూడు గంటల వ్యవధికి పిదప యికజక్షను చేయుట మంచిది. క్వినైన్ సంబంధముగా తయారగు ఇంజక్షనులు జ్వరము జారకపూర్వము యీయరాదు, జ్వరము జారుటకు పూర్వము ఒక గంటముందుగాని పూర్తిగా జ్వరము జారినవెనుక ఒకగంటకు గాని యిచ్చుటచే వ్యాధి తిరిగి రాకుండా చేయుటకు వీలుగానుండును.

శరీరమున జ్వరము నిలచియుండగా క్వినైన్ సంబంధమైన ఇంజక్షను యిచ్చుటవల్ల వాంతులు తాపము

భ్రాంతి నిద్రాభంగము ఆయాసము మొదలగు అనేక లక్షణములు సంప్రాప్తించుటకు అవకాశము మెండుగా గలదు. ఇంతియేగాక అట్టి పరిస్థితులలో వ్యాధిని పైలక్షణములను గూడా తగ్గించుటకు నాలుగైదు రోజులు శ్రమ పడవలసి యుండును.

పరిస్థితిని గమనించక అవకతవకగా యిచ్చిన పై ఇంజక్షనువల్ల కొద్దిగా స్వస్థత చేకూరినట్లు గానుపించినను, స్వల్పమైన వ్యవధికి పిదప మరల మరల జ్వరము తీవ్రతనొంది అనేక యిబ్బందులు కల్పించవచ్చును.

ఇట్టి జ్వరమునకు క్వినైన్ నందుగల పైత్య గుణములు లేని ఇంజక్షన్ యివ్వవలసి యుండును. క్వినైన్‌ను బాలురకు బలహీనులగు వారలకు పైత్య స్వభావము (తత్వము) గలవారలకు గర్భిణీస్త్రీలకు యివ్వరాదు. చాలవరకు "సింకోనిన్" క్వినార్స్‌నాల్ వాడవలసి యుండును. "సింకోనిన్" యందు క్వినైన్ గుణములులేవు. జ్వరముపైన ఇంజక్షన్ యివ్వవలసిన క్వినార్‌సిల్ బాగుగా తోడ్పడును. కొద్ది జ్వరముపై సందేహములేక యివ్వవచ్చును. యిందు క్వినైన్ గుణము కనుపించదు. దీనిని కూడ, క్వినైన్‌తో తయారుచేయుదురు. గాని యిందు క్వినైన్ యొక్క చెడు గుణములు కనుపించవు. "క్వినైన్" పడని వారలకు యెన్నడు క్వినైన్ ఇతర ఔషధములలో చేర్చక

యివ్వరాదు. మలేరియా జ్వరమునకు క్వినైన్‌కు మించినది కనుపించదు. మలేరియా క్రిములను సంహరించుటకు క్వినైన్ బాగుగాతోడ్పడును; క్వినైన్‌లో ఆర్సెనిక్ (పాషాణ సంబంధము) చేరియుండుటచే సాధారణమైన క్వినైన్ ప్రయోగము కంటెను దీనిశక్తి అధికమని యెంచబడు చున్నది.

---

## ఇంజక్షన్ చేయు వైద్యుడు శుభ్రముగా నుండుట.

ప్రతి ఇంజక్షన్ వైద్యముచేయు వైద్యుడును శుభ్రముగానుండుట చాల అవసరమై యున్నది. ఇంజక్షన్ చేయునప్పుడు చేతులు; ఇంజక్షన్ పరికరములు శుభ్రముగా నుండుట, చేతులను "లైఫ్‌బాయి సబ్బుతోగాని, డిటాల్‌తో గాని" శుభ్రము చేయవలయును.

రోగికి ఇంజక్షన్‌చేయు స్థలమున లైఫ్‌బాయిసబ్బు లోను డిటాల్‌లోనుకడిగి తర్వాత దూదినిస్పిరిటులోముంచి బాగుగా రుద్దిన, ఆ భాగము బాగుగా శుభ్రమగును. పిదప అట్టి స్థలమున ఇంజక్షను చేయవలయును. ఇంజక్షన్ చేసిన తర్వాత ఆ స్థలమున బాగుగా రెండునిమిషముల పాటు రుద్దుచుండిన మందంతయు తొందరగా శరీరము

నందు ప్రవేశించి రక్తమున కలసిపోవును. ఇంజక్షన్ చేసిన తర్వాత సూదులను సిరంజియొక్క భాగములను మరగించుటగాని, లెదా స్పిరిట్ నందు యుంచుటగాని మంచిదే. యిట్లు చేయనియెడల అందు రక్తకణములలో యుండు క్రిములుగాని లేదా దుష్ట పదార్థముగాని నిలవ యుండి మరల వేరేవారికి ఇంజక్షన్ చేసిన వారికి యితర విధముల వ్యాధులు బాధ సంభవించ వచ్చును. సూదులు మొద్దుబారిన వాటితొ ఇంజక్షన్ యివ్వరాదు. అట్లు చేసినచో రోగికి బాధయేర్పడి ఇంజక్షన్ చేసిన స్థలమున నొప్పి యేర్పడును. మొద్దుబారిన సూదినితీసి క్రొత్తదానితో చేసిన మంచిది. ఇంజక్షన్ చేసిన వెంటనే మరగించు సూదియందుగల రంధ్రమున సన్నని తీగెవుంచుట వలన సూదికి త్రుప్పు దుమ్ము పట్టక శుభ్రముగా యుండును. ఇంజక్షన్ చేసినచో యేమాత్రము నొప్పిలేకుండ నిధానముగా ఇంజక్షన్ చేయుచుండవలయును. ఇంజక్షన్ నుండి వారికి యేబాధలురాకుండ కాపాడుట వైద్యుని కర్తవ్యము. వైద్యుడు ఈ విషయముల యందు ముందు జాగ్రత్త పడ వలసి యుండును.

---

## ఇంజక్షన్ కడుజాగ్రితతో చేయుట.

ఇంజక్షన్ ద్రవము (అనగా) మందు పలచనిదైనచో సన్నని సూదులు వాడవలసియుండును. (అనగా)

No. 16 & 18 Needles వాడవలసి యుండును. ఇంజక్షన్ మందు ఆయిల్ Oil సంబంధమైన యెడల యెక్కువ నెంబరు సూదులు వాడవలసియుండును. సుమారు No. 12 No. 14 No. 1 No- 2 Needles వాడవలయును. యిట్లు వాడుటవలన ఇంజక్షన్ సిరంజినందుండు మందు తొందరగా శరీరమునందు ప్రవేశించును.

ప్రతివారికిని ఇంజక్షన్ చేసిన తర్వాత అయిదు నిమిషములపాటు విశ్రాంతియిచ్చుట మంచిది. ఇంజక్షన్ చేసిన వెంటనే రెండు నిమిషాలపాటు. టించర్ ఆయోడిన్ బాగుగా పూయుట వలన, ఇంజక్షన్ యిచ్చినభాగము నొప్పిలేక యుండును. గుండె బలహీనము గలవారలకు రక్తము సరిగా ఆడని వారలకున్ను ఇంట్రివీనస్ ఇంజక్షను చేయరాదు. చేసిన యెడల ప్రాణాపాయము సంభవించును. గుండెలునిలిపి వేయును. చిన్న వయస్సు వారలకు కూడ, ఇంట్రివీనస్ ఇంజక్షన్ చేయరాదు. ప్రతి వ్యాధులయందు రక్తము సరిగా ఆడునట్లు గ్రహించుటకు హృదయము స్టెతస్కోప్పుద్వారా పరీక్షించవలయును. తరువాత ఇంట్రివినస్ ఇంజక్షన్ యివ్వవలయును. పరీక్షించనిదే ఇంట్రివీనస్ ఇంజక్షన్ యివ్వరాదు.

ఇంట్రవీనస్ ఇంజక్షన్ యందు వైద్యుడు ముందు కడుజాగ్రిత వహించవలయును. యే వ్యాధియందైనను అవసరముకొద్ది ఇంట్రివీనస్ ఇంజక్షనులు చేయరాదు.

అవసరముకొద్ది చేయు ఇంజక్షనులు, చర్మవస్తి, కండర వస్తి ఈ రెండే యెక్కువ చేయుదురు. ప్రతిదినము ఇంట్రివీనస్ ఇంజక్షన్ చేయరాదు. రెండుమూడు దినముల వ్యవధిపైన చేయవలయును. యే ఇంజక్షనైనను డబ్బుకు ఆసించి మాటిమాటికి చేయరాదు. చేసినరోగికి రోగమునకు శ్రమ తీవ్రిత ఆయాసము కలుగుటయేగాక రోగికి గల రోగము నివారించక యితరబాధలు సయితము సంభవించును. యిప్పటికే చాలవరకు వైద్యులు వ్యాధొకటి మందొకటి యిచ్చి వ్యాధులను నివారించలేక నమ్మకము లెని వైద్యులగుచున్నారు. యెందుకగు చున్నారనిన? యే వ్యాధికి యే ఇంజక్షన్ యివ్వవలయునో వారికి తెలిసి యున్నను అప్పటికి వారివద్ద వ్యాధికి తగిన ఇంజక్షన్ లేనందున (లేదా) లభించనందున ధనాభావముచే యేదో ఒకటి వాడుటచే ఈచెడ్డపేరు వచ్చుచున్నది. రోగి వైద్యుని యొక్క ఇంజక్షనుపై నమ్మకము లేనివాడగుచున్నాడు. ఇట్లు డబ్బుకాసించిన వ్యాధులు యెన్నటికి నివారించుట కష్టము. రోగికి ఇంజక్షను లన్నియును, ఒకేస్థలమున చేయరాదు. స్థలములు మార్చుచు యిచ్చుచుండవలయును. ఒకేస్థలమున ఇంజక్షన్ యిచ్చుచుండిన గడ్డకట్టుచుమిక్కిలి నొప్పి సంభవించును. ఇంజక్షన్ (అనగా) సూదియొక్క రంధ్రముద్వారా శరీరములోనికి ఔషధము సులభముగా ప్రవేశ పెటగల సదుపాయము.

# అజాగ్రతగా ఇంజక్షన్ చేసిన సంభవించు అపాయములు

ఇంజక్షన్ చేయుటకు ముందు వైద్యుడు బాగుగా జాగ్రత్త పడవలసి యుండును. ఇంజక్షన్ యిచ్చు స్థలము బాగుగా నిర్ణయించి సూదిని నరమునకు తగులకుండ గ్రుచ్చవలయును. సూది పొరపాటున నరమునకు గాని యెముకకుగాని నరము మొదలగు వాటికిగాని తగిలిన యెడల వ్యాధికి శరీరమునకు అమితమగు బాధలు యేర్పడును. కొన్ని పరిస్థితులయందు గడ్డకట్టి నొప్పికలిగి కొన్ని దినములకు కురుపుగా యేర్పడును. ఇట్లయినచో దీనికి తగు శ్రద్ధతో చికిత్స చేయవలసి యుండును. చాలవరకు నొప్పిగల స్థలమున గోధుమపొట్టుతోను ఉప్పుతోను కాపడము చేయవలయును. పుండుగా మారినదానిని మాత్రము "అయోడెక్సు"ను పైన రాయుటకు ఉపయోగపడును. "డిటాల్"తో పుండును శుభ్రపరచుట వలన పుండును నివారించుటకు గాను దానియందుగల మాలిన్యమును వెడలగొట్టుటకు బాగుగా తోడ్పడును. శరీరమున మాంసము క్రుళ్ళినప్పుడే (సెప్టికు) అని అనుచుందురు. పుండు మానుటకుగాను పుండు తగ్గించే ఆయింటు మెంట్లను వాడవలసి యుండును. పుండునుండి చీము నివారించుటకుగాను యితర విధముల ఇంజక్షనులు చేయవలసి యుండును.

చాలవరకున్ను దియో సల్ఫేటు ఆప్‌సోడియం బాగుగా ఉపయోగపడును. స్థలము నిర్ణయించి ఇంజక్షన్ చేసిన యెడల యేవిధమైన బాధలు సంభవించనేరవు. సూదులను సిరంజిని మరగించని యెడలకూడ (సెప్టిరు) కావచ్చును. యెన్నటికిని యేస్థలమున యీయతగిన ఇంజక్షను లాయా స్థలములందే యీయవలసియుండును.

---

## ఇంజక్షన్ చేయునప్పుడు గాలి బుడగలు సిరంజినం దేమాత్రము లేకుండా చేయుట ముఖ్యావసరము

ఇంట్రవీనస్ ఇంజక్షన్ చేయునప్పుడు సిరంజినందు యేమాత్రము గాలి బుడగలు లేకుండ జాగ్రత పడవలయును. సిరంజినందు గాలిబుడగలు ఇంజక్షను ఔషధము ద్వారా శరీరమునగాని ముఖ్యముగా రక్త నాళము లోనికి ప్రవేసించిన మాత్రమున అప్పటి కప్పుడే ప్రాణాపాయము సంభవించక తప్పదు. సిరంజీని నిటారుగా నిలబెట్టి గాజుకడ్డీని నెమ్మదిగా పైకినొక్కుచు రెండుమూడు చుక్కలమందు సూదిమొననుండి పైకి విడిచిన పిదప గాలి బుడగలు సిరంజీనందు లేవనివైద్యుడు గ్రహించ వలయును. ఇట్లు గాలి బుడగలు లేనిది బాగుగా చూచి, ఇంజ

క్షన్ చేయవలయును. సిరంజినందు యేమాత్రమైనను గాలిబుడగలుండిన యెడల అవి రక్తనాళముద్వారా హృదయమున ప్రవేసించి ప్రాణాపాయము కలిగించును. గాన దీనియందు, బాగుగా జాగ్రితపడవలయును. క్రొత్తవారికి ఈ ఇంట్రివీనస్ ఇంజక్షను ప్రయోగము కష్టమైనదని చెప్పవచ్చును. గాని ప్రాక్టీసు గల వారలకు సులభమైనదనవచ్చును. యెవ్వరైనను ఇంట్రివీనస్ ఇంక్షన్ చేయునప్పుడు ఈ విషయములయందు జాగ్రత పడ వలయును.

---

## ఇంజక్షనే సూచీముఖ యంత్రిము

సూచీముఖ ఔషధ ప్రయోగమని మనపూర్వులు భావించు దానినే ఆంగ్లేయ వైద్యమునందు ఇంజక్షన్ అనుచున్నారు. సూచీముఖయంత్ర విద్య ఆంగ్లేయులకు మన సిద్ధాంతమునుండే లభించినటుల కనబడుచున్నది. మన వైద్య పరిశోధకులు, మాధవుడు శుశృతుడు అశ్వినీ కుమారులు మహర్షులు దీనినికని పెట్టి యున్నారు. పూర్వమున మనవారలు దీనిని యెరిగియే యున్నారు. దీనిని ఆయుర్వేద వైద్యులు సూచి మందనిరి. ఆంగ్లేయులు ఇంజక్షన్ విద్యయని యనుచున్నారు. ఇంజక్షన్ చేయుటకు ప్రతి ఆయుర్వేద వైద్యునకు హక్కు కలదు. సూచీ

ముఖ వైద్యము ప్రతివారికిని యివ్వకూడదనియు అవసరమును బట్టియు ఔషధము శీఘ్రముగా గుణము నిచ్చుటకుగాను, ప్రమాదస్థితి యందు అప్పటికప్పుడే బాధలు నివారించుటకును విషసంబంధమైన ఔషధము మ్రింగిన వేళలయందును, వ్యాధిచే స్పృహతప్పి నప్పుడున్ను ఈ సూచీముఖ ప్రయోగ చికిత్స చేయవచ్చును. ఔషధ ద్రవమును పిచికారి సహాయముచే శరీరములో సూదిద్వారా ప్రవేశపెట్టు దానినే సూచీముఖ ప్రయోగమని నా అభిప్రాయము. దీనిని అల్లోపతి డాక్టరు, ఇంజక్షన్ యని పేరు పెట్టినారు. ఆయుర్వేదమున, సూచీముఖ యంత్రమని దానికి పేరుకలదు. ఆయుర్వేద వైద్యులు ఇంజక్షన్ విధానము మన విద్యకాదని కొందరు అనుచున్నారు. ఇట్టిది మన ఆయుర్వేదమునందు చూచిన, తప్పక ఇంజక్షన్ విద్య మనదేనని ప్రతివారు ఒప్పుకొనక తప్పదు.

---

## ఇంజక్షనులు యెన్ని విధములు.

### (వాటిని ఉపయోగించు స్థలములు)

**1.** ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్. వీనినికండరంలో లోతుగా చాల వరకు చేయుచుందురు. పిఱ్ఱపై యుండు గట్టి కండరము నందును భుజమున ఖండరమునందును చేయుచుందురు.

2. హై పోడర్ మిక్ ఇంజక్షన్. దీనిని చర్మముక్రింద చేతిదండ ముంజేతివరుసలో చేయుచుందురు. చేతి పై భాగము పిరుదుల యందును, వీపులయందును, కాలి మడమల స్థానముల యందును దీనిని చేయ వచ్చును. ఇట్టిది ముఖ్యముగా చేతి దండ చర్మము నందే చాలవరకు చేయుచుందురు.

3. ఇంట్రవీనస్ ఇంజక్షన్. దీనిని రక్తనాళమున చేయుదురు. చేతియందు రక్తనాళము గనుపించనియెడల కాళ్ళ యొక్క రక్తనాళమునకుకూడ చేయుదురు. చేతియందు యెక్కడి సిరాయందైనను తెలిసి చేయ వచ్చును.

4. చర్మముకోసి సిరాయందు ఇంట్రవీనస్ ఇంజక్షన్ చేయుట. దీనిని చాలవరకు కలరా వ్యాధులయందు నరము కనిపించనివారలయందు చేయుచుందురు. యిది చేసిన గాని పిదప దీనిని మాన్ప వచ్చును.

5. ఇంట్రిస్పినల్ ఇంజక్షన్. దీనిని వీపుభాగమున వెన్నుబొక్కయందు బ్రహ్మ దండినాళమున ఇంజక్షన్ చేయుదురు.

6. ఇంట్రడెర్మల్ ఇంజక్షన్. దీనిని చర్మమునందు గల పొరలలో చేయుదురు. ఇట్టిదే కలరా మసూచికల యందును టీకాలుకూడ చేయుచుందురు.

7. ఇంట్ర ఎబ్డామినన్ ఇంజక్షన్. దీనిని చిన్న పిల్లలకు ఇంట్రవీనస్ పద్ధతి యివ్వలేని యెడల దీని సహాయ ముతో చేయుదురు. నాభిక్రింది చర్మమును కోసి (పెరి టోనీయ) యందు ఇంజక్షన్ చేయుచుందురు.

8. ఇంట్ర సేరిబ్రిల్ ఇంజక్షన్. దీనిని కపాలమునకు వెను కగా రంధ్రముచేసి సూదిని గ్రుచ్చి మందు విడుతురు. ఇది మహా కష్టసాధ్యమైనది. దీనిని చాలవరకు యే చిన్న చిన్న డాక్టర్లు చేయలేరని చెప్పవచ్చును.

9. రెకుటాల్ ఇంజక్షన్. దీనిని ఆసనముద్వారా పిచికారి సహాయముతో మందు ఎక్కించుదానినే ఎనిమా యను చున్నాము.

10. సెంపుల్ ఇంజక్షన్. దీనిని శరీరమునందుగల అన్ని రంధ్రముల యందు ఔషధము వేయుచున్నారు.

ఈ పై వ్రాసిన ఇంజక్షనులలో చాలవరకు చూడ సామాన్యులకు నాల్గు విధములు వాడుకలో గలవు యితర విధములైనవి మనవారు వాడుక జేయలేరు. వీటిని చాల వరకు "స్పెషలిస్టు డాక్టర్లు" వాడుచుందురు. పూర్వము నుండియు యిప్పటివరకు ఇంజక్షను పద్ధతిని బోలిన ప్రయోగ పద్ధతులవంటివి మన దేశమునందు కొన్ని విష యములు గలవు. చేతిపైనగాని, యితర చోట్లగాని గుంట గలగర పసరుతో సూది సహాయమున పచ్చబొట్లనివేయుట

కలదు. వీటినికూడ ఇంజక్షనుకు సంబంధించిన వేయని చెప్పుకోవచ్చును. నొప్పిగల స్థలమున పచ్చ వేయుచుండుట ఔషధమును శరీరమున మర్దన చేయుదానివలె యిదికూడ ఒక విధమైన చికిత్సయని చెప్పుకోవచ్చును. ఇంజక్షన్ చెయుటకు ప్రతి ఆయుర్వేదవైద్యునకు హక్కుగలదు. దీనినినిషేధించుటకు ప్రభుత్వముకూడ నిరాకరించలేదు. యెందుకు నిరాకరించలేదు అందురు: ఈ ఇంజక్షన్ విద్య మనదే మనవారుకూడ చేయుచుండిరి. ఇది మన అయుర్వేద శాస్త్రమందు కలదని చెప్పవచ్చును. అల్లోపతి డాక్టర్లు మేముతప్ప యితర విధముల వైద్యులు ఇంజక్షన్ యివ్వరాదనిరి. వారికే ఈ ఇంజక్షన్ విద్య లభించెనట. బాగుగా చూడ ఈ ఇంజక్షన్ విద్య ఆయుర్వేదమునందు కలిగి యున్నందుననే దానిని మనము సూచీముఖ యంత్రమని యనుచుందుము. అదియే ఇంజక్షన్ విద్య. మన ఆయుర్వేదమునందు అస్త్రములని అనేక విధముల గలవు. వీటిని మనవారలు మహర్షులు ఋషులు కనిపెట్టియుండిరి. వీటినే మనము ఇంజక్షన్ యని భావించుచున్నాము. ఇంజక్షన్ సూచీముఖ ప్రయోగమని యనవచ్చును. వీటిని యిప్పుడు సుమారు, పది సంవత్సరముల నుండి అమలులోకి తెచ్చియున్నారు. ఆయుర్వేద ఇంజక్షనులు చాల తక్కువగా యున్నవి. ఇట్టివి యింకా చాల వరకు వాడుకలోలేవు. ఈ ఆయుర్వేద ఇంజక్షనులను మన

వారలు పరిశోధించి వీనియందుగల గుణములు బైలుపరచి యున్నారు. ఆయుర్వేద ఇంజక్షనులు అవతరించిన నాటి నుండి, ఆయుర్వేద వైద్యులు గర్వపడవలసినదే. ఆయు ర్వేదమునందు యింకా చాలవరకు క్రొత్తఇంజక్షనులు కను గొనుచునే యున్నారు. కొన్ని విధములైనవి మాత్రము యిప్పటికి బాగుగా గుణము నిచ్చుచున్నవి. ఆయుర్వేద వైద్యులు తప్పక ఆయుర్వేద ఇంజక్షనులు వాడి వాటిగుణ ములు కనుగొని ఆయుర్వేదము వృద్ధి గావించగలరని నేను ఈ గ్రంథమును ఈ విధమున వ్రాసి, మీకందించి తిని. యిది నా ప్రార్థన.

---

## "స్టెర్‌లైజ్," (అనగా) నేమి.

"స్టెర్‌లైజ్'' (అనగా) సూదులు. సిరంజి భాగ ములను, నీటియందు మరగించి శుభ్రపరచునట్టి దానినే స్టెర్‌లైజ్ అనుచుందుము. ప్రతిఒక్క ఇంజక్షన్ చేయు నప్పుడు సిరంజిని సూదిని స్టెర్‌లైజ్ చేయుట ముఖ్యావ సరము. "స్టెర్‌లైజ్'' చేయక ఇంజక్షన్‌చేయుట ప్రమాద కరమని భావించవచ్చును. ఇంజక్షన్ పరికరములను మర గించి, బాగుగా శుభ్రముచేసి, ఇంజక్షన్ చేయవలయును. దీనిని అల్లోపతివారు స్టెర్‌లైజ్ అని అనుచున్నారు. మన

వారలు దీనిని "మరగించుట" యని, అనుకొనుచుందురు. సిరంజి భాగములను విడదీసి సూదులయందుగల తీగలను లాగి, సిరంజిని పెట్టెయందు నుంచి అందు నిండుగా నీళ్ళు బోసి, స్పిరిట్ లైట్ దీపముపైగాని, "స్టోవొయ్యి" యందు గాని కుత కుత నీళ్ళు మసలువరకు నుంచి తర్వాత తీసి, చల్లార్చి శుభ్రపరచి, ఇంజక్షన్ చేయవలయును. సిరంజీని సూదులను మరగించిన తర్వాత చేతులతో తీయకూడదు. చిమట సహాయముతో తీయుచుండవలయును. మరగించిన తర్వాత చల్లార్చిన వెంటనే ఉపయోగించు కొనవచ్చును. ఇంజక్షను చేయబడని అన్నివేళలయందును సూదియందు తీగను యుంచుట మంచిది. ఎన్నటికిని, సిరంజిని అశుభ్రతలోవుంచిన, మలినముచే తుప్పుకలిగియుండును. అన్ని వేళలయందును, సిరంజి సూదులను శుభ్రపరచి యుంచుట ముఖ్యావసరము. ఇంజక్షన్ చేయునప్పుడు చేతులనుకూడ స్టెరిలైజ్ చేయుట, (లేదా) డిటాల్ సహాయముతో శుభ్రపరచుట అవసరము. ఇంజక్షన్ విధానమందు ప్రతి వైద్యుడును ప్రతి అంశమునందును శ్రద్ధవహించి కడు జాగరూకతతో మెలంగుట ఉచితము.



# DETTOL

## ANTISEPTIC

## డిటాల్ యొక్క ఉపయోగములు

ఈ ఔషధద్రవము శుభ్రము చేయుటకు గాను ఉపయోగపడును. క్రిములను, విషపదార్థములను పోగొట్టునట్టిది, శరీరమునకు మృదుత్వమును గలుగజేయునట్టియు ప్రత్యేకముగా దుర్వాయువులను దుష్టక్రిములను పోగొట్టి ఇది బాగుగా తోడ్పడును. ఇది వైద్యులకు అనేకవిధములుగా పనికివచ్చుచుండును. ఆసుపత్రులకు (వైద్యశాలలకు) శిశురక్షణ శాలలకు, డాక్టర్లకు, వైద్యులకు, గృహస్థులకు, మునిసిపాలిటీలకు అనేక సందర్భములయందు శుభ్రతకు బాగుగా తోడ్పడును. దీనియందు మంచి వాసనగలిగి యుండును. చర్మము దంతములు దీనితో కడుగవచ్చును. వస్త్రములకు మచ్చలు పడునట్లు చేయదు. ఈమందు అనేక విధములైన దుష్టక్రిములను సంహరించు శక్తి గలిగి యున్నది. దీనిని నీటితో మిశ్రితము చేసి కడుగుట కుపయోగించ వలెను. గాయములు పుండ్లు పరిశుభ్రముగా నుంచవచ్చును. వ్యాధిగ్రస్తుల గదుల యందు చిలికిన యెడల మంచివాసన గలిగి అంటు వ్యాధులను అంటనీయకుండ కాపాడును. అంటువ్యాధులయందు రోగి గుడ్డలు దీని నీటిలో ఉతుకవచ్చును. వ్యాధిగ్రస్తుని

అవయవములను దీనితో కడుగవచ్చును. మాలిన్యముగల పదార్థమునుతీసి వేయుటకు బాగుగా తోడ్పడును. ఆరోగ్య వంతులు దీనితో స్నానము చేయుటకుకూడ, బాగుగా ఉపయోగపడును. వేడినీరు మిశ్రితము చేసి, ఎనీమాలకు ఈ మొదలయిన వాటికి ఉపయోగించ వచ్చును. దీనితో గృహములు గదులు శుభ్రము చేయుటవలన, క్రిమిజాడ్య ములు, అంటుజాడ్యములు నిరోధించుటకు బాగుగా ఉప యోగించును. చెవులో చీముకారు దానికి, దీనితో కడుగు చుండిన అందుగల క్రిములను సంహరించును. యితర విధములైన అనేక అంటుజాడ్యములందు దీనితో కడుగుట వలన, అంటువ్యాధులు విస్తరించక సమసి పోవును. ఈ మందు ఒక గ్లాసులో పదిచుక్కలుపోసి, వేడినీరు కలిపి నోటిలో పుక్కిలించి ఉమ్మి వేసినయెడల నోటి యందు గల దుర్వాసన నివారించును. విషపదార్థములను నివారించు టకు గాను బాగుగా గుణమునిచ్చుచుండును. సిరంజులు పిచుకారులు సూదులు ఆపరేషన్ చేయు కత్తులు చిమటాలు యితర విధముల వైద్య పనిముట్లు మొదలగునవి కడు గుటకుగాను బాగుగా ఉపయోగపడును. చర్మవ్యాధుల యందును, కడుగుటవలన, శుభ్రముచేయును. దీనియందు యింకా చాలగుణములు కలిగి యుండును.

N. B. ఈ మందు కడుపులోనికి మాత్రము త్రాగ కూడదు.

# సాధారణముగా అవసరమగు ఇంజక్షన్ సిరంజీలు, మొదలైన పరికరములు.

( సూదుల నెంబర్లు )

1 Box No 16 Needels, 1 Box 12 సూదులు గలపెట్టె No. 14 గలవి, No. 1 సూదులు రెండు No. 18 గల సూదులు (12) ఈ సూదులు నెంబర్ల ప్రకారం లభించు చుండును.

( సిరంజీ పిచికారులు )

| 1 | 1 | 1 | 1 | |
|---|---|---|---|---|
| 1-CC | 2-CC | 5-CC | 10-CC | లభించును. |

ఒకచిమట, నాల్గుస్టీల్ సిరంజిపెట్టెలు ఒక స్పిరిటుల్యాంపు మరగించుటకు కొంత కాటన్ కార్బాలిన్ Shop ఒక బాటల్ డిటాల్, ఒక బాటల్ రెక్టిఫైడ్ స్పిరిట్ ½ పౌను టించర్ అయోడిన్ ఈ వస్తువులు వైద్యులకు నిత్యావసరమై యుండును. గాన ప్రతి వైద్యునివద్ద ఈ వస్తువులు వుంచుట చాల అవసరమై యుండును.

ఇంట్రివీనస్ ఇంజక్షన్ చేయుటకు ఒకరబ్బర్, నరము ఉబ్బుటకు చేతికి కట్టుటకుగాను ఇది ఉపయోగ పడును.

(౬)

## ఇంజక్షను చేయుటకు పూర్వము అంపుల్సు కదలించుట ముఖ్యము.

ప్రతిఒక్క ఇంజక్షన్ చేయునప్పుడు, ఇంజక్షన్ అంపుల్సును బాగుగా రెండుమూడు మార్లు కదలించి, రంపముతో కోసి, సిరంజి మొన (సూదిని) అంపుల్సునందు నుంచి, పిస్టన్‌రాడును లాగుచుండిన అంపుల్సునందు గల మందంతయు సిరంజిలోనికి ప్రవేశించును. అంపుల్సును కదలించనిదె మందును సిరంజిలోనికి లాగకూడదు. అంపుల్సు (అనగా) ఇంజక్షన్ మందుగల గాజుబుడ్డి, చాలవరకు అంపుల్సు ½ CC నుండి 20 CC వరకు అంతకు యెక్కువగూడా లభించు చుండును. ½ CC నుండి 2 CC వరకు చర్మముక్రింద ఇంజక్షన్ చేయుచుందురు. 1 CC నుండి, 10 CC వరకు కండరములో ఇంజక్షన్ చేయుచుందురు. 2 CC నుండి, 20 CC అంతకు యెక్కువకూడ ఇంట్రివీనస్ రక్తనాళమున ఇంజక్షను చేయుచుందురు.

---

## "వయల్స్" ఔషధద్రవ్యముతో నింపి రబ్బరుమూతతో లభించు బుడ్లు.

వీటిని చాలవరకు వయల్స్ లేవా బల్బు అని కూడా అనుచుందురు. వీటియందు చాలవరకు పౌడరు రూపక

ముగా ఔషధము లభించుచుండును. పౌడరు మాదిరిగా నుండు బుడ్లయందు డిస్టిల్డ్‌వాటర్ నార్మల్‌సైలైనుతో మిశ్రితము చేయుచుందురు. కొన్ని ఇంజక్షను ద్రవ్యములు మాత్రము ద్రవపదార్థముగానే లభించుచుండును. ఇంకను కొన్ని పౌడర్లున్ను కొన్ని ద్రవరూపముగాను, కొన్ని ఆయిల్ రూపకముగాను లభించు చుండును. ప్రయోగమునకు పూర్వము వీటినికూడ కదలించి, ఇంజక్షన్ చేయుట మంచిది. రబ్బరు మూతకు సూదిని గ్రుచ్చి వయల్‌నందుండు మందును వలసినంత లాగవలయును. రబ్బరు మూతగల బుడ్లయందు గాలి చొరనేరదు. సీలు బాగుగా బిగించియుండును.

---

## ఇంజక్షను అంపుల్స్‌తో నుండు పెట్టె దానిపై నుండు వివరములు.

అంపుల్సుగల పెట్టెపైన ఔషధము యొక్క పేరు. ఒక అంపుల్సునకెన్ని CC లు. అంపుల్సునందు యెన్ని గ్రేయునుల ఔషధముండును. అంపుల్సు నందుగల మందు యొక్క ఉపయోగములు. వాటివాడుక యేస్థలమున ఇంజక్షను చేయవలయును. ఇంజక్షన్ తయారు చేయబడిన తెది యెన్ని నెలలువరకు ఇంజక్షను ఔషధము నిలవయుండును. యెన్నిదినముల కొకతూరి ఇంజక్షన్ చేయవలయును.

కంపినివారి లైసెన్సు నెంబరు మొదలగు యీ యన్నివివరములును ఇంగ్లీషు అక్షరములలో వ్రాసియుండును. ఇందు కొన్ని కంపినీలవారు పై వివరములలో కొన్నిమాత్రమే క్లుప్తముగా వ్రాయరు. వీటిని మనము, ఇంజక్షన్ చేయుటకు ముందు చదివి గ్రహించుకొన వలయును. ఇంజక్షన్ పెట్టెయందు ఒక ర ములభించును. ఇది ఆంపుల్సు కోయుటకు ఉపయోగప ను.

సాధారణముగా ప్రతి ఇంజక్షను పెట్టెయందు మందుయొక్క గుణము మోతాదు మొదలగు వివరముల సూచించు నట్టి ఒక కాగితము నుంచబడి యుండును.



పంచాయతీ
వేమన గ్రంథాలయం.
వేలప్రోలు :: కృష్ణా

శ్రీ

# ఇంజక్షన్ గైడ్

---

## 1. థియోసల్ఫేటు ఆఫ్ సోడియం.

**Thoy Sulphate of Sodium**

ఇంట్రమస్క్యులరు ఇంజక్షను (అనగా) కంఠరము లందు యీయవలసిన ఇంజక్షను.

2 CC ద్రవములో 15 గ్రైనులపరకు, పై ఔషధము చేరియుండును. "సాల్వార్సన్" లేక నియోసల్వరుసనల్ మొదలగు పాషాణ సంబంధమైన ఇంజక్షనులను "సిఫిలీస్" అనగా సవామేహ సంబంధమైన జబ్బులకు వాడవలసి వచ్చినచో, సూదిని రక్తనాళము లోనికి గ్రుచ్చినప్పుడు రక్తనాళము లోనికి పోవలసిన ఔషధము పొరపాటు వలన చర్మము క్రిందికిగాని, కండరము లోనికిగాని ప్రవేసించుటచే వాపు, మంటలు, పోట్లు, బాధ మొదలైనవి కలుగుట సహజము గాన అట్టి ప్రమాదస్థితిని తొలగించుటకు పై "దియోసల్ఫేట్ ఆఫ్ సోడియం" ఇంజక్షను ప్రయోగించి రక్తనాళమునందు ప్రవేసింప వలసిన ఔషధము చర్మములోనికో, కండరములోనికో పోవుటచే యేర్పడిన బాధలను వెంటనే నివారింప వచ్చును. బాధ

యేర్పడిన స్థలమునకు చుట్టు సోడియం థియోసల్ఫేటు ద్రవమును కొద్ది మోతాదులలో రెండుమూడు ఇంజక్షనులు వాడినయెడల విరుగుడుగా పనిచేసి వెంటనే బాధలనునివారించును. పొరపాటువల్ల శరీరమునకు బాధ యేర్పరచిన పాషాణ సంబంధమైన ఇంజక్షనుల ప్రమాదమును తొలగించునట్టి శక్తివంతమైన దియోసల్ఫేటు ఇంజక్షను యొక్క ప్రయోజనమును ప్రథమమున వివరించడమైనది. ఇంట్రవీనస్ ఇంజక్షనుచేయు వైద్యులు తప్పక పై యింజక్షన్ దగ్గర నుంచుకొనుట చాల మంచిది.

## 2. కాల్షియం గ్లూకోనేట్.

## Calcium Gluconate

ఇంట్రవీనసు అండు మస్క్యులరు, ఇంజక్షన్.

10 CC వరకు ఇంట్రవీనసు 5 CC వరకు ఇంట్రమస్క్యులరు ఇంజక్షన్‌ను, క్షయవ్యాధులకు, శరీరమున సున్నపుధాతువు తగ్గినపుడు కల్గుచుండెడు దగ్గు, బలహీనత, జ్వరములు, శ్వేతప్రదరములు, రక్తప్రదరములు బలహీనత కల్గిన స్త్రీలకు ముక్కునుండి రక్తముపడుట తగ్గును. క్షయవ్యాధులందు కలుగు రక్తకాసలు, రక్తస్రావములను నివారించును. "శ్యాండోజు కంపెనీ"వారిది చాలామంచిది. వ్యాధిని గుర్తెరిగి, ఇంజక్షన్ చేయుచుండవలయును. బై కాల్షియం (Bl) కంపెనీ వారిది పై మాదిరిగానే పనిజే

యును. క్షయవ్యాధులకు ప్రత్యేకముగా వాడుక జేయుదురు. బలహీనము గలవారికి గమనించి ఇంజక్షన్ చేయవలయును. గుండె దడగలవారికి కూడ జాగ్రత్తతో చేయవలయును.

N. B. వివరములు విపులముగా కాల్షియం శాండోస్‌నందు చూడుము.

3. కోలాయిడ్ కాల్షియం విత్ విటామిన్ డి.

Colloid calcium with vitamin D Injection

ఇంట్రమస్క్యులరు అండ్ హైపొడరుమికు ఇంజక్షన్.

1 CC, 2 CC లభించును. 5 మెలిగ్రాము. కాల్షియంకు 5000 యునిట్సు విటామిను డి కలిపి తయారుచేయుదురు. క్షయవ్యాధికి కాల్షియం తక్కువవున్నయెడల ఈ ఇంజక్షన్ యిచ్చినమంచి పనిజేయును. రక్తకాసలు నివారించుటలో మంచిగపని జేయును. గర్భిణీస్త్రీలకు కలుగు వాంతులు డోకులు నివారించి గర్భములోగల శిశువును ఆరోగ్యవంతునిగా వృద్ధి జేయుటయందు మంచి గుణము కలది. క్షయవ్యాధులకు అమృతమువలె పనిజేయును. ప్రతి దినము ఈ ఇంజక్షన్ యివ్వరాదు. మూడు దినముల కొకసారి యిచ్చుచుండవలయును. అర్ధ తలనొప్పి గల వారికి పన్నెండు ఇంజక్షన్ లిచ్చిన మంచి పనిజేయును. వీర్యనష్టమును నివారించి, శ్వేతప్రదరములను నశింపజేసి

బలము, పుష్టి కలుగజేయుటయేగాక శరీరమందలి సకల ధాతువులకు శక్తి నిచ్చును.

## 4. కాల్షియం క్లోరైడ్.

## Calcium Chloride

### ఇంట్రవీనసు, అండ్ ఇంట్రమస్కులరు ఇంజక్షన్.

ఒక ఇంజక్షన్‌లో నూటికి అయిదుపాళ్ళ ఔషధ ముండును. నూటికి పదిపాళ్ళగల ఇంజక్షన్ కూడ లభించును. 2 CC, 5CC, 10 CC సీసాలు వ్యాధిపరిస్థితినిబట్టి. బలమునుబట్టి వాడవలెను. ఆపరేషన్ చేసినవెంటనే వచ్చు రక్తమును తగ్గించుటకు ఈ ఇంజక్షన్ యిచ్చుచుందురు. గాయములు, దెబ్బలు తగిలినప్పుడు వెడలుచుండెడి రక్తమును వెంటనే తగ్గించును. ముక్కు బెదరి కారు రక్తమునుకూడ తగ్గించును. క్షయవ్యాధియందు గలుగు రక్తకాసను వెంటనే తగ్గించును. రక్తాతిసారములను తగ్గించును. రక్తస్రావముల నివారించును. శరీరములో నుండు అవయవములనుండి వెడలు రక్తస్రావముల నివారించును. ప్రసవానంతరము గలుగు రక్తస్రావములు నివారించుటలో మంచిగుణముకలది. గర్భిణితో ఉన్నస్త్రీలకు గలుగు బలహీనతను రూపుమాపును. సిఫిలీసు, మేహవ్యాధి వల్ల గలుగు మచ్చలు మొదలైన వాటిని మాయము జేయును. ఇంజక్షనులు 2 CC మొదలు 10 CC వరకు

హెచ్చించవలయును. క్షయవ్యాధి గలవారికి సాయంత్రము ఇంజక్షన్ యిచ్చిన చాల మంచిగుణము కలుగును. కండరము లోనికి ఇంజక్షన్ యిచ్చిన నొప్పి కలిగించును. ఈ ఇంజక్షన్ వలన వాంతులు, గుండెదడ కలుగును. అట్లు కలిగిన యెడల కొన్ని దినములు ఈ ఇంజక్షను ఆపుజేసి వ్యాధికితగిన ఔషధమునుసేవించుచుండవలయును. ఇంట్రవీనసు ఇంజక్షన్ యిచ్చిన యెడల తలనొప్పి శరీరమంతటమంటలు మొదలైనవి లేచును. లేదా లేవక యుండవచ్చును. గనుక చాల ఆలోచనతో గమనించి ఇంజక్షన్ చేసిన చాల మంచిగుణ మియ్యగలదు. జాగ్రతతో చేసిన పై వ్యాధులు తప్పక నివారణ మగును.

## 5. కోలాయిడ్ అయోడిన్.

## Coloid Iodine

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC ద్రవముగల అంపుల్సు వాడుకొనవలయును. జ్వరము యెక్కువవున్నయెడల ప్రతిదినము 1 CC వాడవలయును. న్యూమోనియా, ఊపిరితిత్తుల సంబంధమైన వ్యాధులకు వాడుక చేయవలయును. జ్వరమును తగ్గించి, ఊపిరితిత్తుల బాధలు నివారించును. బాలింతలకు కలుగు సూతికా జ్వరములకు చాల మంచి పనిజేయును. సూతికా జ్వరమున కలుగుబాధలు నొప్పులు నివారించును.

దేహబలమును బట్టి ఇంజక్షన్ చేయుచుండవలయును. జ్వరమును తగ్గించి, మంచిశక్తి కలుగజేయును. సాధారణ మైన పరిస్థితులయందు 1 CC ఇంజక్షన్ వాడుచుండిన చాలును. మొత్తము ఆరు ఇంజక్షనులు చేయవలసి యుండును. పై వ్యాధులకు మంచిపని జేయును.

## 6. కోటార్నిన్.

## Cotarnin

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC ఔషధ ద్రవములో ఒక గ్రైను ఔషధము కలిపి తయారు చేయుదురు. 1 CC వాడుచుందురు. క్షయ వ్యాధులలో కలుగు రక్తవాంతులు, రక్తకాసలు నివారించును. రక్తాతిసారములు, రక్తస్రావములు అధికముగా వెడలు బుతురక్తమును తగ్గించుటలో మంచిపని జేయగలదు. ప్రసవమున కలుగు రక్తస్రావములను కట్టి బాగుగా బలము గలిగించును. యీ ఇంజక్షన్ మాటి మాటికి జేయరాదు. వ్యాధి బలముల నెరింగి యివ్వవలయును. రక్తస్రావములు లేనియెడల ఇంజక్షన్ యివ్వ కూడదు. చర్మముక్రిందనే ఇంజక్షను జేయవలయును. కండరములోనికి గాని, యే స్థలములగాని ఇంజక్షన్ చేయరాదు. గమనించి చేసిన చాల మంచిపని జేయును.

## 7. కస్తూరి, మస్క్, ఇన్ ఈథర్

## Musk in Ether

### చర్మముక్రింద చేయదగిన ఇంజక్షన్.

1 CC సీసాలోగల ఔషధము తడవ తడవకు వాడవలయును. తరుణవ్యాధులలో కాళ్ళుచేతులు, శరీరము చల్లబడునట్టి సమయములలో ఈ ఇంజక్షన్ చేసిన వెంటనే వేడి కలిగించును. అవసరమునుబట్టి గంటకు ఒకసారి గాని, అర్ధగంట కొకసారి గాని, పదిహేను నిమిషాల కొకసారిగాని వేడి వచ్చువరకు యివ్వవచ్చును. రోగికి వాతము హెచ్చుగా నున్న వాతనాడి తగ్గి తగ్గి నడచు సమయమందు ఈ ఇంజక్షన్ యిచ్చిన యెడల వాతమును హరించి, నరములకు బలము కలిగించి రోగిని చావనీయకుండా కాపాడి మంచి శక్తిని కలుగజేయును. నరములయొక్క క్షీణగతియందును శరీరమున చలువలు గ్రమ్మినప్పుడును పై ఇంజక్షను సంజీవివలె పనిజేయును.

## 8. కార్పొరాల్ టాటియాయెక్స్టాక్టు

## Corporaltatia Extract

### ఇంట్రిమస్కులరు ఇంజక్షన్.

1 CC గల ఔషధము దినము వాడనగును. గర్భిణిగా వుండు స్త్రీలకు కలుగు వాంతులు, డోకులు, వేవిళ్ళు, తలతిరుగుట, పైత్యవికారములను నివారించును. ఋతు

దోషములందు సకాల బహిష్టు అగునట్లు జేయును. ముట్టు శూలకు పనిజేయును. వయస్సు ముదిరి రజస్వల కాని ఆడ పిల్లలకు యిచ్చిన రజస్వలను గావించును. సాధారణమైన పరిస్థితులయందు ఆరు ఇంజక్షనులు వాడిన మంచిది. దినము తప్పి దినముకూడ యివ్వవచ్చును.

## 9. కాఫిన్ అండు సోడియాబెన్‌జొయెట్.

## Chapin aud Sodiabenjoet

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 CC సీసాలో అయిదుగ్రైనులు లేదా యేడున్నర గ్రైనుల ఔషధముండును. 1 CC సీసాలో రెండున్నర గ్రైనుల ఔషధ ముండును. గుండె నీరసించినప్పుడు చురుకుదనము కలిగించి గుండెకు బలము కలుగజేయును. మూత్రము అధికముగా వెడలింపజేయును. శరీరము చల్ల బడినప్పుడు ఈ ఇంజక్షన్ యిచ్చిన వేడి కలుగజేయును. హృదయ దౌర్బల్యము, నీరసముగా నుండునపుడు మంచి పనిజేయును. న్యూమోనియావంటి శ్లేష్మ సంబంధమైన వ్యాధులు కలుగు నప్పుడును, వృద్ధత్వము గలవారికి కూడ యివ్వవచ్చును. తొందరగా పనిజేయును. దినము ఒక్క ఇంజక్షన్ చొప్పున వ్యాధి కుదురునంత వరకు యివ్వ వచ్చును.

## 10. క్యాంఫరు ఇన్ అయిల్.

Camphor in Oil (Intramuscular Injection)

చర్మముక్రింద కండరములోనికి యిచ్చు ఇంజక్షన్.

ఆలివ్ఆయిల్, హారతికర్పూరము కలిపి తయారు జేయుదురు. కర్పూరము 3గ్రైనులున్న ఆయిలు పదిహేను చుక్కలు కలిపి సాధారణముగా తయారు చేయుదురు. గుండెయొక్క నీరసమును పోగొట్టును. గుండెకాయకు బలము కలిగించును. చురుకును బలమును కలిగించును. న్యూమోనియా వ్యాధులయందు మంచిపని జేయును. ఊపిరితిత్తుల వ్యాధికి పనిజేయును. శ్లేష్మము గొంతుకకు అడ్డము పడునప్పుడు గురుకుగల వ్యాధికి మంచిపని జేయును. చలువలు గ్రమ్మిన వారికి వెంటనే వేడి కలిగించును. వేడి వచ్చునంతవరకు గంటకు ఒకసారి ఇంజక్షన్ చేయుచుండవలయును. పై వ్యాధులందు వేడి సరిగా లేనప్పుడు వెంటనే ఇంజక్షన్ చేసిన మంచి పనిజేయును.

## 11. క్యాంఫరు ఇన్ ఈథర్

Camphor in either

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC ఆంపుల్స్ దొరుకును. గంటకు ఒకసారి లేక అర్ధగంట కొకసారిగాని ఒక్క సి. సి. మోతాదు చొప్పున యివ్వవచ్చును. వేడి వచ్చునంతవరకు యివ్వ వచ్చును. వేడివచ్చినచో ఇంజక్షన్ఆపి, అవసరమైనమరల

చేయుచుండ వలయును. రోగి మూర్ఛలోనున్న సమయ మందుకూడ ఇంజక్షన్ చేయవచ్చును. తొందరగా పని జేయును. అవసరమైన యెడల క్యాంఫరుఇన్ ఆయిలు యిచ్చినకూడ పనిజేయును. మూడు లేక నాలుగు ఇంజక్షనలు యిచ్చిన మంచిగా పనిజేయును. ఇంజక్షనులు యెక్కువ యిచ్చినయెడల వేడి అధికమగును. గుండె యొక్క బలము, నీరసమునకు సయితము రెండు మూను ఇంజక్షనులకే గుణము కనుపించును. బాధ నివారణ మగును, ఊపిరితిత్తుల వ్యాధికికూడా పనిచేయును.

## 12. క్వినైన్ బై హైడ్రోక్లోరైడ్.

Quinine Bi Hydroochloride
Intramuscular Injection

కండరములలోనికి యిచ్చు ఇంజక్షన్.

1 CC లో మూడు గ్రైనుల ఔషధమున్ను 2 CC లో పది గ్రైనుల ఔషధమున్ను యుండునట్లు తయారు చేయుదురు. 1 CC పిల్లలకున్ను 2 CC ల వరకు పెద్దల కున్ను వాడవలయును. మలేరియాజ్వరమునకు మంచి పని జేయును. వాంతులు, జ్వరము, కండ్లమంటలు, శరీరమున మంటలు చలితోకూడి, దినము తప్పి దినము వచ్చే జ్వరము, తలనొప్పి, జ్వరము తగ్గిన తర్వాతనే పై ఇంజక్షన్ చేయవలసియుండును. ఇంజక్షన్ చర్మముక్రిందను యెన్నడు చేయరాదు. అట్లు చేసిన యెడల ఇంజక్షన్

చేసినస్థలము గడ్డకట్టి కొన్ని రోజులకు కురుపులు లేచి కుళ్ళుటకూడ సంభవించును. వీలైనంత వరకు పిఱ్ఱపై నుండు గట్టి కండరములోనికి ఈయవలయును. ఈ ఇంజక్షన్ యిచ్చిన పైత్యముజేసి వాంతులకూడ కలుగును. జ్వరము తగ్గినపిదప ఒక ఇంజక్షన్ చేసిన జ్వరము, చలి నివారించును. మరల కొన్ని దినములకు తిరిగి జ్వరము రావచ్చును. కాని మూడు నాల్గు ఇంజక్షనులు చేసిన చలి జ్వరము నివారించును, ఇంజక్షన్ చేసిన స్థలమున కొద్దిగా నొప్పియుండును. గడ్డకట్టినట్లుండునుగాని, వేడినీళ్ళతో కాపడము చేసిన గడ కరగిపోవును.

## 13. క్వినైన్ ఆసిడ్ హైడ్రో బ్రోమైడ్.

## Quinine Acid Hydro Bromide

## కండరములోనికి చేయు ఇంజక్షన్.

2 CC 1 CC మొదలు వాడవచ్చును. (మలేరియా) చలి జ్వరమును నివారించును. రెండు మూడు దినములు వదలి వచ్చే మలేరియా జ్వరముకూడ నివారణ మగును. మూడు ఇంజక్షనులు యిచ్చిన మలేరియావ్యాధి తప్పక నివారించును. మలేరియా గుణములను నివారించుటలో మంచి శక్తి కలిగినది.

## 14. క్వినైన్ బై హైడ్రోక్లోరైడ్ విత్ యురేథైన్

### Qunine Bi Hydrochloride with Urethane

### కండరములలోనికి చేయు ఇంజక్షన్.

3 గ్రైనుల సీసా. 1 CC 5 గ్రైనులు లేదా 10 గ్రైనులు గల సీసా 2 CC లో వుండును. గడ్డలు మొదలగు వ్యాధులకు ఆపరేషను చేయుటకు ముందుగా ఆపరేషనుచేయు స్థలమున ఇంజక్షన్ చేసిన ఆ భాగము తిమ్మిరి పట్టును. అచ్చోట మొద్దుబారినట్లుండును. ఆపరేషన్ చేసిన యెడల బాధ నొప్పి కలుగదు. ఇంజక్షన్ చేసిన అర్ధగంటకు తిమ్మిరి యెక్కును. మూలవ్యాధి యొక్క పిలకలు నివారించును. మూలవ్యాధికిగల బాధలు నివారించును.

## 15. బై సల్ఫానమైడ్

### Bi Sulphonamide Intramuscular Injection

### కండరములోనికి జేయు ఇంజక్షన్.

5 CC 10 CC వాడవలయును. ఈ ఇంజక్షన్ సల్ఫోనామైడు మందు కలిసి యుండును. దీనిని గనేరియా వ్యాధి గలవారికి వాడుదురు. గనేరియా వలన కలుగు అన్ని అవస్థలకు పనిజేయును. 5 CC ద్రవము మూడు రోజుల కొకసారి వాడవలయును. అంపులు కదలించి ఇంజక్షన్ చేయవలయును.

## 16. స్పెట మైడు-సోలు

Septamide Sol

కండరములోనికి చేయు ఇంజక్షన్.

ఈ ఇంజక్షన్ 5 CC ల అంపుల్సు నందు లభించును. గనేరియా వ్యాధులకు, గనేరియావలన గలుగు అన్ని అవస్థలకు, బహిష్టుదోషములకు సవామేహసంబంధమున కలుగు క్రిమిజాడ్యమునకు మంచి పనిజేయును. (I. H.) కంపెనీవారిది మంచి పనిజేయును. దినము తప్పి దినము ఇంజక్షన్ యిచ్చుచుండిన గనేరియా వ్యాధులు నివారణ మగును.

## 17. సి టో డై న్.

Cytodin. (Intramuscular Injection)

కండరములోనికి చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించును. తరుణజ్వరములలోను, జలుబు, విషపడిసెములతో కూడిన జ్వరము సమస్త జ్వరములకు ఈ ఇంజక్షన్ చేసినయెడల జ్వరములు నివారణ మగును. జ్వరమున్నప్పుడే 2 CC ఇంజక్షన్ నీయ వలయును. జ్వరములను నివారించుటలో (I. H.) కంపెనీ వారిదే శ్రేష్ఠమగు మందు అదియే లభించును. మంచి గుణము కలిగించును. శరీరమున కేర్పడినట్టి యేవ్యాధినైనను తీవ్రదశకు రానీయక కాపాడునట్టి శక్తి యీ ఔష

ధమునకు సహజముగాన వ్యాధి యొక్క ప్రారంభ దశ యందు దీనిని వాడిన మంచి ఫలితమొసంగును.

## 18. బై అమ్నిజీన్.

Bi-Omnigen, (Intramuscular Injection)

కండరములోనికి చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు వాడుకజేయుదురు. జ్వరమువచ్చిన వెంటనే ఈ ఇంజక్షన్ చేసినయెడల జ్వరము అప్పటి కప్పుడే నివారణ మగును. విషపడిశములు, ముక్కు బిగ్గరపట్టుట, గర్దిచలువయున్న బోనడంచి వేడి కలిగించి జ్వరములను నివారించును. సూతికా జ్వరమునకు మంచి పనిజేయును. సన్నిపాతజ్వరము నివారించును. దినము 1 CC యిచ్చిన జ్వరములు నివారించును. ఆరు ఇంజక్షనుల కన్న యెక్కువ చేయరాదు. ఇది లభించని యెడల వరిజి నలు, బెయరుకంపెనీవారిది వాడవలెను. ఓంనాడిద్ కూడ మంచిపనిజేయును. క్షయవ్యాధి జ్వరములందు కూడ టెంప రేచరు తగ్గును.

## 19. బై ఓవరెక్సు.

Bi, Ovarex

తత్వము మారినందువల్ల కాలము మార్పు జెందుట చేత కలుగు వ్యాధులకు బహిష్టు దోషములకు మంచి పని జేయును. 1 CC ఇంజక్షన్ అంపుల్సు దొరకును.

## 20. ఫెర్రి క్వినారిసిన్.

## Pherri Qinarsin

1 CC, 2 CC సీసాలు లభించును. మలేరియా జ్వరమునకు ఇన్ఫ్లూయంజా నురల్జియా నొప్పులుగల వ్యాధులకు ఈ ఇంజక్షన్ తీసిన అప్పటికప్పుడే జ్వరము నివారించును. నొప్పులుకూడ నివారించును. మూడు నాలుగు ఇంజక్షనులు తీయవలయును. నురల్జియా అనగా వాతపు లోపము వలన నరములందు బాధ, పోటు, పట్లు, వాపు మొదలగు లక్షణములతో యేర్పడునట్టి వ్యాధి.

## 21. ప్రొకైన్ హయిడ్రోక్లోర్.

## Procaine Hydrochlorioe

1 CC, 2 CC ట్యూబులుకూడా లభించును. గడ్డలగు వాటికి నొప్పి లేకుండ ఆపరేషన్ చేయవలెనన్న ఈ ఇంజక్షన్ చేయవలెను. ఆపరేషన్ చేయవలసిన గడ్డ చుట్టు రెండు ఇంజక్షనులు చేసిన నది మొద్దుబారును. అప్పుడు ఆపరేషను చేసిన యెడల నొప్పి యేమాత్రము కలుగదు. (Bi) కంపెనీవారిది పై విధముగానే పనిజేయును.

## 22. కోల్లాయిడ్ స్టానో మేంగనీసు.

## Colloidstnno Manganese

కండరములలోనికి చేయు ఇంజక్షన్.

1 CC, 2 CC ట్యూబులు దొరకును. రెండు రోజులకు ఒక్కసారి ఇంజక్షను చేయవలయును. రక్తశుద్ధిలేక

కలిగెడు కురుపులు, రాచకురుపులు, మొటిమలు, మొదలగు వ్యాధులు గలవారికి ఈ ఇంజక్షను చేసిన నవి నివారణ మగును. క్రిమముగా ఆరు ఇంజక్షనులు చేసిన చాలును. రక్తశుద్ధి జేయుచు చర్మవ్యాధులు నివారించుటలో దీని కిదియే సాటి. మంచి గుణముగలది. మొటిమలు కూడ తొందరగా మాసి పోవును.

## 23. ఆర్థరైటిన్.

## Arthrtin

1 CC ఇంజక్షన్ ట్యూబులు లభించును. తరుణములో కలుగు దీర్ఘపు ఉష్ణవాత సంబంధమైన కళ్ళనొప్పులకు, కంటిపోటు మొదలగు నొప్పులకు, నడుమునొప్పులు యింకా ఉష్ణవాత నొప్పులకు ఈ ఇంజక్షన్ బాగా పని జేయును. (Bi) కంపెనీవారిది చాలామంచిది. ముఖ్యముగా వాత సంబంధమైన నొప్పులకొరకు బాగుగా ఉపయోగించును.

## 24. యాట్రిన్ కాసైన్.

## Yatren Casoin

1 CC ట్యూబులు లభించును. వాతపునొప్పులు, ఉష్ణవాత సంబంధమైన వాతపునొప్పులు, శరీరములోగల పెక్కు వాతపునొప్పులకు బాగుగా పనిజేయుటయందు ప్రిసిద్ధిగన్నది. మంచి గుణముగలిగి యుండుటచేతను, కంటిపోట్లు కూడ నివారించున దగుటచేతను దీని కింత

ప్రసిద్ధి. జేయరు కంపెనీ వారిది మంచి పేరుగలది. ఆరు ఇంజక్షను లిచ్చిన గుణము వెంటనే కనిపించి పై వ్యాధులను నివారణ జేయును.

## 25. మైయోసిన్.

## Mayocin

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

సన్నముగా నడచుచున్న నాడికి చురుకుదనము కలిగించును. బలము కలుగజేయును. దినమునకు ఒక ఇంజక్షను చేసిన చాలా మంచి పనిజేయును. గుండెకు బలము కలుగజేయును. వేడిని హెచ్చించి, తరుణవ్యాధులచే గలుగు క్షీణగతి యందు మంచి గుణము కలిగించును. (Bi) కంపెనీ వారిది మంచి పనిజేయును.

## 26. బైహిస్టూడైన్.

## Bi-Histidine

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

నాడికి చురుకుదనము కలిగించి, గురకను నివారించును. శ్లేష్మమును పలుచపరచును. వాతము గ్రిమ్మిన వారికి వాతము నివారణజేయును. సన్నగానడచు నాడికి ఉత్తేజము గలిగించి బాగుగా పనిజేయును. గుండెయొక్క నీరసమును పోగొట్టును. తరుణవ్యాధులందు అమృతము వలె పనిజేయును. (Bi) కంపెనీ వారిది బాగుగా గుణము

నొంసగుటలో పేరుపొందియున్నది. దినమున కొక్కసారి లేక అవసరముకొద్ది వాడుచుండ వలయును.

## 27. బైగనోటెక్సు.

## Bignotex

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

ఇంజక్షన్ బలుపు లభించును. ½ CC తో ప్రారంభించి ఇంజక్షను చేయవలసి యుండును. గనేరియా వ్యాధి అనగా (సెగసంకటము) మూత్రద్వారమువద్ద మంట, మూత్రము వెడలకుండుట, మర్మస్థానమునందు పుండు కలుగుట, మోకాళ్ళ నొప్పులు పోగొట్టి గనేరియా క్రిములను సంహరించును. సర్వ సెగవ్యాధులకు(Bi) కంపెనీ వారిది బాగుగా పనిజేయును. "పెనిసీలిన్" ఇంజక్షను బయలు వెడలిన పిదప వీటి అవసరము కొంత తగ్గెను.

## 28. గనోడెరుమ్.

## Ganoderumen

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

గనేరియా వ్యాధులు పచ్చసెగ, రక్తసెగ, తెల్లసెగయును నీ మూడును, మూత్రద్వారమువద్ద కలిగించు మంటలను రూపుమాపి, మూత్రమును అధికముగా వెడలింపజేయును. గనేరియా క్రిములను సంహరించును. గనేరియా వలన గలుగు అన్ని బాధలు నివారించుటలో మంచి శక్తి గలది. (P. D & Co) లిమిటెడ్ వారిది బాగుగా పని

జేయును. "పెనిసీలిన్" వెలువడిన పిదప దీనియొక్క వాడుక తగ్గెను.

## 29. బై హైపరు బిసుమత్

## Bi-Hyper Bismuth

చర్మముక్రిందను కండరములలోనికి చేయు ఇంజక్షన్.

1 CC ద్రవము ఇంజక్షను చేయవలయును. అవసరముకొద్ది జాగ్రత్తగా వాడవలయును. నాడి సన్నగిలి బలహీనము కలిగినప్పుడును, ఉబ్బసపు వ్యాధియందు కళ్ళె తెగుటకు, ప్రసవించు స్త్రీలకు శిశువు వెడలుటకును యివ్వవలసి యుండును. శరీరములో నొప్పులుగలవారికి, యిచ్చిన మంచి పనిజేయును. (Bi) కంపెనీవారిది చాలా మంచి పనిజేయును.

## 30. లేడర్ ప్లక్సు.

## Lederplex

కండరములో చేయు ఇంజక్షన్.

5 CC వీల్ లభించుచుండును. యిది శరీరమునందు గల నొప్పులను నివారించుటకున్ను, శరీరమునకు పట్టుదల, రక్తవృద్ధి కలిగించుటకున్ను, పాండువ్యాధులను నివారించుటకున్ను, రక్తవృద్ధి జీర్ణశక్తి నిచ్చుటకున్ను, తిమురువాతములను నివారించుటకున్ను, నోటియందు కల్గు వ్యాధులను నివారించుటకున్ను యిది బాగుగా గుణము నిచ్చును. పాండువ్యాధులయందు కలుగు రక్తక్షీణతల

కున్ను, పాండువ్యాధి అన్ని లక్షణములకున్ను, జీర్ణాశయము యొక్క క్షీణత ఆకలి పుట్టించుటకున్ను వ్యాధులచే బాధపడిన తర్వాత కలుగు బాధలకున్ను టానిక్ మాధిరిగా గుణమునిచ్చును. రెండు మూడు దినముల కొకతూరి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని లేడర్‌లీ లెబోరేటరిస్ లిమిటెడ్‌వారు తయారుచేయుదురు.

### 31. కాసిలోమిన్.

### Cacylomin

ఇంట్రవీనసు ఇంజక్షన్.

మూత్రకృచ్ర్ఛ వాపునకు, మూత్ర ద్వారమువద్ద మంట, మూత్రము వెడలకుండుట మొదలగు వ్యాధులయందును గనేరియా వ్యాధులకును బాగుగా పనిజేసి, గనేరియా క్రిములను నశింపజేయును. మూత్రమును జారీగా వెడలించును. (Bi) కంపెనీవారిది బాగుగా పనిజేయును. మంటలు కూడ నివారణ జేయును. "పెనిసీలిన్" వెలువడిన పిదప పై ఇంజక్షన్ యొక్క ప్రయోజనము చాలా తగ్గిపోయెను.

### 32. సిలోట్రొపిన్.

### Cilotrophin

ఇంట్రవీనసు ఇంజక్షన్.

గనేరియా వ్యాధులలో సంభవించు మూత్రము మంటలు, మూత్రము పోవు మార్గమున వాచుట, అధిక

మగు బాధలు గలుగుట నివారించి, గనేరియా (సెగలు) నివారించి, మూత్రమును బాగుగా వెడలించి మేహబాధలు నివారించుటలో మంచి శక్తి గలది. షిరింగు కంపెనివారిది బాగుగా పనిజేయును. మంచిగుణమునిచ్చును. మంచి పని తనము గలిగి శ్రేష్ఠముగా నుండు నది "పెనిసీలిన్" వెలువడిన పిదప దీని యొక్క వాడుక అంతగా లేదు.

## 33. కారడఫాన్.

## Crradaphone

చర్మముక్రిందను కండరములోనికి జేయు ఇంజక్షన్.

1 CC 2 CC లభించును. గుండెలో కలుగు నొప్పికిని, ఊపిరితిత్తుల వ్యాధులను నివారించుటకును ఉపయోగపడుటేగాక గుండెకు గల సకలబాధలు నివారించును. మలబద్ధకము కలిగించును. పైత్యశూల గుండెశూలలను నివారించును. 1 CC లేదా 2 CC యివ్వవచ్చును. (Bi) కంపెనీవారిది బాగుగా పని జేయుటయందు పేరు మ్రోగినది. బలమును, తత్వమును, ప్రకృతిని గమనించి ఇంజక్షన్ చేయుచుండవలయును.

## 34. కార్డటోన్.

## Cardatone

చర్మముక్రిందను కండరములోనికి ఇచ్చుఇంజక్షన్.

గుండెయొక్క నీరసము పోగొట్టుటయందు మంచి పనిజేయును. పైత్యమువల్ల వచ్చు శూలలకు బాగుగా పని

జేయును. గుండెశూల నివారించును. గుండెకు బలము కలుగజేయును. 1 CC, 2 CC వాడుక జేయవలయును. యీవెన్సు కంపెనీ వారిది బాగుగా పనిజేయును. గుండె శూలకు అమోఘముగా పనిజేయును. తత్వమును పరిక్ర తిని గుర్తెరింగి వాడవలెను.

### 35. కాసినోసాల్.

Cacinosal

చర్మములోనికి కండరములలోనికిని చేయు ఇంజక్షను.

1 CC మొదలు 2 CC ల వరకు ప్రతిదినము చేయుటకు తగిన ఇంజక్షనులు. క్షయవ్యాధులకు, దగ్గుచే క్షీణించిన వారికి, బలహీనముగలవారికి, ఉపయోగ పడుటేగాక జ్వరమును కూడ తగ్గించును. మోకాళ్ళు మొదలగునవి వాచినప్పుడు, నొప్పులు అధికముగా నున్నప్పుడును ఈ ఇంజక్షను చేసిన వెంటనే గుణము కనిపించును. దినము ఒక ఇంజక్షను చొప్పున షుమారు ఆరు ఇంజక్షనులు చేసిన బలహీనమును పోగొట్టును.

### 36. కోలోసాల్ అయొడిన్.

Collosol Iodin (Intravenous Intra Muscular Injections)

ఇంట్రివీనసు అండ్ ఇంట్రమస్క్యులరు ఇంజక్షను.

న్యూమోనియా జ్వరములకు చాల మంచి పని జేయును. ఈఇంజక్షను మరచి చర్మముక్రింద చేయరాదు.

(చేసిన యెడల బాధలు కలిగించును.) జ్వరమును చాల త్వరగా నివారించును. న్యూమోనియా వ్యాధికి అమృతమువలె పనిజేయును. యెనిమిది ఇంజక్షను లిచ్చిన గొప్పగా పనిజేయును. విషజ్వరముల కిది పెట్టినది పేరు. జగద్విఖ్యాతి వహించిన పలు ఇంజక్షనులలో కిదియొక్కటి.

37. కోలోసాల్ కాల్షియం.

Collosol Calcuim

ఇంట్రవీనసు ఇంట్రామస్క్యులరు ఇంజక్షన్.

5 CC, 10 CC ట్యూబులు లభించును. క్షయవ్యాధి వలన బాధపడువారికి బాగుగా పనిజేయును. రక్తకాసలు, రక్తవాంతులు నివారించును. బలహీనత తగ్గించి, జీర్ణశక్తి నిచ్చుటయందు మంచి పనిజేయును. దగ్గులు నివారించును. క్షయ జ్వరమును నివారించును. ఈ ఇంజక్షన్ క్షయ వ్యాధులకు బాగుగా పనిజేయును. స్త్రీలకు గలుగు శ్వేత ప్రదరములుకూడ నివారించి పుష్టి గలుగజేయుటయందు ప్రఖ్యాతి వహించినది. బలహీనమును హృదయముయొక్క గతిని స్థితిని గమనించి ఇంజక్షన్ చేయవలయును.

38. లివరేక్సు.

Livarex

కండరములోనికి చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు వాడవలయును. క్షయవ్యాధుల వలన కలిగిన బలహీనమునకు యివ్వనగును. పాండు

రోగముగల వారికిని జ్వరమువలన రక్తముతగ్గి బలహీనత యేర్పడిన వారికి బహు కొందరగా పనిజేయును. మలేరియాజ్వరము తగిలి పూర్తిగా తగ్గిపోయిన పిదప శరీరములో సత్తువలేక నుండువారికి జీర్ణశక్తిలేక యుండు వారికి, గర్భిణితో నుండు స్త్రీలకు రక్తవృద్ధి గావించి ఆయాసము, బాధలను తగ్గించును. రక్తము వృద్ధిజేయును. జీర్ణశక్తి నిచ్చి బలమును కలుగజేయును.

## 39. హోపరెక్సు.

### Hopharex

కండరములోనికి చేయు ఇంజక్షను.

పాండువ్యాధులలో రక్తము తగ్గినవారికి, క్షయ వ్యాధుల బలహీనమునకు, గర్భిణీస్త్రీలకు గలుగు బలహీనము నడంచి చర్మవ్యాధులను నివారించును. మంచి పుష్టి నిచ్చును. రక్తము శుద్ధిజేయుటయందు మంచి పనితనము గలది. నీరు, వాపులుకూడ నివారించుటయందు గొప్ప పని జేయును. 2 CC అంపుల్సు వ్యాధి బలము నెరింగి వాడు చుండిన పై వ్యాధులు తప్పక నివారణమగును.

## 40. బై బిసుముతాల్.

### Bi-Bismuthol Intrvenous and Intramuscular Injection.

ఇంట్రావీనసు, ఇంట్రామస్క్యులరు ఇంజక్షన్.

అర్జంటుగల కేసులకు ఈ ఇంజక్షన్ యిచ్చిన

తొందరగా గుణము కనిపించును. సిఫిలిసు అను సవామేహ సంబంధమగు వ్యాధులకు పాషాణ సంబంధమైన ఇంజక్షనులు చేయకున్న యెడల, మధ్య మధ్య ఈ ఇంజక్షనులు యివ్వవచ్చును. 140 పౌనుల బరువు గలవారికి, వారమునకు మూడు ఇంజక్షనులు యివ్వవచ్చును. 100 మొదలు 120 పౌనులు గలవారికి రెండు ఇంజక్షనులు వారములో రెండుసార్లు యివ్వవచ్చును. నిదానముగ పనిజేయవలెననిన, కండరములోనికి ఈ ఇంజక్షను యివ్వవచ్చును. ఈ ఇంజక్షను మందు అంపుల్సును బాగుగా కదలించి వేడినీళ్ళలో నుంచి పిదప కొంతసేపటికి ఇంజక్షను చేసిన మంచిది.

## 41. బిస్—బో—బిస్మత్.

Bis-Bo-Bismath,

ఇంట్రిమస్క్యులరు, ఇంట్రివీనసు ఇంజక్షను.

సిఫిలిసు వ్యాధులకు పాషాణసంబంధమగు ఇంజక్షనులు చేయునప్పుడు మధ్య మధ్య ఈ ఇంజక్షనులు కూడ చేయుట మంచిది. F. D. Co, వారిది చాల మంచి పనిజేయును. ఈ ఇంజక్షను సయితము పై దానివలెనే పనిచేయును.

## 42. సల్పార్సనలు.

Salparsanal.

పాషాణ సంబంధమగు ఇంజక్షను.

ఇది ట్యూబులో పౌడరు రూపముగా తయారు

చేయ బడును. గవర్నమెంటువారిచే పరీక్షింపబడి సీసాలు అంపుల్సుచేసి ఉంచుదురు. ఈఇంజక్షన్ ట్యూబులు క్రింద మోతాదు లలో వాడనగను. మరచి కండరములోనికి యెన్నడు చేయరాదు. రక్తనాళములోనికే చేయవలయును. చాల జాగ్రత్తగా చేసిన వ్యాధిపై తొందరగా మంచి గుణము కనబడును. 0.15 0 గ్రాములు, 0.30.0 గ్రాములు, 0.45.0 గ్రాములు, 0.60.0 గ్రాములు. 0.75.0 గ్రాములు, 0.90.0 గ్రాములు, ఈ విధానముగా ఔషధముయొక్క బలమును రోగ బలతత్వముల నెరింగి, (సవామేహ మనగా) సిఫిలిసు వ్యాధులకు ప్రత్యేకముగా వాడుచుం దురు ముందుగా రక్తము పరీక్షించి ఇంజక్షన్ చేయవల యును. 10 CC డిస్టిల్డు వాటరు. సీసాలో గల సల్వార్స నలు పౌడరులో కలిపి. ఇంజక్షను చేయవలయును. శుభ్రముగా సూదులు, సిరంజీ, వేడినీళ్ళలో మరగించి ఇంజక్షను యిచ్చిన చాలమంచిది. డిస్టిల్డు వాటరు బాగుగా మిశ్రమముజేసి సిరంజీలోనికి లాగుకొని జాగ్రత్తగా రక్తనాళములోని కియ్యవలయును. సవామేహ జబ్బులకు, పిరంగి జబ్బులకు ప్రత్యేకముగా పనిజేయును. పెద్దలకు మొదట సామాన్యముగా 0.60.0 వరకు వారంరోజులకు ఒక ఇంకక్షను చేసిన చాలును. క్షయవ్యాధి గలవారికి, మూత్రవ్యాధి గలవారికి గమనించి ఇంజక్షను చేయవల యును. యెక్కువ పసరుగల వారికి (పైత్యతత్వము గల

రోగులకు) ఇంజక్షనుచేసిన పసరు యెక్కువ యగును. ప్రాణాపాయము కలుగును ఒకప్పుడు శరీరము పెట్లి బీట బారును. గనుక ప్రతి ఇంజక్షను పెట్టెలో నుండు కాగిత మును సాంగోపాంగముగా చదివి, దానిని గుర్తునందుంచు కొని ఇంజక్షనిచ్చిన వ్యాధి నివారించును. బలహీనము, గుండెయొక్క బలహీనముగల వ్యాధులందు యెన్నడును ఇంజక్షను చేయరాదు. గమనించి చేయవలయును. సామాన్య ముగా సవామేహము, గనేరియా వ్యాధులకు చేయుచుండ వలయును. నెం. 1 మొదలు 10 నెంబరు వరకు ఔషధ ముతో నింపబడిన అంపుల్స్ లభించుచుండును. పెద్దలకు 3 నెంబరు మొదలు 6 లెక 7 వరకు చేయనగును పాషాణ సంబంధమైన ఇట్టి ఇంజక్షనుకు విరుగుడుగా అవసర మునుబట్టి బిస్మిత్ ఇంజక్షన్ పెట్టె నెం. 40 లేక 41 చేయు చుండవలయును. రోగక్రిములను సంహరించును. సవా మేహ వ్యాధులకు నాలుగు ఇంజక్షనులు నాలుగు వారము లలో చేసిన సవామేహవ్యాధియేగాక క్రిమి జాడ్యములను కూడ సంహరించి, రక్తశుద్ధిజేయును. చర్మవ్యాధులకు బాగుగా పనిజేయును. నేడు పై వ్యాధులకు "పెనిసీలిన్" ఔషధము కడుసమర్థతలో నిర్మూలించుచున్నది.

## 43. మిల్క్ ప్రొటిన్.

(Milk protein. Intramuscular Injection)

కండరములోనికి చేయు ఇంజక్షన్.

2 CC, 5 CC, 10 CC, పరిమాణములో లభించు

చుండును. దీనిని పాలతో తయారుచేయుదురు. గనేరియా వ్యాధి గలవారికి, కీళ్ళనొప్పులకు స్త్రీలకు కలుగు మర్మస్థానమునందలి వ్యాధులకు, చర్మవ్యాధులకు, 2 CC మొదలు 10 CC వరకు వాడనగును. అన్ని కంపెనీల వారును యీ ఇంజక్షనులను తయారు చేయుచున్నారు.

## 44. అండ్రినలిన్ క్లోరైడ్.

### Adrenalin Chloride

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

ఈ ఇంజక్షన్ రబ్బరు మూతవేయబడిన సీసాలో లభించును. వెయ్యిభాగములలో ఒకభాగము పై ఔషధము కలిసియుండును. 1/2 CC మొదలు 1 CC వరకు రోగి బలములను అనుసరించి యివ్వవలయును. రోగి బాధ తగ్గువరకు గంట కొకసారి, అర్ధగంట కొకసారి యివ్వవలయును. బాధలు తగ్గినతర్వాత ఈ ఇంజక్షన్ లోపుచేయవలయును. మోతాదు యెక్కువైన యెడల ప్రాణాపాయము కలుగును. రోగియొక్క రక్తపుపోటు ననుసరించి జాగ్రితగా ఇంజక్షన్ యివ్వవలయును. ఉబ్బసము వ్యాధి బాధలు తొందరగా తగ్గించుటకు దీనికి మించిన ఔషధము లేదు. గుండెకు మంచిబలము నొసంగును. క్లోరొఫారము వలన కలిగిన ప్రమాదములను నివారించుటకు సయితము ఉపయోగపడును.

### 45. ఎడ్రిపో ఎఫిడ్రిన్.

### Edripo Ephedrin

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

మోతాదు 1 CC యివ్వవలయును. శ్వాస వ్యాధులకు యివ్వవలయును. ఆలస్యముగా పనిజేయును. గుండెకు బలమునిచ్చి, శ్వాస వ్యాధిని నివారించును. ఎడ్రసలిన్ క్లోరైడ్ మాదిరిగా పనిజేయును. ఉబ్బస వ్యాధులకు కూడ మంచి పనిజేయును.

### 46. ఎఫిడ్రిన్ హైడ్రోక్లోరైడ్.

### Ephedrine Hydrochloride

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

మోతాదు ½ అర్థగ్రైను మొదలు ముప్పావుగ్రైను వరకు 1 CC ద్రవములో చేర్చబడిన అంపుల్స్ లభించును. శ్వాస సంబంధమైన వ్యాధులకు నిమిషాల ప్రకారము మంచిగుణము కనిపింపజేయును. ఉబ్బసవ్యాధికి మంచిగా పనిజేయును. ఈ ఇంజక్షను మాత్రలుకూడ లభించును. ఉబ్బస సంబంధమగు అన్ని వ్యాధులకు వజ్రాయుధము.

### 47. ఒవేరియన్ రెసిడ్యూ.

### Overian Recdu

కండరములోనికి చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్స్ లభించును. సామాన్యముగా ప్రతి

దినము, గుణము కనిపించునంతవరకు దినము ఒక ఇంజె క్షన్ యివ్వవలయును. వైద్యుడు శరీరతత్వ స్వభావము లను గ్రహించి యుక్తవయస్సు వచ్చి రజస్వల కాని కన్య లకు ఇంజక్షన్ చేసిన యెడల అవయవస్ఫూర్తి కలుగును. స్త్రీలకు గల్గు ముట్టుశూలలు నొప్పులను సహా నివారించును.

## 48. ఇన్సులిన్.

## Insulin

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

మోతాదు ½ CC నుంచి 1 CC వరకు వాడవల యును. ఈఔషధము రబ్బరు మూత వేయబడిన సీసాలో నుండును. ముఖ్యముగా మధుమేహములకు మాత్రము వాడుట గలదు. మూత్రములో చక్కెరలేనిదే పై ఇంజ క్షను నీయరాదు. ఇచ్చిన యెడల రోగి మూర్ఛపోవును. సాధారణమైన పరిస్థితులయందు చర్మముక్రిందను, రోగికి స్పృహలేనప్పుడు రక్తనాళములోనికి నీయవచ్చును. మధు మేహమును నివారించుననుట కెట్టి సందియములేదు. మూత్రమున చక్కెర యెక్కువగా పోవువారికిచ్చిన అట్టి దానిని వెంటనే తగ్గించును. ప్రతిదినమును మూత్రపరీక్ష గావించి చక్కెర యెంత (యెన్నివంతులు) తగ్గుచున్నదో గమనించు చుండవలయును. చక్కెర ఒకభాగ మున్న దనగా ఇంజక్షన్ ఆపుచేయవలయును. తరువాత మంచి

గుణము కలిగిన ఔషధము వాడుచున్న యెడల మధు మేహ వ్యాధిని నివారించును.

### 49. ఎమిటిన్ హైడ్రోక్లోరైడ్.

### Emetin Hydrochloride

### కండరములోనికి చేయు ఇంజక్షన్.

½ CC, 1 CC ట్యూబులు లభించును. రక్తాతిసారములు, ఆమాతిసారములు, జిగటలో కూడిన అతిసారములు విరేచనములు అగునప్పుడు యిచ్చిన మంచి పనిజేయును. గుదమువద్దను, కడుపులోనుండు బాధలు నివారించును. కార్జములో పుట్టినటువంటి వాపును నివారించును. ఈ ఇంజక్షన్ రోగి బలముల ననుసరించి, తత్వమును బాగుగా గుర్తెరింగి యిచ్చిన మంచిపనిజేయును. ప్రేగులలోని క్రిములను సంహరించును. మూడురోజులు వరుసగా యిచ్చిన మంచి పనిజేయును. మొత్తము తొమ్మిది ఇంజక్షను లిచ్చిన తరువాత చాలించవలయును. పైవ్యాధులకు వజ్రాయుధమువలె పనిజేయును. అందు యెంత మాత్రమును సందేహించ నవసరములేదు.

### 50. అయిరన్ అర్సనైట్.

### Iron Aresenite. (Intramuscular injection)

### కండరములోనికి చేయు ఇంజక్షన్.

1 CC సీసాలో 1 గ్రైను ఔషధముండును. ఈ ఇంజక్షను రక్తశుద్ధిలేక కలిగెడు చిడుము, కురుపులు,

చర్మవ్యాధి, గజ్జి, దురదలు నివారించును. పాండువ్యాధులకు మంచి పనిజేయును. కామిలావ్యాధి నివారించును. మంత్రిపుపొక్కుల బాధ నివారించును. దినము ఒక ఇంజక్షను చొప్పున ఆరు ఇంజక్షనులు యివ్వవలయును. మలేరియా జ్వరమునకు కూడ బాగుగా పనిజేయును.

51. అయిర౯ అర్సినైట్ స్ట్రిచ్‌నై౯.

Iron Arsenite Strych Nine

కండరములోనికి చేయు ఇంజక్ష౯.

1 CC సీసాలో అయిర౯ అర్సినైట్ ఒకగ్రైను. స్ట్రిచ్‌నైన్. 1/60 గ్రైను పరిమాణమువరకు చేర్చిపాషాణ సంబంధముగా తయారుచేయుదురు. ఈ తయారుచేసిన మందు పాండువ్యాధులకు ఇంజక్ష నిచ్చిన రక్తవృద్ధియై పాండువ్యాధులు నివారించును. గుండెకు మిక్కిలి బలము నొసంగును. బలహీనతచే నుండువారికి మంచి బలము నిచ్చును. దేశకాల స్థితులను, తత్వము ననుసరించి చర్మవ్యాధులకు ఇంజక్ష౯ చేయవచ్చును. ఆరుదినములు ఆరు ఇంజక్షనులు యివ్వవచ్చును. సాధారణమైన నీరస స్థితియందు పై ఇంజక్షను యిచ్చిన యెడల శరీరమునకు తేజము గలిగించును.

52. అయిర౯ సిట్రేట్.

Iron Ctrete

చర్మముక్రిందను, కండరములోనికి యిచ్చునట్టిది.

రెండు గ్రైనుల ఔషధము 1 CC సీసాలో

నుండును. గొప్పగొప్ప వ్యాధులు కుదిరినతరువాత శరీరములోర క్తము లేక బహీనము గలగి, జీర్ణ శ క్తి లేక నీరసస్థితియందుండు వారికి ఈ ఇంజక్షను యిచ్చిన టానికు మాదిరిగా పనిజేసి ర క్తము శుద్ధి జేసి, బలహీనత నివారించి మంచి తేజస్సును నరములకు బలమును కలుగ జేయును. ప్రతి దినము ఒక ఇంజక్షన్ చొప్పున ఆరు ఇంజక్షనులు యివ్వవచ్చును.

## 53. ఎర్గటిన్.

## Ergotin

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1/100 గ్రైను ఔషధము 1 CC సీసాలో లభించును. ప్రసవానంతరము మావి బయలువెడలుటకు ఆలస్యమైన యెడల వెంటనే ఈ ఇంజక్షన్ యిచ్చిన మావి బయటకు వెడలును. ర క్త స్రావము అధికముగా నున్న తగ్గించును. ర క్తస్రావములకు మంచి పనిజేయును.

## 54. ఎన్ట్యూ ట్రిన్.

## Antultrin

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC గల అంపుల్సు సీసాలు వాడుకలోగలవు. ఎదుగక గట్టిబారియున్న బాలురకు బాలికలకు యిచ్చిన ఎదుగుదురు. బుద్ధిబలమును జ్ఞాపకశ క్తిని వృద్ధిజేయును. సోమరితనము నుండి తప్పించును. ఈడువచ్చి రజస్వల

కాని వారికి యిచ్చిన వెంటనే రజస్వల లగుదురు. పార్కు డేవిసు కంపెనీ వారిది మంచి పనిజేయును.

### 55. ఐసొటానికు సెలైన్ సొల్యూషన్.

### Isotonie Saline Solution.

### ఇంట్రివీనసు ఇంజక్షన్.

దేహపుష్టి, కండరములకు శక్తి, రక్తపుష్టి, రక్తశుద్ధి చేసి బలమును కలిగించి ముఖమునకు కాంతి. నరములకు పటుత్వము, వీర్యవృద్ధి, వీర్యశుద్ధిజేయును. వేల్సుకం కంపెనీ వారు తయారుచేయునది చాలా మంచిది. దినమునకు ఒక ఇంజక్షన్ చొప్పున వాడవలయును.

### 56. సైలాన్ విద్ అయోడిన్.

### Saline with Iodine

### ఇంట్రిమస్కులరు ఇంజక్షన్.

5 CC, 10 CC, లభించును. మూడుదినముల కొకసారి ఇంజక్షన్ చేసిన మంచిది. ఆరు ఇంజక్షనులు చేసిన వ్యాధినివారించును. స్త్రీలకు కలుగు శ్వేతప్రదరములు, రక్తస్రావములు గనేరియా వ్యాధులను నివారించును. (Bi) కంపెనీవారిది చాలా మంచి పనిజేయును. శ్వేతప్రదరములకు మిక్కిలి చాక చక్యముగా నివారించగల శక్తి గలది.

## 57. బిస్మిథాలు.

Bismuthol, (Intramuscular Injection)

ఇంట్రిమస్క్యులరు ఇంజక్షన్.

2 CC 5 CC లభించును. ప్రతిదినము యివ్వ వచ్చును. ఆరు ఇంజక్షనులు యిచ్చిన చాలును, "సిపిలిసు" అనగా సవామేహ జబ్బులుగలవారికి యిచ్చిన నిదానంగా పనిజేయును. సిపిలిసు సంబంధముగల అన్ని వ్యాధులను నివారించును. అలంబికు కంపెనీవారిది చాలా మంచిపని జేయును. ఇంజక్షన్ అంపుల్సు కదలించి యివ్వవలయును.

## 58. మల్టిన్.

Multin. (Intramuscular Iujection)

ఇంట్రిమస్క్యులరు ఇంజక్షన్.

2 CC యివ్వవచ్చును. దినము తప్పి దినము వచ్చే వరుసజ్వరము, విషజ్వరములతో కూడిన రుగ్మత (మలేరియా) అను చలిజ్వరము ఇన్ఫ్లూయంజా, మొదలగు అనేక జ్వరముల నివారించును. దినము తప్పి దినము ఇంజక్షన్ చేయుచుండవచ్చును. మూడు ఇంజక్షనులు చాలును. జ్వరమున్న వేళలయందుకూడ ఇంజక్షన్ చేయవచ్చును. సాధారణమైన జ్వరములు తప్పక నివారించును. ఒకఇంజక్షనుకే జ్వరము నివారించునుగాని మూడు ఇంజక్షనులు తప్పకుండా యిచ్చిన సర్వ విషజ్వరములు మాయమగును.

ఈ ఇంజక్షను నివారించగల అనేక వ్యాధులను "పెనిసీలిన్" ఇంజక్షను గూడ నేడు నివారించు చున్నది.

59. అ క్ట లా ర స౯.

Acetylarsan, (Intramuscular Injection)

ఇంట్రిమస్క్యులరు ఇంజక్ష౯.

3 CC ఇంజక్షన్ చేయనగును. M & B Co., వారిదే లభించును. ఏకం పెనీవారు చేయరు. సవాయి సంబంధమైన అనేక వ్యాధులకు పనిజేయును. గనేరియాకు, శరీరము నందు గల అన్నినొప్పులకు, జ్వరములకు, క్రిమిసంబంధమైన అంటుజాడ్యములకు మంచి పనిజేయును. రెండు దినముల కొకపర్యాయము ఇంజక్ష నిచ్చిన చాలును.

60. గ్లూ కో సు ఇ ం జ క్ష౯.

Glucose Injection

ఇంట్రవీనసు ఇంజక్ష౯.

5 CC 10 CC 25% సొల్యూషనుతో వాడుక చేయుదురు. నరముల బలహీనత గలవారికి బాగుగా పనిజేయును. గుండెదడ నివారించి గుండెకు బలము నొసంగును. అపస్మారము గలవారికి తొందరగా గుణము నిచ్చును. రోగికి స్పృహతప్పి నోటిద్వారా ఆహారము పోనివారికి ఈ ఇంజక్షను రక్తనాళముద్వారా చేసిన ఆహారము తీసుకొనుటకై తగినశక్తిని కలుగజేయును. దినము ఒక ఇంజక్ష౯ యివ్వవలయును. అవసరము ననుసరించి జాగ్రతగా గమనించి

ఇంజక్షను చేయవలయును. మత్తుమందు ప్రయోగించుటచే యెక్కువై వాంతులు సంభవించి నప్పుడు వెంటనే ఈ ఇంజక్షనిచ్చిన వాంతులుకట్టును. పసిపిల్లలకు కలుగు మొండిజ్వరములకు కూడా పనిజేయును. ఈ గ్లూకోసు ఇంజక్షను పెద్దవారికి కలుగు మొండి వ్యాధులకును పని జేయును. మధుమేహ వ్యాధులలో మైకము గలిగి నప్పుడు మంచిగా పనిజేయును. దీనిని గ్లూకోసు సొల్యూషనందురు. C. T. E. కంపెనీవారిది చాలా మంచిగా పనిజేయును.

## 61. థయోసారామిన్.

Thio Sarmine, (Intramuscular Injection.)

ఇంట్రిమస్కులరు ఇంజక్షన్.

ఈ ఇంజక్షన్ పాషాణ సంబంధమైనది. బ్రహ్మచారి కంపెనీవారు తయారుచేయుదురు. సిఫిలిసుగల వ్యాధులకు వాడ వలయును. సల్ఫరుసానల్ మాదిరి పనిజేయును. సల్ఫరుసానల్ మాదిరిగానే డబ్బాపై నెంబరుగలదు. సవామేహ వ్యాధికి నాలుగు దినములకు ఒక ఇంజక్షన్ చేసిన, సవామేహములు నివారించును. చాల జాగ్రతతో కండరములకే యివ్వవలయును. "పెనిసిలిన్" వెలువడిన పిదప దీని ప్రయోజనము చాలవరకు తగ్గెను.

## 62. పొటాషియం యాంటిమొనిటార్ట్రెట్.

Potassium Antimonytartrate

ఇంట్రవీనసు ఇంజక్షన్.

1 CC 2 CC ఆంపుల్సు లభించును. పొరపాటున

మ్రింగరాని విషసంబంధమైన వస్తువులు మ్రింగిన యెడల వెంటనే పై ఇంజక్షన్ జేసిన యెడల విషమును వాంతి గావించును. అజారు వ్యాధికి వాడుకగలదు. మూడు దినముల కొకసారి ఇంజక్షన్ చేసేది. ఈ ఇంజక్షన్ చేసిన వెంటనే ఒకవేళ వేడి యెక్కువైనను దగ్గు, పేగులలో గాలిజొచ్చుట, వాంతి విరేచనములు కలిగినయెడల వెంటనే ఇంజక్షన్ ఆపుచేయవలయును. ఈ ఇంజక్షన్ యెన్నటికి కండరములోనికి యివ్వకూడదు. యిచ్చినయెడల పోటు, వాపు, బాధ యేర్పడును. జాగ్రితతో గమనించి ఇంజక్షన్ చేసిన చాల మంచి పనిజేయును.

## 63. సల్ఫోడైన్.

## Sulfodine. (Intramuscular Injection)

## ఇంట్రమస్కులరు ఇంజక్షన్.

1 CC ఇంజక్షన్ లభించును. గనేరియా వ్యాధికి మిక్కిలి మంచి పనిజేయును. గనేరియావలన కలుగు అన్ని అవస్థలకు గుణము కలిగించును. నడుము నొప్పులను వెంటనే తగ్గించి, వాతనొప్పులుకూడ నివారించుటలో మంచి గుణము కలదు. తొంటి నొప్పులకు కూడ బాగుగా పనిజేయును. మెడికలు సప్లయిస్‌కంపినీ లిమిటెడ్ కలకత్తా కంపెనీ వారిది చాల మంచి పనిజేయును.

## 64. సిబాజాల్.

Cibazol. (Intraveous and Itramuscular Iujection)

ఇంట్రావీనసు, ఇంట్రామస్క్యులరు ఇంజక్షను.

5 CC ఆంపుల్సు లభించును. ఈ ఇంజక్షన్ గనేరియా వ్యాధికి వాడిన తొందరగా గుణము కనిపించును. చర్మవ్యాధులు రక్తశుద్ధి లేక కలిగెడు వ్యాధులకు మూడు ఇంజక్షను లిచ్చిన గుణము కనిపించి తొందరగా అన్నిచర్మ వ్యాధులు నివారించును. ఈఇంజక్షను మాత్రలుకూడ లభించును. అవికూడ వాడుక జేయుదురు. "సీబా" కంపెనీ వారిది ఉత్తమగుణము కలవి. గనేరియా వ్యాధికికూడా బాగుగా పనిజేయునను టట నిర్వివాదాంశము. ఇంజక్షన్ మాత్రము చాల జాగ్రితతో చేయవలయును. ఇంట్రవీనసు ఇంజక్ష నిచ్చిన చాల తొందరగా పనిజేయును. గుండె బలహీనము గలవారికి జాగ్రతతో నియ్యవలయును. పై ఇంజక్షను నివారించగల అనేక వ్యాధులను కడుశీఘ్రముగా నేడు పెనిసీలిన్ నివారించుచున్నది.

## 65. డిజిటాలిన్.

Digitalin

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC లో 1/100 గ్రైను పరిమాణముగల ఔషధ ముండును. గుండెదడను తగ్గించును. గుండెకు మంచి

బలము కలిగించును. మూత్రము యెక్కువగా వెడలింప జేయును. ఆయాసము, జలోదరముతో గూడియున్నపుడు మంచి పనిజేయును. రక్తము శరీరములో ఆడని యెడల ఈ ఇంజక్షన్ యిచ్చిన ఆడునట్లు జేయును. గుండెదడను, నాడియొక్క స్థితిని అనుసరించి ఇంజక్షను చేయవలయును. ఇరువది నాలుగు గంటలలో 1/6 గ్రైను ఔషధముకన్న యెక్కువ చేయరాదు. గుండెకాయ యందు దుష్టతత్వము చేరి గురుకగలవేళ ఇంజక్షన్ చేయవలయును. ఉబ్బసపు వ్యాధులకు ఈ ఇంజక్షన్ చేయరాదు. నాభివంటి విష మూలికలచే కలుగు బాధలకు విరుగుడుగా పనిజేయును. (Bi) కంపెనీ వారిది బాగుగా గుణముకలిగి ఉండును. పైత్యాదులకు మంచిగా పనిజేయును.

### 66. డిజిటాలిన్ అండ్ స్ట్రిచ్నైన్.

### Digitalin and Strychnine

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1/100 గ్రైను పరిమాణము గల డిజిటాలిన్, 1/60 గ్రైను పరిమాణముగల స్ట్రిచ్నైన్ మందు కలిపి తయారు చేయుదురు. స్ట్రిచ్నైన్ మందును ఆయుర్వేద వైద్యులు విషముష్టి యని పిలుతురు. 1 CC సీసాలోనిదే వాడుకచేయుట గలదు. గుండెకు మంచిబలము కలిగించును. నరములకు చురుకుదనమును హెచ్చించును. శరీర తత్వమును వేడిజేయుటకు యివ్వవచ్చును. తరుణ వ్యాధు

లలో శరీరము చల్లబడిన అప్పటికప్పుడే వేడి కలుగ జేయును. వాతము గ్రమ్మినదని తెలిసి నప్పుడును నాడి సన్నముగా నడచునపుడు యివ్వవచ్చును. కఫము గొంతున కడ్డముపడినప్పుడు. గురుక గలిగినప్పుడు వెంటనే ఈ ఇంజక్షన్ చేసిన కఫమును పోగొట్టి ఆరోగ్యమును కలిగించును. అమృతమువలె పనిజేయుటయందు ప్రసిద్ధి. అరగంట కొకసారి లేదా గంటకొక పర్యాయము తర్వాత నాలుగు గంటల కొకసారి, అటుతర్వాత రోగి పరిస్థితి ననుసరించి చేసినచో రోగి పాలిటికి కల్పవల్లిగా పరిణమించి పైరోగములనెల్ల నిశ్శేష మొనర్చి, నిత్య జీవితమున కొక నూతన వెలుగును చూపించి మార్గదర్శి కాగలదని నుడువుట యతిశయోక్తి కానేరదు. (Bi) కంపెనీవారిది గొప్ప గుణము కలది.

## 67. పలుడ్రిన్.

### Paludrin (Intravenous Injection)

### ఇంట్రావీనసు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించును. ఇంపీరియల్ కెమికలు ఇండస్ట్రీసు ఇండియా లిమిటెడ్ కంపెనీవారు దీనిని తయారు చేయుదురు. రక్తనాళములకే యివ్వవలయును. మరచి కండరములోని కెన్నడును యివ్వరాదు. చలితో గూడిన మలేరియా జ్వరము, తలనొప్పితోకూడిన జ్వరము దినముతప్పి దినము వచ్చు జ్వరము (దీనినే వరుసజ్వర

మనియెదరు) నకు మంచి పనిజేయును. బలహీనము, గుండెదడ వ్యాధిగల వారికి యెన్నడును ఈ ఇంజక్ష నివ్వరాదు. ఈ కంపెనీవారి పల్వ్రిక్ మాత్రలు 3 గ్రైనులవి లభించును. మలేరియావ్యాధికి అన్ని ఇంజక్షనులకన్న యివి మిక్కిలి బాగుగా పనిజేయును. రోగి వయస్సు బలము ననుసరించి ఇంజక్షను చేసిన నొప్పులుకూడ హరించును. సర్వసాధారణమైన మలేరియా జ్వరములకు మూడు ఇంజక్షను లిచ్చిన చాలును.

### 68. సింకొనిన్ బై హైడ్రోక్లోరైడ్

### Cinchonine Bi Hydrocloride

### ఇంట్రమస్కులరు ఇంజక్షన్.

5 గ్రైనుల 1 CC 7½ గ్రైనుల 2 CC అంప్యుల్స్ నందు లభించుచుండును. క్వైను ఇంజక్షను యిచ్చిన పైత్యము, వాంతులు గల్గువారికి, క్వైను పడనివారికి ఈ ఇంజక్షను యిచ్చిన పైత్యము వాంతులు లేక మంచి గుణమిచ్చును. ఎక్కువగా మలేరియా జ్వరము గలవారికి వాడుకచేయుట గలదు. తలనొప్పి విషపడిసెమును నివారించును. సాధారణముగా శరీరమున జ్వరమున్నప్పుడు ఈ ఇంజక్షను యివ్వకూడదు. యిచ్చినయెడల జ్వరతీవ్రత యెక్కువగును. గమనించి చేయవలయును. మలేరియా జ్వరమువలన చాలదినముల నుండి బాధ పడువారికి ఈ ఇంజక్షను అమోఘముగా పనిజేయును. మలేరియా పిశాచ

మును కూకటి వేళ్ళలో పెల్లగించి నాశనముజేయును. మూడుదినముల కొక ఇంజక్షను చేయుచుండ వలయును. మూడు ఇంజక్షనులకే మలేరియా పూర్తిగా నశించును. వృద్ధులకు కూడ 1 CC చేసిన చాలును. క్వినైనుకు బదులు దీనిని తప్పకుండ వాడవలయును. దీనివలన ఉపయోగములు అనుభవముమీద తెలిసికొనవలెను.

## 69. లారోస్టిబిన్.

Larostibin (Intramuscular Injection)

ఇంట్రమస్క్యులరు ఇంజక్షన్.

5 CC లభించును. ఆమ్లపిత్తము, కడుపుబ్బరము, పులిత్రేపులు, పైత్యసంబంధమైన వ్యాధులు నివారించి, జీర్ణశక్తిని కలుగజేసి మంచిబలము కలుగజేయును. కడుపుబ్బరమునందు బాగుగా పనిజేయును. ఈ వ్యాధిని గ్యాసుట్రిబులు అందురు. పై వ్యాధులలో బాగుగా పనిజేయును. కడుపులోని శూల కూడ నివారించును. ప్రతిదినము ఈ ఇంజక్షను చేయరాదు. రెండుదినముల కొకసారి చేసిన చాలును. ఆరు లేక పన్నెండు ఇంజక్షనుల కోర్సు నుపయోగించిన, శరీరములో విటమిను తగ్గిన దానికి పనిజేయును. ఈ ఔషధము విటమినులతో తయారుచేయుదురు. దీని మెలిగ్రాం గుర్తెరింగి వాడుక చేయవలయును. రోగి తత్వము నెరింగి వాడుకొనవలెను. విటమిన్ బి మాత్రలు కూడ వాడుచున్నయెడల వ్యాధిని తొందరగా నివారింప

జేయుటయందు ప్రసిద్ధిగలది. ఈ ఇంజక్షను ఔషధము పెద్ద మోతాదుగా చర్మముక్రింద యెన్నడు చేయరాదు. కండరములోనికే చేయుచుండవలయును.

## 70. పిట్రెసిన్.

Pitressin

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

½ CCమొదలు 1 CCవరకు వాడుదురు. అపరేషను చేసినపిమ్మట యిచ్చిన యెడల రోగికి తలతిరుగుట సంభవించదు. బహుమూత్రవ్యాధిగలవారికి యిచ్చిన బహుమూత్రమును తగ్గించగలదు. మలబద్ధకమును నివారించును స్త్రీలకు కలుగు రక్త స్రావములు కట్టించును. రక్తము పోవువారికికూడ రక్తము నాపును. మూత్రము వెడలకుండునపుడు ఈ ఇంజక్షను చేసినయెడల మూత్రము జారీచేయును. గమనించి చేసిన మంచిగుణము కలుగును. ముక్కు బెదరి రక్తము కారుచున్న ఆపును. రక్తప్రదరములు నివారించును. అపరేషన్ చేయునప్పుడు వెడలెడి రక్తమును తగ్గించును. ఈ ఇంజక్షను సాధారణముగా అనేక విధములైన రక్తస్రావములను అరికట్టుటకు ఉపయోగించును.

## 71. పిటోసిన్.

Pitocin

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

½ CC ద్రవముగల అంపుల్సు 1 CC ద్రవముగల

అంపుల్సు లభించుచుండును. రక్తపుపోటు హెచ్చించ కుండ, గర్భకోశ కండరములను, మూత్రకోశమును సంకుచితపరచును. ప్రసవసమయమున నొప్పులు రాకున్న ఈ ఇంజక్ష నిచ్చిన నొప్పులను కలిగించి ప్రసవించునట్లు జేయును. నిమిషాలమీద దీని గుణమును చూపించును. అనేక విషయములు బాగుగా పరిశీలించిన పిదపనే ఈ ఇంజక్షను గర్భవతులకు చేయవలసి యుండును.

## 72. పిట్యూట్రెన్.

## Pituitrin

### చర్మక్రింద చేయు ఇంజక్షన్.

1/2 CC నుండి 1 CC అంపుల్సు వాడుకొందురు. రక్తపుయొత్తిడి అధికనుజేయును. శీతలము గ్రమ్మినపుడు పనిజేయును. నాడి సన్నగిలినప్పుడు కూడా దీనియొక్క మంచిగుణము చూపించును. ఈ ఇంజక్షను మంచి పని జేయు ననుటలో సందేహములేదు. రక్తప్రసరమునకు చురుకు యేర్పరచి రక్తపుయొత్తిడి అధికముజేయును. శ్వాసవ్యాధికి కళ్ళె తెగనప్పుడు ఈ ఇంజక్షన్ చేసినచో కళ్ళెను పడునట్లు చేయును. ఉబ్బసపు వ్యాధికి యిచ్చు ఇంజక్షను ఎడ్రనలిన్‌కంటె ఈ ఇంజక్షను గుణము చాల సేపు ఉండును. రక్తపుపోటు ఉన్న వారికి యివ్వరాదు. ప్రసవించుటకు స్త్రీలకు శక్తి లేనప్పుడు నొప్పులు ఆగిఆగి వచ్చు సమయమందు యిచ్చిన మంచి పనిజేయును. యోని

మార్గము నుండి బయటు వెడలుటకు యెట్టి ఆటంకము లేని శిశువుయొక్క శిరస్సు యోనిమార్గమునకు దిగుచున్న పుడు ఈ ఇంజక్షను యిచ్చిన శిశువును సరియైన మార్గమునకు దీసికొని వచ్చి విడచును. కలరావ్యాధికి, టైఫాయిడు జ్వరమునకు, న్యూమోనియాకు చేసిన మంచిఫలితము నిచ్చును. ఆపరేషను చేసిన తర్వాత కలుగు బలహీనమును బోనడంచును. మధుమేహములకు ఇన్సులిన్ ఇంజక్షన్ యిచ్చినప్పుడు కలుగు బాధలకు, ఈ ఇంజక్షన్ విరుగుడుగా పనిజేయును. తరుణవ్యాధులలో యిచ్చిన ఇంజక్షనులు యేమిపనిజేయని యెడల ఈ ఇంజక్ష నిచ్చిన అప్పటికప్పుడే మంచి గుణము కనుపించును. తొందరలో గుండెకు బలమిచ్చును. ఈ ఇంజక్షనులు అవసరమునుబట్టి చేసుకొను చుండవలయును. చాల జాగ్రితగా గమనించి ఈ ఇంజక్షను చేయవలయును. పైన దెల్పినట్టుల మంచి లక్షణములతో ప్రసవమునకు సిద్ధముగా నున్నప్పుడే చేయవలయును. గర్భిణీస్త్రీకి పిండము తిరుగుచున్నప్పుడు చేసినయెడల చాల అపాయము సంభవించును. డిజిటలిన్, స్టిచ్నైన్ క్యాంఫరు ఈ ఇంజక్షనులు పనిజేయకయున్న ఈ ఇంజక్ష నిచ్చిన త్వరగా పనిజేయును. గమనించి జాగ్రతతో చేయవలయును.

---

73. రోమటిజంబై ఫైలాజిస్టన్.
Rhyeumatism Bi Phlogiston
(Intramuscular Injection)
ఇంట్రిమస్క్యులరు ఇంజక్షన్.

5 CC రబ్బరుమూత బల్బుగలది లభించును. అవసరమును బట్టి దినము 1 CC వాడుచుండవలయును. శరీరములో గల నరములకు బలము నొసంగును. పక్షవాతములకు పనిచేయును. నడుము నొప్పులను నివారించును. కీళ్ళ నొప్పులకు బాగుగా పనిచేయును. దినము 1 CC ఇంజక్షను చొప్పున పదిఇంజక్షను లిచ్చిన పక్షవాతములు, కోరు వాతములు, సాధారణమైన వాతములు నివారించును. (Bi) కంపెనీవారిది బాగుగా పనిజేయును.

74. మేగ్నిషియం సల్ఫేటు
Magnisum Sulpate.
కండరములోనికి చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సులో 25% వంతు ఔషధము కలిగి యుండును. బాలురకు కలుగు పిడికిలి వాతము మీద బాగుగా పనిచేయును. ధనుర్వాతమునకు, కోరువాతమునకు, కోరియా డెటనిసు వాతములలో కలుగు గురక కఫములను మాన్పును. కండరములలో కలుగు యీడ్పును కుదుర్చును. రోగి తత్వమునుబట్టి దినము ఒక ఇంజక్షను తగ్గినట్లు యిచ్చుచుండ వలయును.

నొప్పులయందే గుణము నిచ్చును. సమస్త శూల నొప్పుల యందు దీనిని వాడుకజేయ వచ్చును. శూలలను నివారించుటకుయిది బాగుగా తోడ్పడును. ఆవలింతలతో కూడుకొని వచ్చు శూల నొప్పులయందును యితరవిధముల శూలల యందు ఉపయోగకారి. నాల్గు అయిదుదినముల కొకతూరి ఇంజక్షన్ చేయవచ్చును.

## మెకురో అయోడుమ్.

## Micro Iodum. S. C.

1 CC, 2 CC అంపుల్సు లభించును. చర్మముక్రింద చేయు ఇంజక్షన్. ఇది శరీరమునందు అచ్చటచ్చట గాని గొంతు భాగమునందు గాని కంతు లేర్పడు వాటి పైనను, గండమాలలయందును గొప్ప గుణమునిచ్చును. అయిదు దినముల కొక ఇంజక్షన్ చేయవచ్చును.

## మిజ్ కో.

## Mezko. I. M. S. C.

చర్మముక్రిందను కండరములోను చేయు ఇంజక్షన్.

1CC, 2CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది కుష్ఠు వ్యాధులయందు నమ్మకముగా పనిజేయును. కుష్ఠును నివారించుటకు బాగుగా తోడ్పడుచుండును. బొల్లి శ్వేత కుష్ఠులయందును అన్నివిధముల కుష్ఠువ్యాధుల యందును దీనిని ఉపయోగించవచ్చును. చిన్నపిల్లలకు 1 CC చర్మము

క్రిందను పెద్దవారికి 2 CC కంఠరములోను వారమున కొకతూరి ఇంజక్షన్ చేయవచ్చును.

## మిన్కార్.

## Minkar. I. M. S. C.

కంఠరములోను చర్మముక్రిందను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది చర్మవ్యాధులయందు గుణమునిచ్చును. మూగగజ్జి, గజ్జిపుండ్లు కురుపులు వీటియందును, రక్తము శుద్ధిలేక కల్గు చర్మవ్యాధుల యందును, జీర్ణించిపోయిన చర్మవ్యాధుల యందును ఇది బాగుగా గుణమునిచ్చును. ముడ్డివద్ద పుండ్లుకలిగి చీము కారుట, పోటు బాధ నేర్పడుట మరియు మేహవికారముచే యేర్పడు వాటిపైనను ఇది బాధలునివారించి పుండు మాన్పుటకు గాను పనిజేయును. నొప్పి అధికముగా యున్నప్పుడు ప్రతిదినము ఇంజక్షన్ చేయవచ్చును. లేక రెండుదినముల కొకసారి చేయవచ్చును.

## మైర్మెక్స్.

## Myrmex. S. C.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. పీనసవ్యాధుల యందును, అధికముగా శరీరమున నొప్పులు గలవారల యందును, జీర్ణించిన మేహవాతపు నొప్పుల యందును,

వాతపు నొప్పులయందును యిది నమ్మకముగా పనిజేయు ఇంజక్షన్. ఆతురతజెంది అధికముగా ఇంజక్షనులు చేయరాదు. అట్లు జేసిన ప్రమాదమేర్పడక తప్పదు. గమనించి చేసిన మంచిది. ప్రతిదినము ఒక ఇంజక్షన్ చొప్పున వాడుక జేయవలయును. దీనిని లక్ష్మిన్ లేబొరేటరిస్ వారు తయారు చేయుచున్నారు.

## మిమాటిన్.

## Mematin. S. C.

## చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది ఏనుగు కాలు రోగమునందు (శ్లీపద వ్యాధియందు) గొప్పగుణకారి. శ్లీపదవ్యాధిని నివారించుటకు యిది సర్వవిధముల తోడ్పడును. శ్లీపదవ్యాధిచే గల్గు జ్వరములను క్రిములతో గల శ్లీపద వ్యాధులను నమ్మకముగా నివారించును. చాల కాలము చికిత్సజేయవలసియుండును. వారమురోజుల కొకతూరి ఇంజక్షన్ చేయవలెను. ఆతురతజెంది తొందరగా వ్యాధి తగ్గునేమో అని వెంట వెంట ఇంజక్షనులు యివ్వకూడదు. చాలకాలమువరకు ఇంజక్షనులు చేయుచుండిన ఏనుగుకాలు రోగమును నివారించుటకు ఉపయోగపడును. దీనిని లక్ష్మిన్ లేబొరేటరీస్ వారు తయారు చేయుచున్నారు.

## మికార్సిన్.

## Micarsin. S. C.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు గల సీసాలు లభించును. అజీర్ణ వ్యాధుల యందును, ఒగర్పులయందును, గుండెలో పోటు, శ్వాసలయందును యిది బాగుగా గుణమునిచ్చును. రెండు దినములకొకతూరి ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనిని లక్పిన్ లేబొరేటరిస్‌వారు తయారు చేయుచున్నారు.

## పైరోల్.

## Pyrol S. C.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. సూతికా వాత జ్వరముల యందును, లోజ్వరముల యందును, జీర్ణించిన జ్వరముల యందును, సన్నిపాత జ్వరములయందును, దీర్ఘ వ్యాపితమగు అతిసార విరేచనముల యందును యిది గొప్ప గుణమునిచ్చును. రెండుదినముల కొకసారి ఇంజక్షను చేయవచ్చును. దీనినికూడ లక్పిన్ లేబొరేటరిస్‌వారే తయారు చేయుచున్నారు.

## రైనాక్సిన్.

## Rynoxin I. M. S.C.

### కండరములోను చర్మముక్రిందను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది వ్రణ

ములు పుండ్లు కొరుకుపుండ్లు బాధతోకూడిన పుండ్లు విషము పుండ్లు మొదలగుపుండ్ల యందు గొప్పగుణకారిగా పని జేయును. రక్తస్రావమును తగ్గించుటకుగాను క్రిములను నశింపజేయుటకుగాను, మరియు మాంస గ్రంథులయందు కల్గు పుండ్లయందును, పుండ్లు కల్గినప్పుడు నొప్పులచే బాధ పడువారలయందును, కొరుకుపుండ్లు మాన్పుదల లేనప్పుడున్ను, కొరుకుపుండును మాన్పుటకున్ను, చర్మసంబంధమైన గజ్జియందును, రక్తముశుద్ధిలేక కల్గు చర్మవ్యాధుల యందును రక్తముశుద్ధి జేసి మరల చర్మవ్యాధులు రాకుండ కాపాడుటకు ఇది బాగుగా గుణమునిచ్చును. రెండు దినముల కొక తూరి ఇంజక్షన్ చేయవచ్చును. లక్ష్మీ లెబొరేటరీస్ వారు తయారు చేయుచున్నారు.

## స్ట్రామోజిన్.

## Stramogen. I. V.

### రక్తనాళములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది టైఫాయిడ్ అను సన్నిపాత జ్వరములయందు గొప్ప గుణకారి. సన్నిపాత జ్వరముయొక్క అన్ని లక్షణములయందు దీనిని ఉపయోగించ వచ్చును. వెర్రికుక్క కరచిన విషమునకున్ను యిది విరుగుడుగా పనిజేయును. దినముతప్పి దినము ఇంజక్షన్ చేయవచ్చును.

## సైకోన్.

## Sykon. I. M. S. C.

చర్మముక్రిందను కండరములోను చేయు ఇంజక్షను.

2 CC అంపుల్సు లభించుచుండును. మధుమేహ వ్యాధులయందును, మూగగజ్జి యందును యిది బాగుగా గుణమునిచ్చును. మధుమేహములను నివారించుటకుగాను దీనియందు మంచి శక్తిగలదు. వారమురోజులకొక ఇంజక్షన్ చేయవలయును.

## సైనెక్సు.

## Synex. I. V. S. C.

రక్తనాళములోను చర్మముక్రిందను చేయు ఇంజక్షను.

2 CC అంపుల్సు లభించుచుండును. శరీరమునందు గల రక్తశుద్ధిలేక కలుగుచుండెడి చర్మవ్యాధులు, పుండ్లు, వ్రణములు, కురుపులు, గజ్జి వీటియందును, చిరకాలము నుండి బాధించునట్టి పుండ్లయందును, మేహ వికారముచే కలుగు పుండ్లయందును, క్రిమిసంబంధమైన పుండ్లయందును, సవామేహముల యందును,. అడ్డకర్రలు బిళ్ళల యందును, అధిక ఉష్ణముచే కలుగు వ్యాధులయందును, కొరుకు పుండ్లయందును యిది బాగుగా గుణమునిచ్చును. వారమురోజుల కొక ఇంజక్షను చొప్పున చేయవచ్చును. దీనిని లక్ష్మిన్ లేబొరేటరిస్ కంపినీవారు తయారు చేయుచున్నారు.

## టా ర న్ టొ లి న్.

## Tarantulin. S. C.

## చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. కాళ్ళు చేతులు స్వాధీనమునందుండి కూడ గంతులువేయు వారలకున్ను, వ్రణములు పుండ్లు కురుపులయందును, రాచకురుపులు మాంసము కుళ్ళింప చేయుట లేక తినివేయునట్టి పుండ్ల యందును, యితరవిధముల విషముపుండ్ల యందును ఇది బాగుగా గుణము నిచ్చుచుండును. నాలుగు దినముల కొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును.

## థి రీ డి న్.

## Theridin S. C.

## చర్మముక్రింద చేయు ఇంజక్షన్

1 CC అంపుల్సు లభించుచుండును. ఎముకల యందు బలములేకయుండుబాలురకున్ను, మంత్రపుపొక్కుల యందును, పీనస వ్యాధులయందును, కొరుకు పుండ్ల యందును, శరీరము నందుగల గ్రంధులు లేక గళగండ మాలల యందును, క్రిములు గలపుండ్ల యందును, మేహ వికారములచే కలుగు బాధలయందును యిది మిక్కిలి అమోఘముగా గుణమునిచ్చును. ఆరుదినములకొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనిని లక్ష్మిన్ లేబొరేటరిస్ కంపినీవారే తయారు చేయుచున్నారు.

## థైవోజిన్.

Thio Gen I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. సెగవ్యాధుల యందును, సెగగడ్డలయందును, వ్రణములు, కురుపులు, గనేరియా క్రిములను సంహరించుట కున్ను, జీర్ణించిన వ్రణములు పుండ్లయందును, యితరవిధములగు పుండ్ల యందును యిది బాగుగా ఉపయోగపడుచుండును. రెండు దినముల కొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును.

## టుబర్కోలిన్.

Tuberculin. (G.B.B) S. C. I. M.

చర్మముక్రిందను కండరములోను చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. యిది రాజ యక్ష్మ అను క్షయ వ్యాధులయందు బాగుగా గుణము నిచ్చును. క్షయవ్యాధిని నివారించుటకుగాను దీనియందు మంచిశక్తి కలదు. కుష్ఠ వ్యాధులయందును మూగగజ్జి యందు కూడ పనిజేయగలదు. గమనించి ఇంజక్షన్ చేయ వలయును.

## టైఫోల్.

Tyfol S. C.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది సన్ని

పాత జ్వరములయందును గొప్పగుణకారి. సన్నిపాతజ్వర ములయందు కల్గు లక్షణములయందు దీనిని ఉపయోగించ వచ్చును. విషజ్వరములయందును, అధికజ్వరములయం దును, జీర్ణించిన జ్వరములయందును, త్రిగుబోతులకు కల్గు సంధి గుణముల యందును యిదిగొప్ప గుణకారి. ప్రతి దినము ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనిని లక్ష్మణ్ లెబొరేటరీ కంపినీవారు తయారు చేయుచున్నారు.

యుల్టరా మర్కు.

Ultra Merc. I. M.

కండరములో చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది సిపిలిస్ అను సవామేహములయందు పనిజేయుచుండును. కొరుకు పుండును నివారించుటకుగాను బాగుగా తోడ్పడును. నాల్గు దినముల కొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. పై కంపినీ వారే తయారు చేయుచున్నారు.

యు రో కా ఫి న్.

Uro Cafin. S. C.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది నంజు వ్యాధులయందు అనుభవ పూర్వకముగా గుణమునిచ్చును. నంజువ్యాధి లక్షణములయందు దీనిని తప్పకవాడి గుణము తెలుసుకో వచ్చును. నల్లమందు ఎక్కువగా తినుటచే కల్గు

దోషములకు విరుగుడుగా పనిజేయును. రొమ్మునొప్పుల యందు కూడ గుణమునిచ్చును. రొమ్మునొప్పులు నివారించి రొమ్ముకు బలము కలిగించును. అదుర్త అన్ని విధముల శరీర నొప్పులయందు కూడ దీనిని ఉపయోగించవచ్చును. నీరువాపులను తగ్గించివేయుటకు దీనిని ప్రయోగించుట మంచిది. నంజువ్యాధులకు ఇది రామబాణమువలె గుణమునిచ్చును. అవసరమునుబట్టి వాడుకజేయవలయును.

## వీర్లిన్.

## Verlin. S. C. I. M.

చర్మముక్రిందను కండరములోను చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. రక్తక్షీణతగల వ్యాధులయందును, పాండువ్యాధుల యందును, పుప్పుస వేష్టపు వాపులయందును, క్షయ వ్యాధులయందును, క్షయ వ్యాధులకు కలుగు అన్ని లక్షణములయందును, పాండు వ్యాధిని నివారించి మరల రాకుండ కాపాడుటకును యీ ఇంజక్షను వారమునకు ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును.

## విర్లిన్ పుర్పల్.

## Verlin Purple. I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది క్షయ వ్యాధికి మాత్రమె ముఖ్యముగా తయారు చేయబడిన ఔష

ధము. క్షయవ్యాధిచే గలుగు జ్వరము, దగ్గులయందును యిది బాగుగా గుణము నిచ్చును. అవసరమునుబట్టి ఇంజక్షన్ చేయవలయును.

విపార్ వినూమ్బి.

Vipervenomb. S. C.

చర్మముక్రింద జేయు ఇంజక్షన్

2 CC ఆంపుల్సు లభించుచుండును. సెగ గడ్డలకును, ప్రిణములకును, పుండ్లకును, రుద్రవాతమునకును, ఎముకలు బలహీనముగా గలచిన్నపిల్లలకును, రొమ్ము నొప్పులకును, మూర్ఛవ్యాధులకును, రక్తస్రావములకును, ఈ ఇంజక్షను బాగుగా గుణమిచ్చును. వారములో ఒక ఇంజక్షన్ మాత్రమే చేయవలెను.

విటోన్

Viton I. M.

కండరములో చేయు ఇంజక్షన్

2 CC ఆంపుల్సు లభించును. బాధించునట్టి మలేరియా వ్యాధులకు. సర్వ జ్వరములకు, రక్తవాంతులకు, మూత్రములో రక్తము వెడలు నందులకు, యితర విధములచే గల్గు వాంతులకును, స్ప్లిన్ లీవర్ వ్యాధులకును, యిది గొప్పగుణకారి. అతిసార విరేచనముల యందు కూడ గొప్పగుణకారి. అయిదు దినముల కొక ఇంజక్షన్ చేయవచ్చును. లక్ష్మిన్ లెబొరేటరీస్ కంపినీవారిచే తయారు చేయబడుచున్నది.

## ఎక్సురో కార్బాన్.

## Xero Carbon- S. C. I. M. I. V.

చర్మముక్రిందను కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. పాండువ్యాధుల యందును, సన్నిపాత జ్వరములయందును, సూతికా జ్వరముల యందును, రక్తస్రావముల యందును, అజీర్ణవ్యాధులయందును, కడుపులోని మంటలయందును, క్షయవ్యాధి యందు రాత్రి చెమటలు వచ్చువాటిపైనను చర్ది క్షీణగతి లేక వాతప్రకోపముల యందును యిది గొప్ప గుణకారి. మూడు నాలుగు దినముల కొకతూరి ఇంజక్షన్ చేయవచ్చును. లక్ష్మిన్ లేబొరేటరిస్ ఇండియావారు తయారు చేయుచున్నారు.

## బారాఫోల్.

## Barafol. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు 10 CC విల్సు లభించుచుండును. ఇయ్యది రక్తక్షీణత వల్ల గలుగు పాండువ్యాధుల యందును వ్యాధిజీర్ణించి బాధలుకలిగించెడి జ్వరములయందును, శరీరమునందు రక్తములేక శరీరమంతయు శ్వేతవర్ణముగా మారిపోవు దానియందును, రక్తములేక నీరువాపులు యేర్పడు వాటియందును, శరీరమునందు నొప్పులు బలహీనము గలవారలకు తిరిగి బలము కలిగించుటకున్ను,

రక్తము వృద్ధి గావించుటకున్ను, వ్యాధులచే బాధపడి తగ్గిన తర్వాత రక్తమును వృద్ధిపరచి జీర్ణశక్తిని గలిగించుటకున్ను పాండువ్యాధులను నివారించి తిరిగి రాకుండ జేయుటకున్ను యిందు గొప్ప గుణముకలదు. 1 CC నుండి 3 CC వరకు దినముతప్పి దినము వాడుక జేయవలసి యుండును. దీనిని ఆంగ్లోపేర్షియంచి డ్రగ్ కంపెనీ లిమిటెడ్ బొంబాయివారు తయారు చేయుచున్నారు.

బిప్లక్సు.

Berplex I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది తిమురు వాతములయందు మిక్కిలి అమోఘముగా గుణమునిచ్చును. తిమురువాతములను నివారించుటే గాక మరల రాకుండ కాపాడుతుంది. జీర్ణశక్తిలేక బాధపడువారలగు క్రిమేణ జీర్ణశక్తి నిచ్చి ఆకలి పుట్టించి ఆరోగ్యవంతులుగా జేయుటకు ఇది మిక్కిలి ప్రయోజనకారి. శరీరమునందు రక్తము లేక యేర్పడు నంజు వాపులను నివారించి రక్తమును వృద్ధిజేయును. శరీరమునందు బలహీనముచే యేర్పడు నొప్పుల నిర్మూలము గావించును. నరముల నొప్పుల యందును అన్నివిధముల వాతపు నొప్పులయందును పని జేయును. ప్రతిదినము ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని ఆంగ్లోపేర్షియంచి డ్రగ్ కంపినీవారు తయారుచేయుచున్నారు.

## బిప్లక్సు ఫోర్టు.

## Beplex Forte. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు 10 CC విల్సు లభించుచుండును. పాండు వ్యాధులయందు మిక్కిలి గుణమునిచ్చి వ్యాధిని తప్పక నివారింపజేయును. లీవర్ వ్యాధులయందు కూడ యిది బాగుగా గుణమునిచ్చును. జీర్ణశక్తి పుట్టించి అజీర్ణమును నివారింపజేయును. బలహీనముగా యున్నప్పుడు దీనిని వాడి తిరిగి బలము పొందవచ్చును. వాంతుల యందును, పుల్లని త్రేపులయందు కూడ యిది మంచి గుణమునిచ్చును. యే దశలలోనున్న పాండు వ్యాధియందైనను దీనిని తప్పక వాడుక జేయవచ్చును. రక్తము లెనప్పుడు కలుగు లక్షణముల యందును, నీరు వాపులయందును, శరీరము తెలుపుబారి నప్పుడున్ను, లీవర్ వ్యాధులచే బాధపడు చిన్నవారలకున్ను యిది వాడిన మంచి గుణము నిచ్చును. రక్తవృద్ధికిగాను బాగుగా గుణమునిచ్చును. వారములో రెండుసార్లు ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని కూడ A. F. D. వారు తయారు చేయుచున్నారు.

## గార్డియన్.

## Gardeon. S. C.

చర్మముక్రింద జేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. ఈ ఇంజక్షను

గుండెపోటు వ్యాధులయందు నమ్మకముగా గుణము నిచ్చును. గుండెపోటును తగ్గించి మరలరాకుండ కాపాడును. గుండెకు బలము కలిగించుటలో యిది మిక్కిలి పేరుపొందినది. అవసరమునుబట్టి వాడుకజేయవలయును. A. F. D, వారు తయారు చేయుచున్నారు.

నో ఫై ల్లి న్.

Neophyllin. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. యిదికూడ గుండె పోటు వ్యాధులయందు పనిజేయును. రొమ్ము పడిసెము రాచకురుపులు, శ్వాసలయందును నమ్మకముగా గుణమునిచ్చును. అవసరమునుబట్టి వాడవలసియుండును. దీనిని కూడ A. F. D. వారు తయారు చేయుచున్నారు.

అ మి నో ఫా ర మ్.

Amino Form I. V.

రక్తనాళములో చేయు ఇంజక్షన్.

10 CC అంపుల్సు లభించుచుండును. ఇది రొమ్ము పడిసెము గుండెదడ గుండెనొప్పి శ్వాస అజీర్తిని నివారించి గుండెకు బలము కలిగించును. గుండె వ్యాధుల యందు యిది బాగుగా గుణమునిచ్చును. రెండు దినముల కొకతూరి ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. కాట్టినెంటల్ డ్రిగ్‌వారు తయారు చేయుచున్నారు.

## బి వి మి న్.

## Bvimin. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. తిమురువాయువులయందును, శుద్ధనాళములయొక్క వాపుదలలయందును వాంతులయందును అతిసార విరేచనముల యందును ఈ ఇంజక్షనును ప్రయోగించినచో బాగుగా గుణము నిచ్చుచుండును. పై కంపినీవారే తయారు చేయుచున్నారు.

## కొ లో కా ల్.

## Colo Kal. S. C. I. M.

చర్మముక్రిందను కండరములోను చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు లభించుచుండును. నిస్సత్తువల యందును, నరములబలహీనతల యందును, ఋతుస్రావముల యందును, పండ్లు వచ్చేటప్పుడు కల్గు బలహీనముల యందును, ఎముకల బలహీనముల యందును. చిన్నపిల్లల అన్ని విధముల బలహీనముల యందును, ధనుర్వాతముల యందును, యిది బాగుగా గుణము నిచ్చుచుండును. దినం తప్పి దినం ఒక ఇంజక్షన్ యివ్వవచ్చును. పై కంపినీవారే తయారు చేయుచున్నారు.

## కొలో కాల్ ఫోర్టు

## Colokal Forte. S. C. I. M.

కండరములోను చర్మముక్రిందను చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు లభించుచుండును. ఇదికూడ ధనుర్వాతములయందును, నిస్సత్తువలయందును, ఎముకలకు బలము కలిగించుటకున్ను, నరముల బలహీనముల యందును, పైదాలివలెనే వాడుకజేయవలయును. పై కంపినీ వారే తయారు చేయుచున్నారు.

కో ర్ పో లు టి న్.

Corpolutin. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. ఇది స్త్రీలకు సంభవించెడి రక్తస్రావముల యందును, ఋతుశూలల యందును, ఋతుస్రావముల యందును గొప్ప గుణము నిచ్చును. దీనిని పైకంపినీవారే తయారు చేయుచున్నారు.

డో యి రి నా.

Diurina. I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. గుండెవ్యాధుల యందు యిది మిక్కిలి అనుభవ పూర్వకముగా గుణము నిచ్చును. గుండెనొప్పికిన్ని గుండె బలహీనములకున్ను, రొమ్ముపడిసెముల యందును, శ్వాస వ్యాధులయందును ఒగర్పు అతిస్థూలతల యందు అనుభవమైన ఇంజక్షన్ దినముతప్పి దినము ఒక ఇంజక్షన్ చేయవచ్చును. పై కంపెనీవారే మాత్రము తయారుచేయుచున్నారు.

## హమొరాల్.

### Hemoral- S. C. I- M.

కండరములోను చర్మముక్రిందను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది పాండు వ్యాధులయందు బాగుగా గుణము నిచ్చును. రక్తక్షీణత గలవారికి, రక్తవృద్ధి కలిగించుటకున్ను, నరముల వ్యాధుల యందును, నరముల నొప్పులయందును, నిద్రలేని వారల యందును ఇది బాగుగా గుణము నిచ్చును. దినం తప్పి దినం ఇంజక్షన్ చేయవచ్చును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## హపోరాల్ ఫోర్టు.

### Heporral Forte, I. M.

కండరములో చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది రక్తక్షీణతలయందును, పాండువ్యాధుల యందును, మిక్కిలి గుణము నిచ్చును. పాండువ్యాధి అన్నిలక్షణముల యందును యిది బాగుగా గుణమునిచ్చి వ్యాధిని మరల రాకుండ జేయును. దినం తప్పి దినం ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## అపోరల్ కోమ్ విటమిన్ సి, యిట్. బికాంపులక్సు.

### Heporal Cum Vitamin. C Et. B Complex I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. పాండు వ్యాధులను నివారించుటకుగాను దీనియందు మంచి శక్తికలదు. అన్నివిధముల రక్తక్షీణతగల పాండువ్యాధిని నివారించును. శరీరమునందు రక్తములేక యేర్పడుచుండెడి వ్యాధుల యందును. నీరువాపులయందును, శరీరమునందు అన్ని చోట్లలో నొప్పులు, తిమురువాతముల యందును, బలహీనతల యందును, నరములపట్టు లేక యుండువారలకును దీనిని ఉపయోగించిన నరములకు చురుకుదనమును బలమును కలిగించును. రక్తము లేక శరీరమంతయు తెలుపు బారిన వారలయందు కూడ యిది మంచిగుణము నిచ్చును. వ్యాధులు తగ్గినతర్వాత దీనిని సేవించి ఆరోగ్యవంతులు గావచ్చును. జీర్ణశక్తి పుట్టించి నిస్సత్తువలను నివారించుటకుగాను, మూర్ఛవ్యాధుల యందుకూడ యిది బాగుగా గుణమునిచ్చును. దినముతప్పి దినము ఒక ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని కాంటినెంటల్ డ్రిగ్ కంపెనీ బొంబాయివారు తయారు చేయుచున్నారు.

## మిటిజిన్.

## Matizin. I. V. I. M.

రక్తనాళములోను కండరములోను చేయు ఇంజక్షన్

5 CC అంపుల్సు లభించుచుండును. ఇది మేహవాతముచే సంభవించు అన్నిరుగ్మతల యందును బాగుగా గుణమునిచ్చుచున్నది. కండరములలోని నొప్పుల యందు

కూడ ఉపయోగపడుచుండును. ఇతర విధముల వాతరోగ ములయందు ఇది అనుభవ పూర్వకముగా పనిజేయును. కీళ్ళ నొప్పుల బాధలు నివారించుటకున్ను, నడుమునొప్పుల యందును, నరములకు బలముకల్గించుటకున్ను, నరముల నొప్పులు నివారించుటకున్ను, వాతముచే కల్గు నొప్పులకు, యిది రామబాణము వలె గుణము నిచ్చును. వాతమును హరించివేయును. రెండు మూడు దినములకొక తూరి ఇంజక్షన్ చేయ వచ్చును. కాట్టినెంటల్ వారే తయారు చేయుచున్నారు.

## మెన్‌స్ట్రోనా.

## Menstrona. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC మరియు 5 CC విల్స్ లభించు చుండును. స్త్రీలయొక్క గర్భకోశమునకు సంబంధించిన వ్యాధులలో ముఖ్యంగా శూల, ఋతుశూల. ఈ ఋతుశూలను తగ్గించు టకుగాను దీనియందు మంచి శక్తికలదు. వారము దినము లలో మూడు ఇంజక్షనులు చేయవచ్చును. ముట్టుశూల మరల రాకుండ పోవును. కాంటినెంటల్ వారే తయారు చేయుదురు.

## న్యూ అ హో రా ల్.

## Neo Heporal· I· M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. ఇది అన్నివిధముల పాండువ్యాధుల యందు నమ్మకముగా గుణము నిచ్చును. రక్తవృద్ధి కలిగించి పాండును నివారించుటకు గాను బాగుగా తోడ్పడు చుండును. నోటియందు కలుగు వ్యాధులయందు కూడ గుణము నిచ్చును. దినము తప్పి దినము ఒక ఇంజక్షన్ చొప్పున వాడవచ్చును. పైకంపినీ వారే తయారు చేయుచున్నారు.

## టెస్టో ప్రోపెన్.

## Testo Propan. I. M.

## కండరములో చేయు ఇంజక్షన్

1 CC అంపుల్సు లభించుచుండును. ఇది ఎదురు గుండెనొప్పులయందు బాగుగా గుణము నిచ్చును. గుండెకు బలము చురుకు దనము కలిగించి గుండె వ్యాధులను నివారించుటకు గాను యిది బాగుగా తోడ్పడు చుండును. అవసరము బట్టి వాడుకజేయ వలసియుండును.

## టినేక్సల్.

## Tinoxyyl. I. M.

## కండరములో చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది గనేరియా వ్యాధియందును క్రిమి అంటు జాడ్యముల యందును సెగ గడ్డలు, పుండ్లు, కురుపులు, మూగగజ్జి, కొరుకు వీటిపైన

బాగుగా గుణమునిచ్చును. గనేరియా వ్యాధిని నివారించి మరల రాకుండ జేయుటకు దీనియందు మంచి శక్తికలదు. దినం తప్పి దినం ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని కాంటి నెంటల్ వారే తయారు చేయుచున్నారు,

యురాక్సల్

Uroxyl. I. M.

కండరములో చేయు ఇంజక్షన్

5 CC అంపుల్సు లభించుచుండును. మేహవాతపు నొప్పుల యందు యిది బాగుగా గుణము నిచ్చుచుండును. మేహవాతముచే బాధపడువారలకు బాధలు నివారించుట కున్ను, వాతరోగముల నొప్పులకున్ను, నడుమునొప్పుల కున్ను యిది ఉపయోగపడుచుండును. ప్రతిదినం ఇంజక్షన్ చేయవచ్చును. కాంటినెంటల్ వారు తయారు చేయు చున్నారు.

విటలైన్ బి. సి.

Vitalyn.(B.C.) I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. నరముల బల హీనతల యందును, రక్తనాళము వాపుదల యందును, శరీరతూకము తగ్గిపోయిన వారలకున్ను, శరీరములో రక్తము లేనివారలకున్ను, బలము జీర్ణశక్తి పుట్టించి, పాండువ్యాధులను నివారించుటకు గాను, నొప్పులను తగ్గిం

చుటకుగాను యిది బాగుగా తోడ్పడును. దినంతప్పి దినం చేయవచ్చును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## సిబాల్జిన్.

## Cibalgin. I. V.

### రక్తనాళములో చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు లభించుచుండును. శరీరమునందు గల అన్ని విధముల నొప్పులయందు దీనిని ఉపయోగించ వచ్చును. తలనొప్పులయందును, పండ్లనొప్పులయందును, చెవిపోటులయందును, నరముల నొప్పులయందును, కటి ప్రదేశ నరముల పోటుయందును, ముట్టుశూలను తగ్గించు టకుగాను ఆపరేషన్ చేసినతర్వాత కల్గు బాధలు నొప్పులు నివారించుటకున్ను, కీళ్ళనొప్పులు, వాతపునొప్పుల యందును ఇది రామబాణమువంటి గుణమునిచ్చును. శరీరము నందు గల అన్నివిధముల నొప్పులు బాధలు తగ్గించి వేయు టకుగాను యిది బాగుగా పనిజేయును. కండరములోనికి కూడ ఉపయోగించిన యేమి ప్రమాదముకాదు. నిర్భయంగా ఇంజక్షన్ చేయవచ్చును. అతి ప్రమాదకరమైన నొప్పులు కలిగినప్పుడు దీనిని వెంటనే ఉపయోగించిన మేలు కలిగించును. అవసరము ననుసరించి ఇంజక్షన్ చేయవచ్చును. సిబా కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## కోగూలిన్.

## Coagulen. I. M. I. V.

### కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

5 CC అంపుల్సు లభించును. ఇయ్యది రక్తస్రావములయందును, ఋతుస్రావములయందును రామబాణమువలె పనిజేయును. చిరకాలమునుండి తగ్గక బాధించునట్టి రక్తస్రావములకు యిది బాగుగా ఉపయోగపడును. అతిమూత్రము, మూత్రములో రక్తము పడువారలకును, సూతికా వ్యాధిచే కలుగు రక్తస్రావములకున్ను, ముక్కుబెదిరి కారుచుండెడి రక్తస్రావములకున్ను యిది నమ్మకముగా గుణము నిచ్చును. ఋతుస్రావము అధికముగా వెడలునప్పుడు తగ్గించివేయుటకున్ను యిది బాగుగా పనిజేయును. చాలకాలమునుండి కలుగు చుండెడి రక్తస్రావములకు దీనిని చాల దినములవరకు వాడుచుండిన పూర్తి వ్యాధి నివారించును. అధిక రక్తస్రావములయందు ప్రతిదినము ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనిని సిబా కంపినీవారు తయారు చేయుచున్నారు.

## డిజిఫోలిన్.

## Digifoline. I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు గల సీసాలు లభించుచుండును. గర్భవతులుగా నుండునప్పుడు కల్లు నంజు శరీరమంతయు

వాపునీరు కలిగియుండు గర్భవతులయందు యిది నమ్మక ముగా గుణము నిచ్చును. ఇతరవిధముల నంజు వ్యాధుల యందుకూడ దీనిని ఉపయోగించ వచ్చును. న్యూమోనియా అను శ్లేష్మవాత జ్వరములయందు కలుగు ఆయాసము రొమ్మునొప్పి మరియు ఇతర విధముల నొప్పులకున్ను యిది బాగుగా నుపయోగపడును. గుండె బలహీనముగా నున్నవారలకు తిరిగి గుండెకు బలము కలిగించుటకున్ను యిది బాగుగా గుణమునిచ్చును. మేహవాతముచే కలుగు అన్నివిధముల నొప్పులయందును బాధలు తగ్గుటకున్ను దీనిని ఉపయోగించ వచ్చును. గర్భిణిస్త్రీలకు యిది వాడుక జేసిన యేమాత్రము ప్రమాదము కాజాలదు. నిర్భయంగా వాడవచ్చును. ప్రతిదినము ఒక ఇంజక్షను చొప్పున వాడ వచ్చును. దీనిని కూడ సిబాకంపినీవారే తయారు చేయు చున్నారు.

## యిస్టోడ్రోన్.

## Esidrone. I. M. I. V.

రక్తనాళములోను కండరములోను చేయు ఇంజక్షను

2 CC అంపుల్సు లభించుచుండును. గుండె బల హీనముగా యుండువారలకున్ను, గుండె వ్యాధులను నివా రించుటకున్ను, గుండెకు బలము చురుకుదనము కలిగించు టకున్ను యిది బాగుగా గుణము నిచ్చును. కొరుకు అను సిఫిలిస్ వ్యాధియందు కల్గు పుండ్లు, కురుపులు మేహసంబం

ధపు పుండ్లయందును యిది గుణము నిచ్చును. గర్భవతు
లకు కలునంజు లేక నీరువాపుల యందుకూడ నీరువాపులు
తగ్గించి వేయుటకున్ను దీనిని ఉపయోగించవచ్చును. లీవర్
స్లీప్లను. వ్యాధులయందును, గురుదలనొప్పుల యందును,
గురుదల బలహీనమునందును, పాండువ్యాధుల యందును,
యిది రామబాణమువలె గుణము నిచ్చుచుండును. వార
ములో రెండుమూడు సార్లు ఇంజక్షన్ చేయవచ్చును. సిబా
కంపినీవారే తయారు చేయుచున్నారు.

## పర్ కోర్ టిన్.

## Percorten. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

అన్నివిధముల సీసీలు దొరకును. వాతపునొప్పుల
యందు యిది బాగుగా గుణమునిచ్చును. మేహవాతము
నకు సంబంధించిన అన్ని నొప్పులయందును యిది ఉప
యోగ పడుచుండును. అదు_ర్త బలహీనముల యందు
కూడ దీనిని వాడవలయును. బలహీనము నివారించి బలము
కలిగించుటకు మిక్కిలి ఉపయోగకారి. వారమున రెండు
సార్లు చేయవచ్చును.

## పారిస్ కోల్.

## Pris Col. I. M. I. V. S. C.

కండరములోను చర్మము క్రిందను రక్తనాళములోను
చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. పీనస, పక్ష వాతము, అన్నివిధముల వాతవ్యాధుల యందును యిది బాగుగా గుణమునిచ్చును. దినం రెండుసార్లు ఇంజక్షన్ చేయవచ్చును. సిబా కంపినీ స్విడ్జర్లాండువారు తయారు చేసి మన కందించుచున్నారు.

రెసైల్.

Resyl. I.M.

కండరములో చేయు ఇంజక్షన్

2 CC, 3 CC అంపుల్సు లభించుచుండును. ఇది క్షయవ్యాధులయందు గొప్పగుణకారి. క్షయవ్యాధులయందు కల్గు దగ్గులయందును, రొమ్ముపడిసెముల యందును, న్యూమోనియాల యందు కల్గు రొమ్ముపడిసెము, రొమ్ము నొప్పులయందును, యితర వ్యాధులయందు కల్గు కాసల యందును, కోరింత దగ్గుల యందును, యిది బాగుగా గుణము నిచ్చును. ప్రతిదినం ఒక ఇంజక్షన్ చేయవచ్చును.

సిస్టో మెన్సిన్.

Sistomensin. I. M.

కండరములో చేయు ఇంజక్షన్

1 CC అంపుల్సు లభించుచుండును. రక్తస్రావ ముల యందును, ఋతుస్రావముల యందును, గర్భాశయ వ్యాధుల యందును యిది నమ్మకముగా గుణమునిచ్చును. ప్రతి దినము ఒకసారి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని సిబాకంపెనీ వారు తయారు చేయుచున్నారు.

## స్ట్రాసినైటిన్.

## Trasentin. S. C. I. M.

చర్మముక్రిందను కండరములోను చేయు ఇంజక్షన్

7 CC అంపుల్సు లభించుచుండును. ఇది శూలల యందు, ఋతు శూలలయందు నమ్మకముగా గుణము నిచ్చును. పుండ్లు, కురుపులు, వీటియందుకూడ బాగుగా ఉపయోగపడును ప్రతిదిన మొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. సిబాకంపినీవారు తయారు చేయుచున్నారు.

## ఆర్సోక్విన్.

## Arsoquin. I. M.

కండరములో చేయు ఇంజక్షన్

1 CC, 2 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది జీర్ణించి పోయి మాటిమాటికి వచ్చె చలిజ్వరముల యందు బాగుగా గుణమునిచ్చును. చలిజ్వరములు రాకుండ జేయుటకు దీనియందు మంచి శక్తికలదు. విషపడిసెముల యందు కూడ బాగుగా గుణమునిచ్చును. ఛర్దులయందుకూడ పని జేయును. రెండుదినముల కొకసారి ఇంజక్షన్ చేయ వచ్చును. సనిటేక్సు కేమికల్ బరోడా వారు తయారు చేయుచున్నారు.

## బికోక్సు.

## Becox. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2CC అంపుల్సు లభించుచుండును. తిమురువాతముల

యందును, నోటియందు కలుగు వ్యాధులయందును నరముల బాధలయందును యితరవిధముల వాతపు నొప్పుల యందును, చిన్నబిడ్డ గుణముల యందును, ఋతుస్రావముల యందును, శరీరమునందు రక్తము లేనివారలకు రక్తవృద్ధి జేయుటకున్ను యిది మిక్కిలి నమ్మకముగా గుణమునిచ్చును. రెండుదినముల కొకతూరి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని సనిటేక్సు కేమికల్‌వారు తయారు చేయుచున్నారు.

ఫోలికోబిన్.

Folicobin. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. యిది పాండు వ్యాధుల యందును, నోటివ్యాధులయందును యితర విధముల రక్తక్షీణతలు గలవారలకున్ను రక్తవృద్ధి జేయుటకున్ను పాండును నివారించుటకున్ను బాగుగా గుణము నిచ్చును. రెండుదినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. పైకంపెనీవారే తయారు చేయుచున్నారు.

హెపాటిస్

Hepatis. I. M.

కండరములో చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది కూడ పాండువ్యాధి యందు బాగుగా గుణము నిచ్చుచుండును.

పాండు వ్యాధియొక్క అన్ని తరగతుల యందుకూడ దీనిని వాడుక జేసిన వ్యాధిని నివారించి రక్తవృద్ధి కలిగించును. నోటివ్యాధుల యందు కూడ బాగుగా గుణము నిచ్చును. లీవర్ వ్యాధులయందును, వాతపునొప్పుల యందును శూల నొప్పుల యందును గుణమునిచ్చును. దినం ఒకసారి ఇంజక్షన్ చేయవచ్చును. పై కంపెనీవారే తయారు చేయు చున్నారు.

## పల్మోక్విన్.

## Pulmoquin. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC, 2 CC అంపుల్సు లభించుచుండును. రొమ్ము పడిసెముల యందును న్యుమోనియా, అను శ్లేష్మ వాత జ్వరములయందును ఇది బాగుగా గుణమునిచ్చుచుండును. ప్రతిదినం ఒక ఇంజక్షన్ వాడవచ్చును. దీనిని సనిటేక్సు కెమికల్ బరోడావారు తయారు చేయుచున్నారు.

## విటమిన్ కె.

## Vitamin k. S. C. I. M.

చర్మముక్రిందను కండరములోను చేయు ఇంజక్షన్

1 CC అంపుల్సు లభించుచుండును యకృత్ ప్లీహ లీవర్ వ్యాధులయందును. కామిలలయందును, పచ్చ తెలుపు కామిల వ్యాధులయందును, ఋతుస్రావములను, అరికట్టుటకున్ను, ఆమ్లపిత్తముల యందును, ఇది మిక్కిలి

ఉపయోగకారి. రెండు దినముల కొకసారి ఇంజక్షన్ చేయ వచ్చును. దీనిని కూడ సనిటేక్సు బరోడా వారు తయారు చేయుచున్నారు.

## నివాక్విన్.

## Nivaquine. I. V. I. M.

రక్తనాళములోను కండరములోను చేయు ఇంజక్షన్.

5 CC అంపుల్సు లభించుచుండును. ఈ ఇంజక్షన్ చలిజ్వరముల యందు రామబాణమువలె గుణము నిచ్చును. జీర్ణించి పోయి మాటి మాటికి తిరిగివచ్చు చలిజ్వరముల యందును దినం తప్పి దినం వచ్చుచలిజ్వరముల యందును, యిది నమ్మకముగా గుణమునిచ్చును. ఆరు ఇంజక్షనుల వరకు పూర్తికోర్సు అవును. దీనిని మే & బేకర్ వారు తయారు చేయుచున్నారు.

## టిబిజైడ్.

## Tibizide. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. యిది క్షయ వ్యాధులయందు మాత్రము ముఖ్యముగా గుణమునిచ్చును. క్షయ కాసలయందును, బాధగల కాసలయందును యిది నమ్మకముగా గుణము నిచ్చుచుండును. క్షయ అన్ని లక్ష ణములయందు యిది గుణము నిచ్చుచుండును. ప్రతి క్షయ వ్యాధిగల వారలు దీనిపై ఆధారపడ వచ్చును. క్షయను

నివారించి మరల రాకుండ కాపాడగలదు. దీనిని అల్బర్టు డేవిడ్ లిమిటెడ్ కలకత్తావారు తయారు చేయుచున్నారు.

## నికోలాన్.

## Nicolan. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 CC, 5 CC అంపుల్సు లభించు చుండును. యిది గనేరియా అను అంటువ్యాధులయందు బాగుగా గుణము నిచ్చుచుండును. గనేరియా పుండ్లయందును సెగలు పచ్చ తెల్లదబ్బా అడ్డకర్రిలయందును యిది బాగుగా గుణము నిచ్చును. పుండ్లు కురుపులయందు కూడ దీనిని వాడుక జేసిన గుణము నిచ్చును. జ్వరములయందు కూడ గుణము నిచ్చును. దీనిని కలకత్తా క్లీనికల్ రిచర్స్ అసోసియేషన్ వారు తయారు చేయుచున్నారు.

## బిక్రా.

## Becra I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది నరముల నొప్పులయందును, నరముల బలహీనముల యందును, తిమురు వాతముల యందును, బలహీనతల యందును, యితర అన్నివిధముల బలహీనములందు గొప్ప గుణకారి. పై కంపినీవారే తయారు చేయుచున్నారు.

## సి స్ రా.

## Cecra. I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 CC & 5 CC అంపుల్సు లభించుచుండును. రక్తస్రావముల యందును, ఋతుదోషముల యందును, ఆమ్లపిత్తము, అజీర్ణముల యందును, మూగగజ్జి, జీర్ణకోశమునందు గల పుండు వ్రణమును మాన్పి జీర్ణశక్తి పుట్టించుటకున్ను, బలహీనముల యందును, జ్వరములయందును, యితరవిధముల రక్తక్షీణతల యందును బాగుగా గుణము నిచ్చును. పైకంపినీవారే తయారు చేయుచున్నారు.

## అ ను ర క్సి న్.

## Anuroxin, I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. శుద్ధ రక్తనాశము యొక్క వాపుదలల యందును, నరముల పోటు యందును, నరముల బలహీనముల యందును, పాండు వ్యాధులయందును, క్షీణగతిగల పాండువ్యాధులయందును రక్తమును వృద్ధిజేసి పాండువ్యాధిని నివారించుటకున్ను, పక్షవాతముల యందును, పక్షవాతముయొక్క అన్ని లక్షణములను బాధలను నివారించుటకున్ను, మూర్ఛవ్యాధుల యందును, నిస్సత్తువల యందును, శరీరపుతూకము తగ్గిపోయిన వారలయందును యిది బాగుగా గుణము నిచ్చు

చుండును. దీనిని ఓరియంటల్ ఫార్మ స్యూటికల్ వర్క్సు ఇండస్ట్రీట్ లిమిటెడ్ బొంబాయివారు తయారు చేయుచున్నారు.

## వి బి లీ న్.

## Vibelan. I. M.

### కండరములో చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు లభించుచుండును. శరీరమునందు పట్టుదల లేనివారలయందును, నిస్సత్తువలయందును, నరములకు బలముకలిగించి పాండు వ్యాధిని నివారించుటకున్ను, జీర్ణశక్తిని కలిగించుటకున్ను, రక్తవృద్ధికిన్ని, తిమురు వాతములను నివారించుటకున్ను, వ్యాధులువచ్చిన తర్వాత కల్గు బలహీనముల యందును, ఆరోగ్య వంతులుగా జేయుటకున్ను, నొప్పులను నివారించుటకున్ను యిది బాగుగా ఉపయోగపడుచుండును. రెండు మూడు దినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని బ్రిటిష్ డ్రగ్ హౌసు లిమిటెడ్ లండన్‌వారు తయారు చేయుచున్నారు.

## లీ వా డె క్సు.

## Livadex. I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించు చుండును. పాండువ్యాధులయందు ఇది బాగుగా తోడ్పడుచుండును. పాండువ్యాధి గలవారికి రక్తవృద్ధి కలిగించుటయే గాక జ్వరము నీరసము

బలహీనము నివారించును. వాతపు నొప్పుల యరికట్టును. మలేరియా సన్నిపాత జ్వరము వచ్చిన తర్వాత శరీరము నందు రక్తము లేనివారలకున్ను యిది టానికు మాదిరిగా ఉపయోగపడుచుండును. రెండు దినముల కొకతూరి ఇంజక్షన్ చేయవచ్చును. B. D. H. వారు తయారు చేయుచున్నారు.

## అనామిన్.

## Anahaemin, I. M.

## కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది శరీరము నందు రక్తమునుపుట్టించుటకుగాను బాగుగాగుణమునిచ్చుచుండును. శరీరమునందు రక్తము లేనివారల యందు కల్గు అన్ని లక్షణముల యందు కూడ యిది బాగుగా గుణమునిచ్చును. ముఖ్యముగా పాండు వ్యాధిని నివారింపజేసి, మరల వ్యాధిని రాకుండ జేయు శక్తి దీనియందు కలదు. రక్తము లేక శ్వాస పొడి ఉబ్బసము లయందును. శరీరమంతయు శ్వేతవర్ణముగా మారినప్పుడున్ను, రక్తము లేని అన్ని జబ్బులకున్ను యిది రామబాణమువలె గుణము నిచ్చుచుండును. జీర్ణశక్తి పుట్టించుటకున్ను వ్యాధులువచ్చిపోయిన తర్వాత కలుగు నీరసము, బలహీనము, రక్తక్షీణము వీటి యందుకూడ. గుణము బాగుగా నిచ్చును. రెండు దినముల కొకటి గాని మూడుదినముల కొకటి గాని ఇంజ

క్షన్ చేయవచ్చును. B. D. H. వారు తయారు చేయు చున్నారు.

## థైహడైక్సిన్.

Thiadoxine. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

10 CC వీల్సు లభించుచుండును. ఇది తిమురు వాతముల యందును, వాతపు నొప్పులయందును, యితరవాతముచే కలుగు వాపులయందును బాగుగా గుణము నిచ్చుచుండును. నరములయొక్క బలహీనతలయందు నరములకు బలమునిచ్చుటకున్ను, చిన్నపిల్లలకు కలుగు తిమురు వాతముల యందును, నరముల నొప్పులయందును, తల నొప్పులయందును, పక్షవాతములయందును, పక్షవాతము యొక్క అన్నిలక్షణముల యందేగాక, నొప్పుల బాధలు నివారించుటకున్ను, కండరములయొక్క నొప్పులయందును శరీరమునందు గల అన్నినొప్పుల యందును యిది నమ్మకముగా గుణమునిచ్చును. చిన్నపిల్లల వాతవ్యాధుల యందుకూడ అనుభవ పూర్వకముగా గుణమునిచ్చును. నరముల జబ్బులు అన్నివిధముల వాటిపైనను దీనిని ఉపయోగించి ప్రయోజనము పొందవచ్చును. దీనిని C. T. F. వారు మాత్రమే తయారు చేయుచున్నారు.

## అనాకోబిన్

## Anacobin. I. M.

కండరములో చేయు ఇంజక్షన్

1 CC అంపుల్సు లభించుచుండును. ఇది కూడ రక్త క్షీణతలు గల అన్నివ్యాధులయందు బాగుగా గుణము నిచ్చును. పాండువ్యాధుల యందును, పాండుచే గలుగు రక్త క్షీణతల యందును, శరీరమంత వాపులు కల్గినప్పుడున్ను, నీరు లాగివేయుటకున్ను, రక్తవృద్ధి కలిగించుటకున్ను, యిది బాగుగా గుణమునిచ్చు చుండును. శరీరమునందుగల కీళ్ళ నొప్పులు, వాతపునొప్పులయందును, చిన్న పిల్లలయందు రక్తములేక క్షీణించు వారలకున్ను, చిన్న పిల్లల వాతవ్యాధులయందును యిది నమ్మకముగా గుణము నిచ్చును. నరముల పట్టుదల లేనివారల యందును, నరములకు బలము కలిగించుటకున్ను. అన్నివిధముల పాండులు నివారించి బలము పుష్టిజీర్ణశక్తి నిచ్చుటకున్ను యిది బాగుగా తోడ్పడి ఆరోగ్యవంతులుగా జేయును. రెండు దినముల కొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనిని B. D. H. వారు తయారు చేయుచున్నారు.

## అనాఫోలిన్.

## Anafolin. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. ఇది కూడ

పాండు వ్యాధులయందు రామబాణమువలె పనిజేయును. పాండు వ్యాధులను నివారించుటకుగాను దీనియందు మంచి శక్తి కలదు. పాండు వ్యాధియందు కల్గు నీరు వాపులను నివారించి రక్తవృద్ధి కలిగించి జీర్ణశక్తి పుట్టించి పాండును నివారించి ఆరోగ్యవంతులుగా నుంచును. అన్ని విధముల నరముల జబ్బులను నివారించి నరములకు బలము ప్రసాదించును. లీవర్ వ్యాధులయందు, శరీర మందలి నొప్పుల యందును రక్తము లేక యేర్పడు చుండెడి నీరు నంజు వ్యాధులయందు ఇది తప్పక గుణము నిచ్చును. వ్యాధులు తగ్గిన తర్వాత కల్గు నీరసము బలహీనములయందు కూడ వాడుక జేసిన ఆరోగ్యవంతులుగా జేయును. రెండు దినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని కూడ బ్రిటీష్ డ్రగ్‌హౌసు లిమిటెడ్ లండన్‌వారు తయారు చేయుచున్నారు.

## చినోపిల్.

## Chinopil. I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

1 CC, 2 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది చిరకాలమునుండి బాధించు నట్టి (మలేరియా) చలిజ్వరములయందు, ముఖ్యంగా అనుభవ పూర్వకముగా గుణము నిచ్చును. ఆహిక జ్వరమును అరికట్టును. చలిజ్వరము తగ్గినట్లు తగ్గి మరల తిరిగి తిరిగి వచ్చునట్టి చలిజ్వరముల

యందును, మొండికి బడిన జ్వరముల యందు, నెలనెలకు ఒకతూరి చలి వచ్చునట్లు యుండు చలిజ్వరములయందును యిది రామబాణమువలె గుణము నిచ్చుచుండును. రక్త నాళములో చేయవలసినచో నెమ్మదిగా ఇంజక్షన్ చేయ వలయును. కండరములోచేసిన చాల మంచిది. దినం గాని దినంతప్పి దినంగాని చేయవచ్చును. ఛర్దులయందును విష పడిసెములయందు కూడ గుణకారి.

స్టిబినాల్.

Stibinol. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 CC, 2 CC అంపుల్సు లభించుచుండును. ఇది బోదకాలు అను శ్లీపద వ్యాధులయందు గొప్ప గుణము నిచ్చును. శ్లీపద వ్యాధులను క్రమేణా తగ్గించుటకు గాను దీనియందు మంచి శక్తికలదు. కుష్ఠు వ్యాధులయందు కూడ యిది బాగుగా గుణము నిచ్చుచుండును. దినం తప్పి దినం ఒక ఇంజక్షన్ చొప్పున వాడుక జేయవలయును. దీనిని బ్రహ్మచారి రిచర్చు ఇన్‌స్టూటు కలకత్తావారు తయారు చేయుచున్నారు.

ఒపికాల్‌జిమ్.

Opicalzim. I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

5 CC, 10 CC అంపుల్సు లభించుచుండును. ఇది

శరీరమునందు కాల్షియం తగ్గిన వారలయందును, ధనుర్వా తముల యందును, క్షయవ్యాధులయందును గొప్ప గుణ కారి. క్షయవ్యాధుల అన్ని లక్షణములయందు యిది బాగుగా గుణమునిచ్చును. నరముల బలహీనతలయందు కూడ బాగుగా గుణమునిచ్చును. రక్తమును వృద్ధిజేయును. మూడుదినముల కొకతూరి ఇంజక్షన్ చేయవచ్చును. ఓపిల్ కంపినీవారు తయారు జేయుచున్నారు.

## డిజోక్సిన్.

## Digoxin. I. V.

రక్తనాళములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు 10 CC విల్సు లభించును. యిది కాళ్ళు చేతులు చల్లబడి నప్పుడున్ను శరీరము చల్వాలు గ్రిమ్మి నప్పుడున్ను, నాడి మందగతిగా యుండునప్పుడున్ను, వేడి కలిగించుటకున్ను, గుండెకు చురుకుదనము కలిగించుటకున్ను, తరుణవ్యాధులయందు కలుగు అన్ని లక్షణముల యందున్ను ఇది వాడినచో గొప్పగా గుణము నిచ్చును. ప్రాణాపాయస్థితిలోగల వారలకు సంజీవిగా పని జేయును. 1 CC ఔషధము వాడవచ్చును. దీనిని బర్గవున్ వెల్కం కంపినీవారు తయారు చేయుచున్నారు.

## అమినోఫైలిలిన్.

## Aminophylline. I. m. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు 10 CC విల్సు లభించుచుండును. ఎదురు గుండెనొప్పి యొక్క అన్ని అవస్తల యందును. నొప్పిని నివారించుటకుగాను ఇది రామబాణమువలె గుణము నిచ్చును. నరముల బలహీనతలయందు రక్తము సరిగా ఆడునట్లు చేయుటకున్ను, గుండెకు బలము కలిగించుట కున్ను, గుండెవ్యాధులను నివారించుటకున్ను, దీనియందు మంచి గుణము కలదు. రొమ్ము పడిసెముల యందుకూడ గుణము నిచ్చును. బలహీనముచే కల్గు శ్వాస వ్యాధుల యందును, ఇతర విధముల సంభవించెడి శ్వాస వ్యాధుల యందును, నమ్మక మైన ఔషధరాజము శ్వాసలయందు వెంటనే గుణమునిచ్చి బాధలు తగ్గించివేయును. అజీర్ణ వ్యాధుల యందు కూడ యిది మంచి గుణము నిచ్చును. అజీర్ణము తగ్గించి వేయును. 2 CC కండరములోను 10 CC రక్తనాళములోను అవసరమును బట్టి ఇంజక్షను చేయ వచ్చును. దీనిని కూడ బర్‌గౌసు వెలుకమ్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## ఫ్లోరోసిడ్.

## Florocid. S. C.

## చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. ఇది ఏనుగు కాలు రోగమను శ్లీపద వ్యాధుల యందు గ్యారంటిగా గుణము నిచ్చును. శ్లీపద వ్యాధి చాలవరకు కాళ్ళయందే

వచ్చుచుండును. కాళ్ళయందేకాక చేతులయందును స్త్రీలకు రొమ్ముల యందు కూడ వచ్చుచుండును. శ్లీపద వ్యాధి నివారించుటకు ప్రత్యేకంగా ఈ ఇంజక్షన్ ఈకంపెనీవారు కనిపెట్టి యున్నారు. ఈ ఇంజక్షన్ కొన్ని దినముల వరకు పూర్తికోర్సు చేయవలసి యుండును. వారము దినముల కొకతూరి ఇంజక్షన్ చేయవలసి యుండును. ఈ ప్రకారం నాల్గు అయిదు నెలల వరకు చెయవలయును. దీనిని యిస్టు ఇండియా పార్మస్యూటికల్ వర్క్సు కలకత్తా వారు తయారు చేయుచున్నారు.

సల్ఫో కెడీన్ అల్ బమ్.

Sulpho Cidine Album. S. C. I. M. I. V.

చర్మముక్రిందను కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది అంటు సంబంధమైన వ్యాధులయందు బాగుగా గుణము నిచ్చును. గనేరియా అను సెగ సంకటములయందు. అనుభవపూర్వకముగా ఉపయోగ పడుచుండును. గనేరియా వ్యాధివల్ల మూత్రములోని మంటలు పచ్చగ తెల్లగ నగు స్రావములు యితర లక్షణముల యందును. అడ్డ గడ్డల యందును ఇది బాగుగా గుణము నిచ్చును. చాలకాలమునుండి బాధించు నట్టి అంటురోగము లందును, దద్దురోగమను వీటి యందును మచ్చలు పుండ్లు కురుపులు యితర లక్షణము

లతో కూడుకొని యుండు దద్దు రోగముల యందును, గొంతులో కండలు పెరుగు టాన్సిల్స్‌అను వ్యాధియందును, గొంతు కండలు కరిగించుటకున్ను దీనియందు మంచి ప్రభావముగలదు. న్యూమోనియాఅను శ్లేష్మ వాతజ్వరము లయందు కూడ ఇది ఉపయోగకారి. గనేరియా యందు దీనిని తప్పక వాడవలసి యుండును. ప్రతి దినము ఇంజక్షన్ చేయవచ్చును. బ్రహ్మచారి కలకత్తావారు తయారు చేయుచున్నారు.

### సాలురిన్.

### Salurin. I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. మూలవ్యాధుల యందు అనుభవపూర్వకముగా గుణము నిచ్చును. మూల వ్యాధిని నివారించుటకుగాను ఇది సదా తోడ్పడుచుండును. మూలవ్యాధికి గల అన్ని లక్షణముల యందును అన్ని తరగతుల వారికిన్ని దీనిని ఉపయోగించ వచ్చును. శూల నొప్పులయందును, ఋతుశూలల యందు కూడ బాగుగా గుణము నిచ్చును. నాలుగు దినముల కొకతూరి ఇంజక్షన్ చేయవచ్చును. బ్రహ్మచారి కంపినీవారు తయారు చేయు చున్నారు.

### కార్డిమొన్.

### Cardimon. S. C. I. M.

### చర్మముక్రిందను కండరములోను చేయు ఇంజక్షన్.

5 CC ఆంపుల్సు లభించుచుండును. నరములజబ్బుల యందును, అదుర్త బలహీనముచే వచ్చునట్టి శ్వాసలయం దును యిది నమ్మకముగా గుణమునిచ్చును. రెండు దిన ముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. పైకంపినీ వారే తయారు చేయుచున్నారు.

అంటిస్ సన్.

Anthisan I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. యిది పొడి ఉబ్బసములయందు అనుభవ పూర్వకముగా గుణము నిచ్చును. మూత్రకృచ్ఛ్ర వ్యాధులయందును, కల్లు అన్ని లక్షణముల యందును యిది అనుభవ పూర్వకముగా గుణము నిచ్చును. అవసరమును బట్టి ఇంజక్షన్ చేయ వచ్చును. మే & బేకర్ లండన్‌వారు తయారు చేయు చున్నారు.

పెతదిన్ హైడ్రోక్లోరైడ్

Pethidine Hydrochloride. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. నరముల యొక్క పోటుయందును, నరముల బలహీనతలయందును, నరములకు చురుకు కలిగించుటకున్ను వాతపునొప్పుల యందును, వాతరోగముల యందును, వాతముచే సంభ

వించెడి అన్నివిధముల శరీర నొప్పులయందును, రొమ్ము నొప్పులయందును, రొమ్ముపడిసెము శ్వాసవ్యాధుల యందును యిది నమ్మకముగా గుణమునిచ్చి శరీరమునందు గల నొప్పులను వెంటనే నివారించుటకుగాను, బాగుగా ఉపయోగ పడుచుండును. అవసరమును బట్టి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని బర్‌గొవ్స్ వేల్‌కం కంపినీవారు తయారు చేయు చున్నారు.

పెసిప్టోన్.

Physeptone. I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. నరముల నొప్పులయందును, నరముల జబ్బులయందును, అన్నివిధముల శరీరనొప్పులయందును, పుపుసవేష్టపు వాపుల యందును, శూల నొప్పులయందును దగ్గులయందును యిది బాగుగా గుణమునిచ్చును. దినమునకు ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. బాధలు నివారింపజేయును. పై కంపినీవారే తయారు చేయుచున్నారు.

ఫొల్బిసైన్.

Folbesyn. I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

ఒక బల్బు ఒకసారికే పనికివచ్చునది లభించును. శరీరమునందు రక్తము లేక యేర్పడుచుండెడి నీరువాపుల యందును, బలహీనముల యందును, పాండువ్యాధుల

యందును, రక్తక్షీణతలను నివారించి మరల రక్తమును వృద్ధి గావించుటకుగాను నరముల బలహీనతలను తగ్గించు టకుగాను శరీరము పాలిపోయినవాటిని తిరిగి వృద్ధిగావిం చుటకున్ను జీర్ణశక్తి నిచ్చుటకున్ను, యేకారణముచేతనైన శరీరమునందు రక్తములేని వారలకున్ను, ప్రసవానంత రము కలుగు బలహీనమునకున్ను, వ్యాధులు వచ్చిన తర్వాత కలుగు రక్తక్షీణతకున్ను యిది బాగుగా గుణము నిచ్చును. రక్తము లేనివారలకు రక్తము వృద్ధిగావించి పై వ్యాధులను నివారించుటకుగాను ఇది అనుభవపూర్వకముగా గుణము నిచ్చును. దినముతప్పి దినము ఒక ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని లేడర్‌లీ లేబొరేటరిస్ వారు తయారు చేయుచున్నారు.



శ్రీ

# ఇంజక్షన్ గైడ్

---

## ఆయుర్వేదిక్ ఇంజక్షనులు.

## AURVEDIC INJECTIONS

అనుభవ పూర్వకముగా సిద్ధపరుపబడునట్టి ఆయుర్వేదిక్ ఇంజక్షనులన్నియు నిరపాయకరమై మంచి గుణముల నిచ్చుచున్నవి. అన్ని ఇంజక్షనులు చర్మముక్రిందను, కండరముల లోనికిగాని యివ్వవచ్చును. ఇంజక్షనులన్నియు వ్యాధియొక్క బలమును, అవసరమును, తత్వమును బట్టి ½ CC మొదలుకొని 2 CC వరకు వాడుకొనవలెను. వారమునకు రెండుమూడుసార్లు ఇంజక్షను చేయ వచ్చును. రసౌషధములతో తయారైన ఇంజక్షనులు, విషమూలికలతో తయారైన ఇంజక్షనులు నాల్గుదినముల కొకసారిగాని, వారమురోజుల కొకసారిగాని అవసరమును బట్టి చేయవలసి యుండును.

---

# గమనిక

ఈ ఇంజక్షనులు గాలిగాని, వెలుతురుగాని తగులు చోట నుంచరాదు. గ్యారంటీగా మూడు సంవత్సరములు పనిజేయును. ప్రతి వైద్యుడు మొదట ఇంజక్షను చేయు నపుడు వ్యాధి బలతత్వములను, దేశకాల శీతోష్ణస్థితిని గమనించి వారి స్వకీయానుభవముతో వ్యాధికి తగిన ఇంజక్షను అంపుల్సును బాగుగా కదలించి, సిరంజీయొక్క సూది మొనతో మందును లాగుకొనవలయును. ఆయుర్వేద ఇంజక్షను "అంపుల్సు బాక్సు" పై దాని వివరమంతయు వ్రాసియుండును. దాని ప్రకారము జాగ్రతగా ఇంజక్షను చేసినయెడల యేబాధలకైనను, నొప్పికైనను మంచి గుణమిచ్చుటయే గాక ఆంగ్లేయ ఇంజక్షనులతో సమానమైన గుణమివ్వగలవనుటకు సందేహములేదు. ఈఆయుర్వేదికు ఇంజక్షనులు వనమూలికలతోను, రస, విష, గంధక, భస్మాదులతోడను చేయబడినవి. వీటికి శరీరమున చాలాకాలము నిలచి రోగులను ఆరోగ్యవంతులుగా జేయుటయందు మంచి శక్తిగలదు.

## అమృత ఇంజక్షన్.

## Amritea Injcetion

### కండరములోనికి చేయు ఇంజక్షన్

1 CC మొదలు 2 CC వరకు, వాడుటగలదు. పైత్యము తగ్గించి జీర్ణశక్తి నిచ్చును. మలేరియా, చలిజ్వరములను నివారించును. మూత్రము జారీచేయును. పురాణ జ్వరములను నివారించుటలో పెట్టినది పేరు. వాతపైత్యములను వజ్రాయుధమువలె దు్రించివేయును. క్షయ వ్యాధిని, రక్తస్రావములను నివారించును. రెండుదినముల కొకసారి ఇంజక్షను యివ్వవచ్చును. క్వైనైను బైహైడ్రోక్లోరైడు మాదిరిగా పనిజేయుటయందు మంచి శక్తిగలది.

## టి. బి. ఇంజక్షన్.

## T. B. Injcetion.

క్షయవ్యాధులకు ఈ ఇంజక్షను చాల గొప్పగుణము గలుగ జేయును. రక్తమును వృద్ధిపరచి జీర్ణశక్తినిచ్చును. క్షయక్రిములను సంహరించునట్టి శక్తి దీనికిగలదు. క్షయ వ్యాధులవలన కలుగు అతిసారము నివారించును. దగ్గువలన కలుగు బాధల నడంచును. జీర్ణకోశమును బాగు చేయును. ఒకవేళ ఇంజక్షనులు చేయుటలో లోపమున్ననే తప్ప ఈ ఇంజక్షను సరిగా వాడిన గొప్ప గుణము నిచ్చును.

## అశోక ఇంజక్షన్.

## Ashoka Injcetion.

1 CC, 2 CC లు వాడుటగలదు. రక్తప్రదరములు శ్వేత ప్రదరములు (అనగా) తెల్లబట్ట, యెర్రబట్ట, ఋతు శూల నివారించును. గర్భకోశ సంభంధమైన అన్నిరకముల స్రావములు తగ్గును. మూడు ఇంజక్షనులకే గుణము కనుపించును. (అశోకారిష్ట) గుణములు కలిగి ఉండును. దీని కన్న ఇంజక్షను త్వరగా పనిచేయును.

## బ్రైనాల్ ఇంజక్షన్.

## Brinol Injcetion.

1 CC, 2 CC వరకు వాడవచ్చును. మూత్రమును జారిచేయును. స్వరభంగము కలవారికి, పిచ్చిచేష్టలు కల వారికి, జ్ఞాపకశక్తి సరిగా లేనివారికి, చిన్న పిల్లలకు జ్ఞాపక శక్తికి మంచి బలము, ఆరోగ్యము కలిగించి, చురుకును బుట్టించి మేధావంతులుగా జేయును. దీనినే బ్రహ్మి (అనగా) సరస్వతీ ఆకు అందురు.

## దశమూల ఇంజక్షన్.

## Dashmool Injcetion.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. వాత వ్యాధులు నివారించును. జ్వరములను హరించును. బలవర్ధకమును గలుగజేయును. వంధ్యాది స్త్రీరోగ హరము,

జ్వరము, నంజు, క్షయవ్యాధులు, పాండు వ్యాధులు, కామిల, ప్రమేహము నివారించును. సూతికా జ్వరముల యందు మంచిపనిజేయును. హృదయశూలతగ్గించును. నరములకు బలమును కలిగించును.

## కుమారి ఇంజక్షన్.
## Kumari Injcetion

1 CC మొదలు 2CC వరకు వాడవచ్చును. గర్భకోశము యొక్క స్థితిని చక్కపరచి రక్తప్రసారమును వృద్ధిజేసి మైలను చక్కగా వెడలింపజేయును. గర్భకోశమునకు మంచి బలము నిచ్చును. తెల్లకుసుమవ్యాధి నివారించును. జీర్ణశక్తి నిచ్చును. పైత్యము తగ్గించును. బహిష్టు సరిగా కానివారికిచ్చిన సకాలమునకు బహిష్టు యగునట్లు చేయును. తెల్లకుసుమకు గ్యారంటిగా పనిజేయును.

## ఎనెస్టాల్ ఇంజక్షన్.
## Anesthol Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. గడ్డలు వగైరా కోయవలసినప్పుడు కావలసిన మోతాదుతో గడ్డపై రెండు మూడు ఇంజక్షనులు చేసిన పిదప శస్త్ర చికిత్స చేసినయెడల రోగికి యేమాత్రం బాధకలుగదు. కదలుచున్నట్టి పండ్లు అవసరమైతే చిగుళ్ళకు యిచ్చిన యేమాత్రం బాధలేకుండ పండ్లు తీయవచ్చును.

## యాంటి వోపియమ్ ఇంజక్షన్.
## Anti Opium Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. ఇది నల్లమందుకు విరుగుడుగా నల్లమందు తినిన వారికి విరుగుడుగా ఈ ఇంజక్షను యిచ్చిన మత్తును పోగొట్టును. గంటకు ఒకసారి ఇంజక్షను చేయుచుండ వలయును.

యాంటి సిఫిలిసు I. M. I. V.

Anti Sybhilis Icjcetion.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. సవామేహవ్యాధులకు మంచి గుణమిచ్చును. శరీరమందలి గాని చర్మముయొక్క సన్నని పొరలయందుగాని చేరి వృద్ధినొందుచుండు సవాయి రోగమునకు గల క్రిములను చంపి రక్తమును వృద్ధిచేయును, రక్తమునందుగల రోగక్రిములను గూడ చంపును. చిన్నబిడ్డలకు కూడ యివ్వవచ్చును. శరీరమున కనిపించెడి బుగ్గలు, కురుపులు, గజ్జి, దురదలు నివారించును. అవసరమునుబట్టి దినము తప్పి దినము రక్తనాళములోనికి గాని కండరములోనికి గాని చేయవచ్చును. సిఫిలిసు వ్యాధికి మంచి పనిజేయును.

అర్శరిపు ఇంజక్షన్.

Arsha Ripu Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. మూలశంక వ్యాధులకు గొప్పగ పనిజేయును. రక్తస్రావములను నివారించును. మొలలకు మాత్రమీ ఇంజక్షన్ యివ్వరాదు. ఇచ్చిన ప్రమాదము సంభవించును.

## అర్జున ఇంజక్షన్.
## Arjuna Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. హృద్రోగము (హార్టు డిసీజు) నివారించుటకు మంచి పనిజేయును. గుండెకు బలమిచ్చును. గుండెదడ తగ్గించును. గుండె యొక్క బలహీనత నడంచి మంచి పనిచేయుటయందు దీనికి మించినది లేదు. మంచిశక్తిగలదు.

## బర్త ఎట్ ఈజి ఇంజక్షన్.
## Birth Et Hase Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. ప్రసవమునకు పూర్వము శిశువు నొప్పులు ఆగినయెడల ఈ ఇంజక్షనిచ్చిన వెంటనే అమితమగు నొప్పులు గలిగి సుఖ ప్రసవమగును. నొప్పులున్న సమయమందు ఈ ఇంజక్షన్ చేయరాదు. చేసినయెడల అపాయము కలుగును. నొప్పులు ఆగిన సమయమందు శిశువు ప్రసవమార్గము తిన్నగా వున్నప్పుడు మాత్రమే యీ ఇంజక్షను యీయవలసి యుండును.

## కాల్క్యులిన్ ఇంజక్షన్.
## Calculin Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. మూత్రాశ్మరి వ్యాధులకు ఈ ఇంజక్షన్ చేసెదరు. మూత్రాశయమునందుగల రాళ్ళను కరుగదీయును. అశ్మరీ నివారించుటకు పనికి వచ్చును.

## దీప్య ఇంజక్షన్.

## Dipya Incetion

1 cc మొదలు 2 cc వరకు వాడవచ్చును. మెదడు నరములకు బలము నొసంగి నిద్రిపట్టించును. మూర్ఛ, ఉబ్బసము, కంపవాతములు, ప్రలాపసందులు నివారించును. గుండె శ్వాసకోశములకు బాధ కలుగకుండ సుఖముగా నిద్రిపట్టించును.

## గానోగాన్ ఇంజక్షన్.

## Ganogone Injcetion.

1 cc మొదలు 2 cc వరకు వాడుక చేయుదురు. మూత్రికోశము నందును మూత్రనాళమునందును గాని సంభవించెడి గనేరియా క్రిములను జంపి, మూత్రినాళము నందుండు పుండును మాన్పి, మూత్రిమును శుద్ధపరచి మంట తగ్గించును. ప్రారంభ దశయందు ఆరు ఇంజక్షనులు చేసిన పూర్తిగా గనేరియా వ్యాధి నివారించును. జీర్ణించిన వ్యాధికి యెక్కువ ఇంజక్షనులు చేయవలయును. యిట్లు చేసినచో పూర్తిగా తగ్గిపోవును.

## గుల్మాంతక ఇంజక్షన్.

## Gulmanthaka Injcetion.

1 cc మొదలు 2 cc వరకు వాడుక చేయుదురు. ఈ ఇంజక్షన్ సమస్త గుల్మ రోగములందు, అజీర్ణ వ్యాధులందు నుపయోగింతురు. మంచి పనిజేయును. ఆకలి

బుట్టించును. జీర్ణశక్తి వృద్ధిజేయును. ప్రేగులరచునప్పుడు, వాయువుచే కడుపు వుబ్బునప్పుడును నొప్పి బాధ యేర్పడి శ్రమ గలిగించునట్టి లక్షణముల నరికట్టి కడుపునొప్పుల నివారించును. పేగులు నములుట తగ్గించును. విరేచనము గావించును.

## కంటకారి ఇంజక్షన్.

## Kantakari Injcetion.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుట గలదు. కాసవ్యాధులకు గొప్ప గుణము కలుగజేయును. కాసలు త్వరితముగా నివారించును. కఫమును పలుచబరచి వెడలింపజేయును. శ్లేష్మజ్వరముల నివారించును. క్షయ సంబంధమైన దగ్గులకు మంచి పనిచేయును. విరేచనము గావించును. జీర్ణశక్తిని వృద్ధిగావించును. శ్వాసకోశములను శుద్ధిపరచి బలమునిచ్చును. ఊపిరి తిత్తులను గూడా శుద్ధి జేయును.

## కాసాంతక ఇంజక్షన్.

## Kasantaka Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడుటగలదు. చిర కాలము నుండి బాధించుచున్న కోరింత దగ్గులపై పని జేయుటయే గాక సర్వవిధ కాసశ్వాసలకు వాడుటచే మంచి పనిచేయును.

## హర్టోనికు ఇంజక్షన్.

## Hertonic Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడుకగలదు. గుండె దడను తగ్గించును. అన్ని రకముల హృదయ వ్యాధుల మీదను ప్రత్యేకముగా పనిజేయును. నీరసమును పోగొట్టును. గుండెకు చురుకుదనము కలిగించును.

## జ్వరాంతక ఇంజక్షన్.

## Jwarantaka Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడుకగలదు. జ్వర వేగము నందు ఈ ఇంజక్షన్ జేసినవెంటనే చెమట బుట్టించును. జ్వరమును తగ్గించును. సాధారణమైన అన్నిరకముల జ్వరములందు బాగుగా పనిజేయును. టెంపరేచరు హెచ్చనీయక కాపాడును. విషపడిశ జ్వరములకు బాగుగా పనిజేయును.

## హిరణ్య ఇంజక్షన్.

## Hiranya Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడుకకలదు. ఉబ్బసపు వ్యాధులకు మంచిపనిజేయును. సాధారణముగా పది నిమిషాలకే బాధ నివారించును. దమ్మును తొందరగా నివారించును. శ్వాసవ్యాధులకు గొప్ప గుణము కలుగజేయుట యందు మంచి శక్తిగలదు.

## కుర్చి ఇంజక్షన్.
## Curchi Injcetion

1 CC మొదలు 2CC వరకు వాడుకగలదు. ఆమాతి సారములు, బంకవిరేచనములు, నీళ్ళవిరేచనములు కట్టును. మూడు లేక అయిదు ఇంజక్షనులకే వ్యాధి పూర్తిగా తగ్గిపోవును. రోగియొక్క వయస్సు వ్యాధియొక్క తీవ్రతను బాగుగా విచారించి వాడవలెను.

## కుష్టాంతక ఇంజక్షన్.
## Kustantaka Injcetion

1 CC మొదలు 2 CC వాడుక జేయుదురు. అన్ని రకముల కుష్ఠవ్యాధులు నివారించును. రక్తముశుద్ధిజేయును. చర్మవ్యాధులకు మంచి పనిజేయును. కుష్టువ్యాధుల నివారించుటకు మూడు మాసముల వరకు రోగిని పరీక్షించుచు ఇంజక్షనులు యిచ్చుచుండ వలయును.

## లెక్టెస్ ఇంజక్షన్.
## Lactus Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడవలయును. ఈ ఇంజక్షన్ పాలతో తయారు చేయుదురు. సూతికా జ్వరములు నివారించుటకు వాడవచ్చును. రక్తశుద్ధిలేక కలిగెడు గజ్జి, దురదలు నివారించును. గనేరియా వ్యాధి నివారించును. తెల్ల కుసుమరోగముకూడా నివారించును. పొత్తి కడుపునొప్పి నివారించి ప్రమేహకారణము వల్ల యేర్పడిన వాపు చీము నివారించుటలో మంచిశక్తిగలది. కీళ్ళ నొప్పు

లకు బాగుగా పనిజేయును. ఈ ఇంజక్షనును అల్లోపతి వైద్యములో మిల్కు ప్రొటీన్ అని అందురు.

## మధుశిలా ఇంజక్షన్.

## Mabhushila Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడుక జేయవలయును. అతిమూత్రవ్యాధులు నివారించును. మధుమేహ వ్యాధులకు గ్యారంటిగా పనిజేయును. మూత్రములోచక్కెర పోవుదానిని వెంటనే తగ్గించును. శరీరమునకు నరములకు మంచి బలము కలుగజేయును. మంచి పుష్టినిచ్చును. మూత్రమునందు గల మంట నివారించి మూత్రము శుద్ధి పరచును.

## నక్సువామిక ఇంజక్షన్.

## Nuxvemica Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. చచ్చువాతములకు మంచి పనిజేయును. అజీర్తి, అతిసారములు నివారించును. నరములకు ఉత్తేజము కలిగించి శరీరమునకు అంగములకు బలము నొసంగును. నడుము నొప్పులు, కడుపునొప్పులు నివారించును. తలనొప్పులకు కూడ బాగుగా పనిజేయును. పక్షవాతములను, కంపవాతములను పారద్రోలుటయందు గొప్ప గుణము గలిగియుండును. రోగబలము రోగిబలము అవసరములనెరింగి మోతాదు నిర్ణయించవలసి యుండును.

## ల్యూనేక్యూర్ ఇంజక్షన్.
## Lunecure Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. ఉన్మాదము, భ్రమ, చైతన్యము లేకపోవుట, రక్తపుపోటు తలనొప్పి మొదలగు వ్యాధులపై మంచి పనిజేయును.

## పునర్నవ ఇంజక్షన్.
## Punarnava Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. మూత్రమును జారీచేయుటలో మంచిగుణము గలదు. హృద్రోగము మూత్రపిండము యొక్కయు యకృత్ వ్యాధులవల్ల కలిగిన నీటి ఉబ్బులను, జలోదరములను తగ్గించును. నంజులను నివారించుటలో మంచి పనిజేయును. రక్తము శరీరమున ధారాళముగా ప్రసరించి ఆడునట్లు జేయును.

## ఏరండ ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుదురు. సర్వవాతములను నివారించును. వాతమువలన కలిగిన శూల నివారించును. మలబద్ధకమును హరించును. వాతపు నొప్పులకు మంచి పనిజేయును. వాతప్రకోపమువల్ల యేర్పడిన అనేక పరిస్థితులయందు బాగుగా ఉపయోగపడును.

## అగ్నిమంద ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకగలదు. పిత్తా

ధిక్యతచే యేర్పడిన అనేక వికారములను నివారించును. శీతపిత్తములకు మంచి పనిజేయును. జ్వరములనుకూడా తగ్గించును. చెమటలే కలుగజేయును.

కుటజా ఇంజక్షన్

1 CC మొదలు 2 CC వరకు వాడుకగలదు. వాత జ్వరములకు బాగుగ పనిజేయును. జ్వరాతిసారములు నివారించును. నీళ్ళ విరేచనములకుకూడా బాగుగా పనిజేయును. సాధారణమైన అనేక వాత వ్యాధులను కుదుర్చును.

లివర్ క్యూరు ఇంజక్షన్.

Liver Cure Injcetion

1 CC మొదలు 2 CCవరకు వాడవచ్చును, యకృత్ ప్లీహావృద్ధుల వలన యేర్పడు అనేక వికారముల నశంచును. పచ్చకామిల నివారించుటలో మంచి ప్రఙ్ఞగలది. యకృత్ ముడుచుకొని పోయి సంకోచస్థితివల్ల యేర్పడు క్లిష్టస్థితిలో కూడ బాగుగా పనిచేయును.

రెజువినాల్ ఇంజక్షన్.

Rejuvinol Injcetion.

1 cc మొదలు 2 cc వరకు వాడుకగలదు. వీర్య వృద్ధిని కలిగించును. నపుంసకత్వమును నివారించును. పలుచబడిన వీర్యమును గట్టిపరచును. మూత్రముతో కలసిపోవు వీర్యము (ధాతువును) కట్టును. నరముల యొక్కయు పురుషాంగము యొక్కయు దుర్బలమువలన సంభోగానంత

రము కలుగు నీరసమును బోనడంచి అధికోత్సాహమును గలుగ జేయును.

## ర_క్తదోషాంతక ఇంజక్షన్.

## Ractadoshantka Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. యిది మూత్రమును జారీజేయుటలో మంచి గుణము కలదు. ర_క్తమును శుద్ధిజేయును. చర్మవ్యాధులను నివారించుటలో మంచి శ_క్తిగలదు. సవామేహమువలన కలుగు వ్రణములను మాన్పును. చర్మవ్యాధులకు మంచిపనిజేయును. ముఖ్యముగా ర_క్తమునందు గలుగు సాధారణమైన అన్నిదోషములను పోదోలి ర_క్తమును శుభ్రపరచును.

## వనాష్టా ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడవచ్చును. సన్నిపాత జ్వరములు నివారించుటలో మంచి శ_క్తిగలదు. జ్వరమును తొందరలో నివారించును. దప్పి, తాపము, దగ్గులు, తరుచు మాటలాడుట (ప్రలాపము) ఉబ్బసము, శోఫ, అరుచినడంచి దీపనపాచనములు కలుగజేయును. సన్నిపాత జ్వరములకు బాగుగా పనిజేయును. సాధారణమైన అన్ని పరిస్థితులయందు వారమునకు మూడు ఇంజక్షనులు చాలును.

## స్త_న్యవృద్ధి ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడవచ్చును. స్త_న్య

ముల వృద్ధిజేయుటయందు మంచి గుణముకలది. స్త్రీన్య వ్యాధులు నివారించును. ఇది స్త్రీలకుమాత్రమే వాడవలసి యుండును.

అజువాను ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడుకగలదు. శరీర మున యేర్పడిన బాధచేతగాని అస్వస్థత చేతగాని రోగికి వ్యాధియందు నిద్ర పట్టకుండుటయేగాక శారీరక మానసిక సంబంధమైన యే వ్యాధిచేనైన నిద్రపట్టకుండినచో ఈ ఇంజక్షను ఇచ్చినవెంటనే రోగికి నిద్రపట్టును. రోగమునకు నిద్ర విశ్రాంతి ముఖ్యముగా అవసరము.

నాయీ ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడుక చేయుదురు. విషమ జ్వరమనగా చలితోగూడి దినము తప్పించి దినము వచ్చునట్టి మలేరియా జ్వరమునందు తలనొప్పి, తలతిరుగుట, అధిక దాహము, వాంతులు, కండ్లుమండుట, మున్నగువాటిని మాన్పి రోగికి ఆరోగ్యము చేకూర్చును.

సర్పగంధ ఇంజక్షన్.

Sarpagandha Iujcetion.

1 cc మొదలు 2 cc వరకు వాడుదురు. అధికమైన రక్తపు పోటును తగ్గించును. రక్తపు పోటువల్ల కలిగిన తలత్రిప్పు ఆయాసము వణుకుదడ మొదలగు బాధలు నివారించును. రక్తనాళముల బిగువును తగ్గించి రక్తప్ర

సారమును చక్కగా జరుగునట్లు జేసి పైన కనబరచిన రోగములను వెంటనే రూపుమాపి నిరోగునిగా జేయుననుట నిస్సందేహము.

## వాసక ఇంజక్షన్.

## Vasaka Injcetion.

1 CC మొదలు 2 CC వరకు వాడుకలోనున్నది. శ్వాస గొట్టములను శుద్ధిపరచి, కఫమును పలచనచేసి బయటికి వెడలగొట్టును. మూత్రమును జారిచేయును. దగ్గు బాధను శమింపజేయును. క్షయవ్యాధియందు కలుగు దగ్గులను నివారించును. ఉబ్బసము, ఇతర విధములగు ఊపిరి తిత్తుల బాధలు శమింప జేయును.

## వాతరిపు ఇంజక్షన్.

## Vataripu Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. నరముల సంబంధమైన జబ్బులమీద అమోఘముగా పని జేయును. పక్షవాతము, కంపవాతము, ముఖవాతము, ధనుర్వాతము మొదలగు యెనుబది వాతములను నివారించును. హిస్టిరియా (అపస్మారము) ఆమవాతము, కీళ్ళనొప్పులు, గుండెబరువు, ఆయాసము, శరీరము చల్లబడినప్పుడు వేడిని వృద్ధిపరచి నరములకు ఉత్తేజము కలిగించును.

## సప్తవర్ణ ఇంజక్షన్.

## Saytavarna Injcetion.

1 CC మొదలు 2 CC వరకు వాడుకచేయుదురు.

మలేరియా అను చలిజ్వరమును, తలనొప్పి, శరీరము నొప్పులు, కండ్లమంటలు, దినము తప్పి వచ్చే వరుస జ్వరము చాతుర్థిక జ్వరము మొదలగు అనేక దోషకాటు జ్వరాదులను నివారించును క్వినైన్ ఇంజక్షనుకన్న యెక్కువగా ఉపయోగ పడును.

## సువర్ణ ఇంజక్షన్,
## Gold Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. క్షయ వ్యాధులయొక్క ప్రాథమికావస్థలో అమృతమువలె పని జేయును. దగ్గులు, నంజులు, కామిలావ్యాధులను నివారించి శరీరమునకు బలము కలుగజేయును. జ్ఞాపకశక్తిని వృద్ధి జేయును. ధాతువులకు మంచి బలము కలుగజేయును. పుంసత్వమును గలిగించును. ఆరోగ్యమును గలిగించును. శుక్రనష్టమును నివారించును. స్త్రీలవ్యాధులకు మంచి గుణము జేయుటయందు మంచిశక్తి గలదు. సువర్ణభస్మము యొక్క గుణములే యీ ఇంజక్షను వాడినప్పుడు ప్రసాదించును. గాన వైద్యులు సువర్ణ భస్మము వాడిన మాదిరిగా వ్యాధులను గుర్తెరింగి పై ఇంజక్షను వాడుకొనవలయును.

## చంద్రోదయా ఇంజక్షను.
## Chandrodaya Injcetion.

1 cc మొదలు 2 cc వరకు వాడవచ్చును. ఇది వాజీ

కర ఔషధము ప్రతివారు ఆరోగ్యవంతులుగా నుండుటకు చేయించుకోవచ్చును. అకస్మాత్తుగా గుండె ఆగినవారికి పనిజేయును. క్షయాతిసారములు, క్షయను నివారించును. వీర్యపుష్టిజేయును. ఆరోగ్యవంతులుగా జేయును. పూర్ణ చంద్రోదయము వాడుటవలన కలుగునట్టి సత్ఫలితములే పై ఇంజక్షన్ వాడుటవల్ల సంప్రాప్తించును.

## ప్రవాళ ఇంజక్షన్.

## Pravala Injcetion

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. క్షయ వ్యాధికి, సుద్దకట్టు యెక్కువైన వ్యాధికి మంచిపని జేయును. గుండెమంట తగ్గించును. గుండెనొప్పులు నివారించును. రక్తపిత్తమును, క్షయకాసలను నివారించును. అన్ని వ్యాధులకుకూడ వాడవచ్చును. శరీరమున కాల్షియం లోపించియున్నట్టి వ్యాధులపై బాగుగా పనికివచ్చును.

## కస్తూరి ఇంజక్షన్.

## Musk Injcetion.

1 CC మొదలు 2CC వాడుక జేయుదురు. శరీరము చల్లబడిన అనేక పరిస్థితులయందు దీనిని వాడుటవలన శరీరమున వేడిపుట్టించుటకు బాగుగా తోడ్పడును. వాతము నివారించును. గుండెకు బలము కలిగించును. నాడియొక్క చురుకుదనమును హెచ్చించును. నరములకు బలము కలిగించును.

## మకరధ్వజ ఇంజక్షన్.

## Makaradhwaja Incetion.

1 CC మొదలు 2CC వరకు వాడుక చేయుదురు. ఇది వాజీకర ఔషధము వీర్యవృద్ధి జేయును. శరీరమునకు మంచి బలము కలుగజేయును. నరములకు పటుత్వము, ముఖమునకు కాంతి శిరోజములకు నునుపు కలిగించి క్షయ వ్యాధులను నివారించును. క్షయవ్యాధులయొక్క ప్రారంభ దశయందు బహు మేలుకలుగజేయును. పలుచబడిన వీర్యమును గట్టి పరచును. స్త్రీలకు కలుగు వ్యాధులను గూడ నివారించి శరీరమునకు మంచి బలము కలిగించుటయందు పేరుగాంచిన ఔషధము. దీనినే శుద్ధమకరధ్వజ మందురు.

## లోహభస్మ ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడవలయును. పాండు వ్యాధులు నివారించును. రక్తశుద్ధి, రక్తవృద్ధి జేయును. జీర్ణశక్తి వృద్ధిజేయును. నంజు వ్యాధులందు కలుగు నీరు లాగివేయును. బలము, పుష్టి నొసంగును. పాండు వ్యాధులను పోగొట్టి రక్తవృద్ధి గావించుటకు బాగుగా ఉపయోగపడును.

## అదరికు ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. చిరకాలమునుండి బాధించుచున్న అజీర్ణమును నివారించుటలో మంచి శక్తిగలదు. కడుపునిండ అన్నము తినకుండు

టకు అవకాశము లేకుండ జేయునట్టిది అజీర్ణమే. ఇట్టి సకలవిధముల అజీర్ణములను తృటిలో త్రెంచిపారవేసి మలబద్ధకమును నివారించును. ఆమ్లపిత్తమును గూడా హరించును.

## ఇంద్రివారుణి ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుచుందురు. వాయువుచే నింపియుండు తిత్తిమాదిరిగా యుండు వాత తిత్తికిని, అండవృద్ధికిని మంచి పనిజేయును. మూత్రి కృచ్ఛ్ర వ్యాధులయందు కలుగు బాధలు నివారించును. సమస్త అండవృద్ధులందు బాగుగా పనిజేయును.

## జ్యోతిష్మతి ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. ఉదర వ్యాధులు నివారించును. ఉదరవ్యాధిచేగల్గు బాధలుకూడ శమింప జేయును. వారమునకు సాధారణమైన పరిస్థితుల యందు మూడు ఇంజక్షనులు యివ్వవచ్చును.

## బినౌలా ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. ఉమ్మెత్త విత్తులు మొదలైనవి తినుటవలన సంభవించెడు తలతిరుగు కంపము, వాంతి, భ్రాంతి, మూర్ఛ, పైత్యము, విషము మొదలగు లక్షణములను నివారించును. ఉమ్మెత్త తినినవారికి విరుగుడుగా పనిచేయును.

ధత్తూరు భల్లాంతక ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. శ్వాసకాసలు, అగ్నిమాంద్యము, పురాణజ్వరములు, సన్నిపాత జ్వరములు, కఫవాత ప్రకోపములు, ఎక్కిళ్ళు, ఉబ్బు మొదలగు వ్యాధులను పోదోలి ఉబ్బస వ్యాధులు సయితము నివారించును.

పిప్పలి ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడుకొన వలయును. కఫ జ్వరములను నివారించుటలో మంచిగుణము కలదు. కఫమును పలుచగాజేసి వెడలించును. ఆయాసము, బాధ నివారించును.

ఖదిరా ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడవలయును. కుష్టు వ్యాధులకు గొప్ప పనిచేయును రక్తశుద్ధిలేక కలిగెడు చర్మ వ్యాధులు, గజ్జి, దురదలు, పుండ్లు పొడలు మచ్చలు మొదలగు వాటిని నివారించి రక్తమును శుద్ధిజేయును.

అనారు ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడుదురు. క్రిమి వ్యాధులను నివారించును. క్రిములవలన కలుగు అనేక వ్యాధులను హరించి గొప్ప పనిచేయును.

బిరోజా తైలముతో ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడవచ్చును. గనే

రియా (అనగా అంటురోగములందును) తెల్ల సెగ, రక్త సెగ, పచ్చసెగ, నివారణమగును. మూత్రనాళములోనుండు పుండును మాన్పును. గనేరియాక్రిములను సంహరించును. మూత్రము జారీచేయును. గనేరియా మొదలైన ప్రమేహ రోగములకు బాగుగా పనిచేయును.

అపతరజిత ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడుటగలదు. గల గండ రోగములు మేహపిటిక మేహ వికారములను నివారించుటలో మంచి శక్తిగలదు. గండమాలలను కూడ హరించును.

కంచనార ఇంజక్షన్.

1 cc మొదలు2 cc వరకువాడుకగలదు. గండమాల రోగములకు మంచి పనిచేయును. కమ్మరేగువలె, ఉసిరికాయ ప్రమాణముగల గ్రంథులు కంఠమువద్ద యేర్పడి బాధించుచుండు పరిస్థితులయందు బాగుగా పనిజేయును.

వరుణ ఇంజక్షన్.

1 cc మొదలు cc వరకు వాడుదురు. గుల్మరోగము, యకృత్ ప్లీహవృద్ధులు, ప్రక్కలందుపుట్టు బల్ల, అజీర్ణము శూలలు జలోదరము మహాగుల్మములు మొదలగు దుష్ట వ్యాధులు నశించును.

ఉశిరా ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడుకగలదు. ఓకి

లింతలు త్రేపులు, బయలు వెడలకుండుట, నోటనీరూరుట, అన్నపానములయం దిచ్ఛలేకుండుట ఈ లక్షణములతో గూడియుండు మలబద్ధకము, అగ్ని మాంద్యము, ఛర్ది వ్యాధి నివారించును.

## పలాసు ఇంజక్షన్

2 cc మొదలు 2 cc వరకు వాడుకొందురు. ప్రమేహ రోగము నివారించుటలో మంచి శక్తిగలదు. ప్రమేహము నకు సంబంధించిన శ్వేతప్రదర, రక్తప్రదరములు నివారించును. ప్రమేహ ఉడుకువల్ల యేర్పడునట్టి మూత్రబంధము మంట చురుకు లక్షణములను బోనడంచును.

## పిత్తాపిపర ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడవచ్చును. పిత్తజ్వరములు, శీతజ్వరములు, వాంతులు, అరుచి, పైత్యములు అజీర్ణములు హరించుటలో గొప్పమేటి గుణము గలది. శీతజ్వరములు కూడ నివారించి పై జ్వరములందు యేర్పడునట్టి వాంతి భ్రాంతి అరుచి వికారముల రూపుమాపును.

## పటోల ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకొన వలెను. కఫము కఫసంబంధములగు వ్యాధులు మొదలగు వాటిని నివారించును. పిత్త కఫములను, జ్వరములను బోన డంచును. పైత్య సంబంధ వ్యాధులకు మంచి పనిచేయును.

## చోఫ్ చీని ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకొందురు. భగంధరములు నివారించును. గుద స్థలమున రంధ్రములు కలిగి బాధపెట్టుచు అనేక రంధ్రములుపడి అందు చీము నెత్తురు స్రవించుచుండును. దానిని భగంధరమందురు. ఇట్టిపరిస్థితి యందు యేర్పడిన రంధ్రముల వెంట మూత్రము సయితము వెడలుట సహజము. ఇట్టి లక్షణముల ప్రాథమికావస్థలో బాగుగా పనిచేయును.

## నైరేయిక ఇంజక్షన్.

1 cc మొదలు 2 cc వరకు వాడుకొందురు. మసూరిక రోగమునకు మంచిపని చేయును. దురద, నొప్పులు, భ్రమము, చర్మమున వాపులు, శరీరవర్ణము మారియుండుట, కన్నులు యెర్రగా నుండుట ఇవి మసూరి రోగ లక్షణములు, ఈ లక్షణములతో కూడిన అనేక చర్మరోగములను వెంటనే నశింపజేయును.

## నిర్గుండి ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకగలదు. గజ్జల యందును పొత్తికడుపునందును, మేఢ్రమునందును మిగుల తీక్షణంబగు వేదన మిగుల కష్టముచే కొంచెము కొంచెముగా మాటిమాటికి మూత్రము విడచుట ఈ లక్షణములు గల మూత్రకృచ్ఛ్ర వ్యాధియందు మంచి పనిజేయును.

## తాళపత్రి ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుదురు. మేదో వృద్ధిచే కలుగునట్టి వ్యాధికి పనిజేయును. దప్పి, మూర్ఛ, అతినిద్ర, తుమ్ములు వచ్చుట, బడలిక, చెమట, మేదో వృద్ధిచే కలుగు యితర సంకటములు బాధలు నివారించుటలో మంచిగుణము చూపును.

## భల్లాతకారి ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకజేయుదురు. విషూచి వ్యాధులకు గొప్ప పనిజేయును. అధికముగా ఆమ విరేచనములగుట, వాంతులు, దప్పి, కడుపునొప్పి కల్గుట, ఆవలింతలు, వాతము, వణుకు, తలనొప్పి, శరీరమంతట నొప్పులు కలిగినట్టి పరిస్థితుల యందును విషూచి (కలరా) వ్యాధులకు బాగుగా పనిజేయును.

## లహసన్ దూద్ ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకలో గలదు. శ్లీపదవ్యాధులకు (బోదకాలు) లేక యేనుగుకాలి రోగమునకు మంచి పనిజేయును. ప్రిథమముగా జనించిన త్రిదోష చయము వలనగాని, ప్రికోపమువలనగాని, సంభవించునట్టి శ్లీపదరోగములు నశింపజేయుటలో మంచిశక్తిగలది. మంచిగుణమును గలుగజేయునట్టిదని గట్టిగాచెప్పవచ్చును.

## రసకర్పూర ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. "సిఫిలిసు" అనగా సవామేహ సంబంధమగు వ్యాధులను నివారించును. పుండ్లు, దురదలను నివారించి రక్తశుద్ధిజేసి సవామేహములను నివారించును. రసకర్పూరము యొక్క గుణమే యీ ఇంజక్షనుకు కలిగియుండును.

## వసంతకుసుమాకర ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. అతి మూత్రము, మధుమేహవ్యాధులందు పనిచేయుటలో పేరుపొందినది. మూత్రమున చక్కెరపోవుట దీర్ఘకాలము మధుమేహముతో బాధపడుటవలన రక్తముచెడి శరీరమున యేర్పడు అనేక విధమైన వ్రణములను మాన్పి దేహమునకు, ఆరోగ్యము నిచ్చును. మూత్రాశ్మరి, అతి మూత్రము, పాండువులు, క్షయలు, రాచకురుపులు, బలహీనము, కుసుమరోగములు, వీర్యము పలుచబడుట, పలుచబడిన వీర్యమును వృద్ధిజేయుట, దేహమునకు మంచి బలము కలుగజేయుట మున్నగు మంచిగుణముల నిచ్చును. సర్వ వ్యాధులందు వాడవచ్చును.

## శతావర్ (I.M.S.C.)

చర్మము క్రిందను కండరములోను చేయవచ్చును.

ముఖ్యముగా నేత్రవ్యాధులయందు ఉపయోగపడును. నేత్రములు ఎరుపుగానుండుట, మంటలు, నీళ్ళు

కారుట నేత్రదృష్టి హీనముగా నుండుట, వాపు మంట పోటు మొదలగు లక్షణములతో కూడిన కొన్ని నేత్ర వ్యాధులయందు ఈ ఇంజక్షను రామబాణముగా గుణము నివ్వక తప్పదు.

## సోమలత (I.M.S C.)

చర్మము క్రిందను కండరములోను చేయవచ్చును.

కొసజ్వరముల యందు బాగుగా గుణము నిచ్చు చుండును. జీర్ణకోశ వ్యాధులయందును. పిత్తకోశ వ్యాధుల యందును. కడుపుబ్బరము వాంతులు ఆమ్లపిత్తము నోట నీరూరుట జీర్ణశక్తి లేకయుండుట వీటియందు బాగుగా పని జేయుచుండును.

## స్వర్ణక్షీరి (I.M.S.C.)

చర్మముక్రిందను కండరములోను చేయవచ్చును.

సెగఅను గనేరియా వ్యాధులయందు గొప్పగుణ కారి. గనేరియాకు కలుగు అన్ని అవస్థలయందును యిది గుణమునిచ్చు చున్నది. గనేరియా వ్యాధికి మూత్రనాళ మున గలుగు పుండును నివారించి మూత్రమునందు గల మంటను శమింపజేయుటయందు దీనిని ప్రయోగించిన మంచి లాభము కలుగును. రక్తశుద్ధుల యందును గుణము నిచ్చుచుండును. శుక్ల నష్టముల యందును పనిజేయును. స్త్రీలకుకలుగు లుకోరియా వ్యాధియందుకూడ దీనితో అశోక ఇంజక్షను కలిపి చేయుచుండిన లాభము తొందరగా కను

పించును. గనేరియా వ్యాధియందు రెండు ఇంజక్షనులకే మంచి గుణము కనుపించును. గనేరియాకు మొత్తం ఆరు ఇంజక్షనులు చేయవలసియుండును.

స్పెషల్ నాయి (I.M.S.C.)

చర్మముక్రిందను కండరములో చేయుటకుపయోగపడును.

ఇది ప్రత్యేకముగా మలేరియా (చలిజ్వరముల) యందువాడుటచే బాగుగా గుణమునిచ్చును. మలేరియా యొక్క అన్ని అవస్థలయందు యిది గుణము నిచ్చుచుండును. నాయికన్న అధిక గుణమునిచ్చును. జీర్ణించిన మలేరియాను ఆరు ఇంజక్షనులతో తగ్గించి వేయును. సాధారణమైన మలేరియా జ్వరమునందు ఒక్క ఇంజక్షనుకే గుణము చూపును.

స్పెషల్ కుజ్లీనా (I.M.S.C.)

చర్మముక్రిందను కండరములోను ఇంజక్షను చేయవచ్చును.

రక్తము శుద్ధిలేక కలుగు గజ్జికురుపులు పుండ్లు చిముడు దురద వీటియందు బాగుగా గుణము నిచ్చు చుండును. రక్తశుద్ధి లేక కలుగు వికారముల యందును చర్మ వ్యాధులయందును నమ్మకముగా గుణము నిచ్చుచుండును.

స్పెషల్ లుకోరియా I.M.S.C.

చర్మము క్రిందను కండరములోను ఇంజక్షను చేయవచ్చును.

స్త్రీల గర్భకోశ వ్యాధులయందు గుణకారి. శ్వేత

ప్రదర (లుకోరియా) యను వ్యాధిపైన బాగుగా గుణము నిచ్చును. రెండుమూడు ఇంజక్షనులయందు గుణము కను పించును.

స్పెషల్ శులారిన్ I.M.S.C.

చర్మము క్రిందను కండరములోను ఇంజక్షన్ చేయవచ్చును.

కడుపునొప్పుల యందు బాగుగా గుణమునిచ్చును. కడుపుబ్బరము వలన కలుగు గ్యాసు అను; ఆమ్లమును నివారించి శూలను తగ్గించుటకుగాను ఇది బాగుగా తోడ్పడు చుండును. దీనితో అడ్రక్ను కలిపి ఇంజక్షను చేయు చుండిన బాగుగా గుణము కనుపించును.

స్పెషల్ రక్తప్రదర I.M.S.C.

చర్మముక్రిందను కండరములోను ఇంజక్షన్ చేయవచ్చును.

స్త్రీల రక్తప్రదరమును అరికట్టుటకుగాను యిది ఉపయోగపడును. ప్రారంభస్థితియందుగల రక్తప్రదరము నందు రెండు ఇంజక్షనులతో నివారించును. కొద్దిగా పాత దియైన యెడల చాల ఇంజక్షనులు చేయవలసి యుండును. రక్తప్రదర వ్యాధులను తగ్గించుటకు ఇది బాగుగా తోడ్ప డును.

స్పెషల్ కలరా I. M. S. C.

చర్మముక్రిందను కండరములోను ఇంజక్షన్ చేయవచ్చును.

కలరా వ్యాధులయందు కల్గు అన్ని అవస్థలయందును కలరా వాంతులుకట్టుటకు ప్రారంభమున వాడినచో కొద్ది వ్యవధిలో కట్టివేయును. కలరాకు ఆయుర్వేదమున యిది ముఖ్యముగా ఒకటి గుణకారి. కలరా వ్యాధియందును దాని లక్షణములతో గూడిన అన్ని లక్షణములలోను దీనిని ఉపయోగించ వచ్చును.

స్పెషల్ క్షయ I.M.S.C.
చర్మము క్రిందను కండరములోను ఇంజక్షను
చేయవచ్చును.

క్షయవ్యాధిని నివారించుటకు గాను క్షయవ్యాధిని రాకుండ జేయుటకుగాను యిది బాగుగా తోడ్పడును. క్షయ, కాస, శ్వాసలయందును జ్వరమును తగ్గించుటకు గాను. మంచి గుణము నిచ్చుచుండును. ప్రారంభ దశ యందుగల క్షయవ్యాధిని మాన్పి ఆరోగ్యవంతునిగా జేయుటకు ఇది మంచి ఇంజక్షన్.

స్పెషల్ టానిక్ I.M.S.C.
చర్మముక్రిందను కండరములోను ఇంజక్షను
చేయవచ్చును.

అన్ని వ్యాధులకు పిదప కలుగు బలహీనతల యందును రక్తము తగ్గినవారల యందును పాండు వ్యాధుల యందును శరీరమునందు కొన్ని విటామినులు తగ్గినవారల

యందును యిది బాగుగా గుణము నిచ్చును. వ్యాధి తగ్గిన తర్వాత టానికుగా ఈ ఇంజక్షనులు చేయవచ్చును. మంచి బలము కలిగించును.

స్పెషల్ మాలతి I.M.S.C.

చర్మము క్రిందను కండరములోను ఇంజక్షను చేయవచ్చును.

సాధారణ జ్వరములయందును జీర్ణించిన జ్వరముల యందును, టెంపరేచర్ తగ్గించుటకు గాను యిది బాగుగా సహాయపడును. జ్వరమును తొందరలో నివారింపజేయును. ప్రథమావస్థలో క్షయ జ్వరములయందుకూడ దీనిని ఉపయోగించిన మంచి లాభము కలిగించును.

త్రిఫల I.M.I.V.S.C.

చర్మముక్రిందను, కండరముల యందును, అవసరమునుబట్టి రక్తనాళముల యందును ఇంజక్షనుచేయుట కుపయోగ పడును.

ఉదరశూల, ఉదర వ్యాధులందును, మూలవ్యాధుల యందును కాసజ్వరముల యందును వాతపిత్త జ్వరముల యందును మలబద్ధక వాతవ్యాధుల యందును కడుపునొప్పి మొదలగు రోగములకు మిక్కిలి గుణకారి. రెండుమూడు ఇంజక్షనులతో దీని గుణము కనుగొనవచ్చును. జ్వరముల యందు మాలతితో కలిపిచేసిన మంచిగుణము [illegible] గనుపించును.

శ్రీ వేమన గ్రంథాలయము [illegible]
[illegible]

స్పెషల్ పైరాలిసిజ్ I.M.S C.

చర్మము క్రిందను కండరములోను ఇంజక్షన్ చేయుట కుపయోగపడును.

పక్షవాత వ్యాధులయందు మిక్కిలి నమ్మకముగా గుణమునిచ్చును. ఏకాంగ సర్వాంగ వాతముల యందును, అతిసారము అగ్నిమాంద్యము వీటియందు కూడా పని జేయుచుండును, వాతవ్యాధులకు యిది ముఖ్యావసరము. వాతవ్యాధులందు దీనిని ప్రయోగించిన మంచిగుణము గనుపించును.

స్పెషల్‌శ్వాసిన్ I.M.S.C.

కండరములోను చర్మము క్రిందను చేయుటకుప యోగపడును.

శ్వాస వ్యాధులయందు "ఎపిడ్రిన్" మాదిరిగా గుణము నిచ్చుచుండును. దమ్మును తొందరగా శమింప జేయుటకు యిది బాగుగా తోడ్పడును. శ్వాసకోశములను మంచిస్థితికితెచ్చి ఆరోగ్యవంతుని జేయును. కొన్ని ఇంజక్షనులు వాడినపిదప పూర్తి ఆరోగ్యమును ప్రసాదించును.

మహాలక్ష్మి విలాసరస్ I.M.I.V.

లోతుగా కండరములోను రక్తనాళములలో చేయుటకుపయోగ పడును.

అనేక జ్వరముల యందును క్షయ, కాస, నంజు, వ్యాధుల యందును బలహీనము జలోదరములయందు

హృదయ వ్యాధులు గుండె బలహీనము. వీటియందు మహా లక్ష్మి విలాసరస ఇంజక్షను బాగుగా గుణము చూపించును.

మహావాత విధ్వంసిరస్ I.M.S.C.

కండరములోను చర్మముక్రింద చేయుట కుపయోగపడును.

సర్వవిధముల వాతవ్యాధులయందు దీనిని వాడుక జేయుదురు. వాతజ్వరము, వాతమునొప్పులు, వాతశూల, వాతరోగమున కాళ్ళుచేతులు పడిపోవుట, కీళ్ళనొప్పులు, కీళ్ళవాపులు, వీటియందు బాగుగా గుణము నిచ్చుచుండును. దీనితో "రాస్నా" ఇంజక్షను మిశ్రితముజేసి, ఇంజక్షను చేసిన వాతబాధలు తొందరగా నివారించును.

ముక్తపిష్టి I.M.I.V.

కండరములోను రక్తనాళమునందును వాడవచ్చును.

క్షయవ్యాధి కఫపిత్తములయందు గొప్పగుణకారి. క్షయవ్యాధి యొక్క బలహీనము తగ్గించి వేయుటకు గాను యిది బాగుగా గుణమునిచ్చును. ఉన్మాదములయందును పిత్తజ్వరముల యందును గుణము నిచ్చుచుండును. రోగి యొక్క హృదయచలనము నాడి మొదలగునవి బాగుగా వైద్యుడు పరిశీలించి యీ ఇంజక్షను ప్రయోగించవలసి యుండును.

రౌప్య భస్మ I.M.I.V.

కండరములోను రక్తనాళములోను ఈ ఇంజక్షను ఇవ్వవచ్చును.

అష్లపిత్త వ్యాధులయందు, నేత్రవ్యాధులయందును, ఉన్మాదము, అపస్మారముల యందును, ప్రమేహ వ్యాధుల యందు ఇది గొప్ప గుణకారి. దీనితో బ్రిహ్మిగాని శంకపుష్పి గాని కలిపి ఇంజక్షను చేసిన బాగుగా గుణమిచ్చును.

## శిలాజిత్ I.M.S.C.

చర్మముక్రిందను కండరములోను ఇంజక్షను చేయవచ్చును.

మధుమేహ వ్యాధుల నివారణయందు ఇది బాగుగా తోడ్పడును. ప్రమేహ వ్యాధులయందును, సెగవ్యాధుల యందును మేహ ఉడుకులయందును యిది గొప్ప గుణకారి. దీనితో చందన్ ఇంజక్షన్ కలిపికూడ చేయుచుండిన గుణము అధికము కనుపించుచుండును.

## స్వర్ణ పర్పటి I.M.S.I.

కండరములోను రక్తనాళములోను ఇంజక్షను చేయవచ్చును.

పూయమేహము శ్వాసవ్యాధులు శరీరమంటలు, క్షయ కండ్ల మంటలు, మేహవ్యాధులు, అతిసారము, గ్రిహణి బలహీనము రక్తవికారము వీటియందు ఈ ఇంజక్షను మంచి గుణముచూపును. దీనితో అభ్రికముఇంజక్షన్‌కలిపి కూడ జేయవచ్చును.

## వసంత మాలతి I.M.S.C.I.V.

కండరములోను రక్తనాళములోను చర్మము క్రింద ను ఇంజక్షను చేయవచ్చును.

క్షయవ్యాధి జ్వరము, ధాతుగత జ్వరము, జీర్ణ జ్వరము, పురాణజ్వరము, వాతజ్వరము, శ్లేష్మజ్వరము, న్యూమోనియా జ్వరము, సన్నిపాత జ్వరములు మొదలగు అనేక విధములైన జ్వరములను నివారించి పుష్టిని శక్తిని ప్రసాదించును.

## గంధక్ I.M.S.C.

కండరములోను చర్మముక్రిందను ఇంజక్షను చేయవచ్చును.

సర్వ విధములైన రక్తదోష వికారములయందు చర్మవ్యాధులయందును సవామేహముల యందును, సెగ వ్యాధుల యందును కుష్టు వ్యాధులయందును గంధక్ మిక్కిలి గుణకారి. దీనితో శిలాజిత్ కలిపి ఇంజక్షను చేసిన ప్రమేహ వ్యాధులందు యెక్కువ గుణము కనుపించును. మొండికిపడిన వ్యాధులకొరకు చాలా ఇంజక్షనులు చేయవలసియుండును.

## కనకసుందర రస్ I.M.I.V.

కండరములోను రక్తనాళములోను ఇంజక్షను చేయవచ్చును.

అతిసారము గ్రహణి వ్యాధులయందు యిది ఉప

యోగ పడును. గ్రహణి తగ్గినతర్వాత కూడ దీని నిచ్చు చుండిన బలహీనము నివారించి రక్తవృద్ధి కలిగించి ఆరో గ్యవంతునిగా జేయును. "ఎమిటనీ" మాదిరిగా గుణము కనుపించుచుండును.

జవాహిర్ మొహరా I.M.S.C.

కండరములోను చర్మముక్రిందను ఇంజక్షను చేయవచ్చును.

గుండె ఆగినవారలయందును, గుండెపోటు, గుండె బలహీనముల యందు, కాళ్ళుచేతులు చల్లబడినప్పుడున్ను శరీరమునకు వేడికలుగుటకును, నాడి సన్నగిలినప్పుడున్ను యిది అమృతమువంటి గుణమిచ్చును.

సమాప్తి

D. R. D. H. Rao.



# అల్లోపతీపేటెంటు ఔషధములు

---

మిల్కు ఆఫ్ మేగ్నిషియా

దీనిని మలబద్ధకముల యందును, వాతపు నొప్పుల యందును పైకారణములవల్ల జీర్ణశక్తిలేక బాధపడువారల యందును, ఆమ్ల పిత్తములయందును ప్రతిదినము రెండు మారులు ఉదయం సాయంత్రము సేవించుచుండిన పై వ్యాధుల నివారించుటకు బాగుగా తోడ్పడును. దీనిమాత్రలు కూడ లభించుచుండును. పై ఔషధము వాడుటవలన మల బద్ధకము తొలగి సుఖవిరేచన మగుచుండును.

విటామిన్ బి. కాంప్లెక్సు

ఏ వ్యాధిచేనైన బాధపడి స్వస్థత జెందిన వారల యందును, వ్యాధి తగ్గినతర్వాత శరీరమునందు రక్తము లేక జీర్ణశక్తిలేక బాధపడు వారలయందును శరీరమునందు విటామిను బి. తగ్గి రోగము నిమ్మళించిన వెనుక సయి తము పైవిటామినులు లోపించి మొదలగు విటామినులు వ్యాధిసమయమున లోపించినవారలయందును టానికుమాది రిగా దీనిని వాడుచుండిన యే వ్యాధి రాకుండ జేయుటకున్ను

వ్యాధిని నివారించుటకున్ను పాండు బలహీనత నిస్త్రాణ మొదలగు అనేక దుర్బల లక్షణములను తొలగించి బాగుగా గుణము నిచ్చుచుండును. నరముల బలహీనతను నీరసము ఆయాసము నివారించుటకు సయితము బాగుగా తోడ్పడు చుండును. దీనిని రోగియొక్క బలము వయస్సు మొదలగు లక్షణములను గమనించి మోతాదు నిర్ణయించుకో వలెను.

## వాటర్ భారిస్ కాంపౌండు.

ఇదియును శరీరమునకు బలము చురుకు కలుగజే యుట యందు పేరుపొందిన టానికు జీర్ణశక్తుల యందును బలహీనత యందును పుపుసముల బలహీనతవల్ల దగ్గు దమ్ము, ఆయాసము యెదలో నొప్పి మొదలైన అనేక నీరస లక్షణములతో నరముల పటుత్వము లేనివారలయం దును యెల్లప్పుడు నీరసముగా వుండు వారలయందును రక్తము వృద్ధి గావించుటకు గాను క్షయవ్యాధి నివారించి తర్వాత బలహీనతల యందును పాండు వ్యాధుల యందును యే వ్యాధి పిదపగాని యేర్పడు బలహీనత యందైనను యీ ఔషధమును వాడినయెడల మంచిబలము ఆరోగ్యము ప్రసాదించును.

## షార్ప్ కోఫెరోక్

శరీరమునకు పుష్టినిచ్చునట్టియు శక్తిని కలుగజేయు నట్టి విటామినులతో దీనిని అలంబిక్ కంపెనీవారు తయారు

చేయుచున్నారు. శరీరమును ఆరోగ్యముగా నుంచుటకు బలహీనము నివారించుటకు గుండెవ్యాధుల యందును క్షయవ్యాధి బలహీనతల యందు. దీనిని నుపయోగించు చుండిన శరీరమున లోపించిన అన్ని విటామినులను వృద్ధి గావించి శరీరారోగ్యమును ప్రసాదించును.

## క్విన్స్ మలేరియా మిక్చర్.

ఇది మలేరియా అను చలిజ్వరములయందు బాగుగా గుణము నిచ్చుచున్నది. మలేరియా జ్వరములను నివారించుటకు గాను యిది బాగుగా తోడ్పడును. మలేరియాపైన దీనిని తప్పక వాడవలసియుండును. యీ ఔషధము పరిస్థితి ననుసరించి తగిన మోతాదుతో వాడుటవలన వెంటనే ఆరోగ్యమును కలుగును.

## సిల్‌డ్రిన్ టానిక్.

దీనిని చిన్నబిడ్డలకుగాను అమెరికా కంపెనీవారు తయారు చేయుచున్నారు. తల్లిపాలు జీర్ణముగాక యుండు బిడ్డలయందును జీర్ణశక్తి లేకయుండు యెదిగిన బిడ్డలయందును శరీరమునందు విటామిన్ తగ్గియుండు బిడ్డలయందును బుద్ధిబలము నిచ్చుటకుగాను మంచి శక్తినిచ్చి ఆరోగ్యవంతులుగా జేయుటకుగాను యిది బాగుగా తోడ్పడును.

## జెఫోల్.

దీనిని ముఖ్యముగా దగ్గులయందు వాడుటకుగాను ప్రత్యేకముగా ఇంటివైద్యమునకు పనికి వచ్చునట్లుగాను తయారు చేయుచున్నారు. మొండి కాసలయందు అనేక విధమైన కాసలయొక్క ప్రారంభ స్థితిలో రామబాణము వంటిది. కాసలు నివారించుటకు బాగుగా తోడ్పడును.

## ఈనోస్ ఫ్రూట్ సాల్టు

జీర్ణకోశ సంబంధమైన వ్యాధులు గలవారు దీనిని తప్పక వాడుక చేయుచున్నారు. జీర్ణశక్తిలేక బాధపడు వారలకున్ను ఆమ్ల పిత్తముల వృద్ధియందును యిది తోడ్పడుచుండును. పై కారణములవలన యేర్పడిన మల బద్ధకము అరుచి నోట నీరూరుట మొదలగు లక్షణములను తొలగించి శరీరమున కారోగ్యము కలిగించును.

## లీవర్ జన్.

మలబద్ధకము నందును జీర్ణశక్తుల యందును జీర్ణము గావించుటకుగాను రక్తము తగ్గిన వారలయందును అజీర్ణము బలహీనముగల వారలయందును పిత్తరసము చాలినంతవృద్ధిలేక బాధపడు వారలకున్ను యిది సేవించు చుండిన తప్పక జీర్ణశక్తి పుట్టించును. శరీరమునందు పైత్యాధిక్యత వలన యేర్పడు దద్దులు మొదలగు లక్షణ ములను నివారించి సుఖ విరేచన మగుటకు తోడ్పడును.

## కాల్ బిస్మా.

గ్యాస్ట్రబుల్‌గల వ్యాధులయందు ఆమ్లపిత్తము, కడుపుబ్బరము కడుపునొప్పి పుల్లని త్రేపులు జీర్ణశక్తిలేక యుండుట వీటిపైన బాగుగా గుణము నిచ్చుచుండును.

## ఎంబడై.

దీనిని M. & B. కంపినీవారు తయారుచేయుదురు. క్లోరడైనను మాదిరిదే. నీళ్ళ విరేచనములయందును చిన్న పిల్లల విరేచనములయందును వ్యాధియొక్క ప్రాథమిక దశలో యిది బాగుగా సహాయపడును.

## ఎలిక్జిర్ గ్లిసరోట్.

అన్ని విధముల బలహీనులకు యిది ముఖ్యావసరమైనది. బలహీనము నివారించుటకున్ను రక్తము వృద్ధి జేయుటకుగాను శక్తిని పుట్టించుటకుగాను యిది ముఖ్యావసరమైనది. నరముల బాధలు గలవారలు దీనిని తప్పక సేవించవలసి యుండును. యీ ఔషధ సేవవలన కోలుపోయిన శరీరశక్తిని తిరిగి పొందుటకు యెంతయో తోడ్పడును.

## పెన్‌కిల్లర్,

దీనిని అమెరికా దేశీయ కంపినీ ఒకటి తయారు చేయుచున్నది. చాల అద్భుత గుణకారి. విషపడిశముల యందును, సిరోజ్వరములయందును, కాసశ్వాసముల

యందును, నడుమునొప్పి, రొమ్మునొప్పి, కాళ్ళనొప్పుల యందును, వాంతులయందును, అజీర్తులయందును ఇన్ఫ్లూయింజా విషమ జ్వరములకున్ను తలనొప్పి పంటినొప్పి గొంతునొప్పి వాతసంబంధ నొప్పులయందును పై కారణము వలన యేర్పడు జ్వరములు పుల్లత్రేపులయందును కడుపుబ్బరముల యందును పేన్ కిల్లర్ మిక్కిలి ఉపయోగకారి. దీనిగుణములు తొందరగా చూపును. నొప్పుల యందు పై పూతకును సేవించుటకును ఉపయోగించును. దగ్గులు వాంతులు కడుపునొప్పి శిరోజ్వరము అజీర్తి వీటి యందు త్రాగుటకుగాను చుక్కలు సేవించవలసి యుండును. ఈ చుక్కలు రోగబలము రోగియొక్క వయస్సును మొదలగు వాటిని బట్టి నిర్ణయింపవలసి యుండును.

## పెప్సిన్ బిస్మత్ కో.

దీనిని అలంబిక్ లేబరేటరివారు తయారు చేయుచున్నారు. జీర్ణశక్తులు లేనివారలయందును శూలనొప్పుల యందును రామబాణమువంటిది. శూలనొప్పులు గలవారలు దీనిపై ఆధారపడి యున్నారని చెప్పవచ్చును. జీర్ణము ఆకలి గావించుటకుగాను యిది బాగుగా తోడ్పడును. పిత్తోద్రేకము నివారించుటకుగాను మంచి ఔషధమని చెప్పక తప్పదు. శూలనొప్పిచే బాధపడువా రనేకులీ ఔషధమును ప్రతిరోజు సేవించుచు బాధనుండి విముక్తులగుచున్నారు.

## బైకోలేట్సు.

జీర్ణకోశ వ్యాధులపైన వాడవలసిన ఔషధమును ఆమ్ల పిత్తములయందును అగ్ని మాంద్యముల యందును. జీర్ణశక్తి కలిగించుటకు గాను యిది బాగుగా గుణము నిచ్చుటకు దీనిని ఉపయోగించుచుండినచో పై వ్యాధులనుండి ప్రమాదము కలుగదు.

## లీవోక్విన్.

మలేరియా చలిజ్వరమునందు గల బహీనతకున్ను చలిజ్వరము నివారించుటకు గాను రక్తవృద్ధి కలిగించుటకు గాను యిది బాగుగా తోడ్పడును. నీరసము ఆయాసము శరీరమునందు సత్తువలేకయుండు వారలకున్ను బాగుగా ఉపయోగపడును.

## యెలగ్జిర్ హెమోగ్లోబిన్.

శరీరమున క్షీణించిన రక్తమును వృద్ధిపరచుటకును పై కారణములవలన శరీరమున కేర్పడిన దుర్బలమును పోగొట్టి సర్వాంగములకు మంచి ఉత్తేజమును కలిగించుటకును, టానికుగా ఉపయోగపడును. అజీర్ణ వ్యాధులందు సయితము జఠరాగ్నిని వృద్ధిపరచి ఆహారము చక్కగా జీర్ణమగుటకు తోడ్పడి శరీరమునకు మంచి ఆరోగ్యమును ప్రసాదించును, దీనిని అలంబిక్ కంపినీవారు మాత్రము తయారు జేయుచుందురు.

## క్వినాగ్లోబిన్.

మలేరియా జ్వరమునకు యిది బాగుగా గుణము నిచ్చును. బలహీనము ఆకలి లేకపోవుట ప్లీహము (స్ప్లీను) పెద్దదగుట రక్తములేక యుండుట మలేరియా జ్వరమునకుగల్గు అనేక దుష్ట లక్షణముల యందును వాడుకజేయుటకు బాగుగా తోడ్పడును. మలేరియా తగ్గి పోయిన తర్వాతకూడ వాడుక చేయవచ్చును. దీనినికూడ అలంబిక్ బరోడావారు తయారు చేయుచున్నారు.

## అయోడైస్డు సరసపరిల్లా.

సవాజాత సంబంధమైన దోషము శరీరమున చేరి నప్పుడును అట్టి దోషమువలన రక్తమునందును చర్మము నందును యేర్పడు అనేక దుష్టలక్షణములను తొలగించి రక్తము శుభ్రము చేయుటకును రక్తము వృద్ధిజేయుటకు గాను కురుపులు దురద మొటిమలు చర్మవ్యాధులు, కీళ్ళ నొప్పులకున్ను వాతరోగము వాతనొప్పుల యందును. మంచి గుణము చూపించి శరీరమున కారోగ్యము ప్రసా దించును.

## ఎఫిడ్రిక్స్

ఉబ్బస వ్యాధులయందును కోరింత దగ్గులయందును దగ్గు దమ్ములు నివారించుటకు గాను శ్వాసకోశముల శక్తిని వృద్ధిపరచి బాగుగా గుణమునిచ్చుటకు యిది ఉపయోగ పడును.

# గమనిక

ఈ పైన వ్రాసిన 20 విధముల టానికులు వీటి యందు నీళ్ళుగాని పాలుగాని సమభాగములు కలిపి భోజనానంతరముగాని లేక భోజనము చేయకముందుగాని ఒక గంట ముందుగా దినము రెండుమారులు లేక మూడు మారులు సేవించవచ్చును. రోగముయొక్క తీవ్రత ననుసరించి అర్ధ ఔన్సు నుండి ఒక ఔన్సు వరకు సేవించవచ్చును. చిన్నపిల్లలకు వయస్సును బట్టి మోతాదు తగ్గించి వాడవలెను.



శ్రీ

# ఇంజక్షన్ గైడ్

## అల్లోపతి ఔషధ యోగములు

[రోగములకు తగినటువంటిన్ని, ముఖ్యముగా వాడుకలో నుండునటువంటిన్ని మిక్చరునే వ్రాసితిమి.]

దీనికి సలహాదారులు :—వి. ఎల్. ఎన్. శాస్త్రిగారు.

### (కంపౌండింగ్ మిక్చర్సు.)

తూనికలు, కొలతలు యే మాత్రము హెచ్చుతగ్గులు లేకుండ చూచుకొనవలయును. మిక్చర్సుయందు కలుపు నీళ్ళను వేడిజేసి చల్లార్చుకొని కలుపవలయును. ద్రవములు, పౌడరులు ముందుగా కొలతలుచేసి, సీసాలోపోసి తర్వాత నీళ్ళు కలుపు కొనవలయును. పాషాణ సంబంధమైన మందులు బహుజాగ్రతతో వాడుకొనవలయును. తూనికను యేమాత్రము హెచ్చించకుండ నుండవలయును. కొన్నిమందులు నీళ్ళతో కలువవు. జిగురుతో కలిసిన నీళ్ళనుబోసి "మార్టల్" పింగాణి రోలులో కలియబెట్టిన యెడల బాగుగా కలిసిపోవును. వ్యాధియొక్క బలమును,

వ్యాధి లక్షణములు గుర్తెరింగి వయస్సు ననుసరించి మోతాదులు గమనించి చాల జాగ్రితతో ఇవ్వవలయును. ప్రితి ఔషధ ద్రవ్యముయొక్కయు వ్యాధియొక్కయు గుణములు గుర్తెరుంగనిదే మిక్చర్సు యెవ్వరికిని యివ్వరాదు.

మో తా దు లు.

డ్రాము (అనగా) డ్రాము
గ్రైను (అనగా) గ్రైను
మినుము (అనగా) మినుము
ఔన్సు (అనగా) ఔన్సు
సాలిడ్ (అనగా) ఘనపదార్థము
లిక్విడ్ (అనగా) ద్రివపదార్థమని యెరుంగవలయును.

60 మినిములు (చుక్కలు) ఒక డ్రాము
8 డ్రాములకు ఒక ఔన్సు అగును.
20 ఔన్సులు ఒక పైంటు
8 పైంట్లు ఒక గ్యాలను వుండును.

ద్రివపదార్థములను కొలుచుటకు మినుము గ్లాసును వాడుక చేయుదురు. పౌడర్లు వగైరాలు కొలుచుట గాజుతో చేయబడిన త్రాసు, తూనిక రాళ్ళు ఉపయోగము చేయుచుందురు.

ఒకవేళ చిన్నబిడ్డలు మొదలు పెద్దవారి వరకు 24 మినిములు వాడుకగలదు. ఈ లెక్క ప్రకారము గుర్తెరింగి

ఔషధములను వాడుక చేయుచుండవలయును. ఒకవేళ చిన్నబిడ్డలకు ఒక గ్రైనుగాని లేదా ఒక చుక్క ఔషధ ద్రవము గాని యివ్వవలసి వచ్చును. ముందు ఈ విషయములయందు బహు జాగ్రతతో గమనించి చేయుచుండవలయును.

*** మలేరియా జ్వరమునకు మిక్చర్సు ***

15 గ్రైనుల క్వినైన్ సల్ఫేటు
30 గ్రైనుల అమ్మోనియం క్లోరైడు
3 డ్రాముల మేగ్నిషియం సల్ఫేటు
30 మినిములు ఆసిడ్ నైట్రొ హైడ్రోక్లోర్‌డిల్

పూటకు ఒక ఔన్సు మోతాదుతో దినము మూడు పూటలు యిచ్చుచుండిన మలేరియా జ్వరము, వాంతులు, తలనొప్పి, కండ్లమంటలు నివారించి, జ్వరము చలిని నివారించుటలో మంచి శక్తి గలది. క్వినైల్ కొద్దిగా పైత్యము జేయును. గాని పైత్యానికి విరుగుడుగా తత్వము పరిస్థితి ననుసరించి చారు, పులుసు లేక పండ్లరసము మొదలైనవి తగినట్లు వాడిన పైత్యము నివారించును.

2 వ విధము.

15 గ్రైనుల క్వినైల్ సల్ఫేటు
3 డ్రాముల మేగ్నిషియం సల్ఫేటు
3 గ్రైనుల ఫెర్రియి సల్ఫేటు

3 అక్వామెంతాపిసు
30 మినిములు ఆసిడు నట్పారికుడైల్యూడు
పూటకు ఒక ఔన్సుచొప్పున దినము మూడు పూటలు యిచ్చుచుండిన పై వ్యాధులన్నియు నివారించును.

( జ్వరములకు మిక్చరు )

1 డ్రాము పొటాసు నైట్రిసు
3 డ్రాములు స్పిరిటు ఈతరు నైట్రసు
8 ఔన్సులు వేడిజేసి చల్లార్చిన మంచినీళ్ళు కలిపి మిక్చరుగా తయారుచేసి, నాలుగు గంటలకొకసారి పుచ్చుకొనిన అధికమగు జ్వరతాపముతో వున్నయెడల మాత్రము గావించి సేదతేర్చును. దినమునకు నాలుగుసార్లు సేవించిన చాలును.

2 వ విధము.

5 డ్రాములు స్పిరిటు ఈతరునైట్రిసు
2 ఔన్సుల లైకరు అమ్మోనియా అసిడెటిన్
1 డ్రాము పొటాసు నైట్రిసు
5 డ్రాముల నిమ్మ షరబత్

పూటకు 5 డ్రాములు దినము మూడు పూటలు సేవించిన జ్వరములు, సన్నిపాత జ్వరములు, అన్నివిధములగు జ్వరములు నివారించును. చిన్న పిల్లలకు 1/2 డ్రామునుంచి, ఒక డ్రామువరకు దినము మూడుసారులు వాడిన చిన్నపిల్లల జ్వరములు కూడ నివారించును.

( కడుపునొప్పికి మిక్చర్సు )

2 డ్రాములు మిక్చరు లాండ్యూ లాకో
1 1/2 డ్రాము మేగ్నిషియం కార్బనను
1 1/2 డ్రాము అమ్మోనియం కార్బనను
2 మినుములు పిప్పరమెంటు ఆయిల్
6 ఔన్సుల జలము

నొప్పి యెక్కువగ నున్నయెడల, రెండు గంటల కొకసారి పూటకు అర ఔన్సు మోతాదుతో యిచ్చిన శూల నొప్పి నివారించి జీర్ణశక్తిజేయును.

( పాండువ్యాధికి మిక్చరు. )

10 గ్రైనులు ఫెర్రయియెట్ అమ్మోనియ సిట్రను
20 మినిములు గ్లిసరిన్
4 మినిములు లైకరు ఆర్సెనికాలిన్
2 మినిములు యక్సుట్రాక్టు నక్సువామిక
2 ఔన్సుల జలము

కలిపి మిక్చరుచేసికొని ఈ మిక్చరు భోజనానంతరము సేవింపదగినది, పూటకు ఒక ఔన్సు, దినము రెండుపూటలు సేవించిన పాండువ్యాధి నివారించి రక్తవృద్ధి జేయును. మలబద్దకము నివారించును. మలము నలుపు రంగుగా వెడలింపజేయును.

( దగ్గులకు మిక్చరు. )

2 డ్రాముల స్పిరిట్ అమ్మోనియా అరోమెటికు

3 డ్రాములు టించర్సు క్యాంఫర్‌కో
8 ఔన్సుల జలము

దినము రెండుపూటలు వాడవలయును. లేదా నాలుగు పూటలుకూడ వాడవచ్చును. పూటకు ఒక ఔన్సు చొప్పున వాడవలయును. మరియు చిరకాలమునుండి బాధించుచున్న దగ్గులు, మామూలు దగ్గులుకూడ నివారించును.

( క్షయవ్యాధులకు మాత్రలు. )

T. B. Pills.

6 గ్రైనుల తియొకాల్
6 గ్రైనుల గ్రియిషత్ కార్బనను
1 1/2 గ్రైనుల క్రియసోట్
1 1/2 గ్రైను క్వినీన్ మ్యూరియను

ఇవి ఒక దినమునకు సరియగును. వీటన్నిటిని యేకమునొనర్చి మూడు మాత్రలుజేసి మంచినీళ్ళ యను పానముతో పూటకు ఒకమాత్ర చొప్పున సేవించిన క్షయ వ్యాధికి మంచి పనిచేసి, జ్వరముకూడ నివారించును.

( జీర్ణశక్తికి మిక్చరు. )

6 డ్రాములు టించర్ కార్డమంకో
3 డ్రాములు స్పిరిట్ క్లోరోఫారం
3 డ్రాములు స్పిరిట్ అమ్మోనియా అరోమెటికు
90 మినిములు సోడాబైకార్బనేట్

2 చుక్కలు పిప్పరమెంటు ఆయిలు
10 1/2 జలము.

ఇవియన్నియు కలిపి మిక్చరుగా తయారుచేసి దినము మూడుసారులు లేదా నాలుగుసారులు పూటకు ఒక ఔన్సు చొప్పున సేవించుచుండిన అజీర్ణము తగ్గి జీర్ణ శక్తినిచ్చును. మంచి పనిజేయును.

(నీళ్ళ విరేచనములకు)

15 గ్రైనులు సలార్
15 గ్రైనులు సోడా బై కార్బనస్
30 గ్రైనులు బిస్మత్ సబ్ నైట్రిసు

బాగుగా కలిపి, మోతాదులు మూడుగాజేసి పొట్లములు గట్టుకొని మూడుపూటలు సేవించుచుండిన నీళ్ళ విరేచనములు, అతిసారములు అతిమూత్రము నివారించుటకు బాగుగా పనిజేయును. ఔషధమును బాగుగా కలియునట్లుగా జేయవలయును. బాగుగా కలిపిన తర్వాత నీళ్ళతో మూడు పొట్లములు సేవించిన అతిసారములు తప్పక నివర్తించును.

(గుండె వ్యాధులకు)

1 డ్రాము పొటాసు సిట్రసు
2 డ్రాములు లైకరు అమ్మోనియా సిట్రిసు
30 మినిములు వైనం ఇపికాకు

5 మినిములు స్పిరిటు క్లోరోఫారం
3 ఔన్సుల జలము

పూటకు ఒక ఔన్సు చొప్పున దినము రెండుపూటలు వాడినయెడల రొమ్ము పడిశము, ఆయాసము నివారించుటయే గాక గుండెకు బలము కలుగజేసి మంచి నిద్ర కలుగ జేయును.

(మలబద్ధకమునకు)

120 గ్రెయినుల మేగ్సలుపు
20 మినిములు స్పిరిటు క్లోరోఫారం
2 ఔన్సుల జలము

ఉదయం కలిపి పుచ్చుకొనిన యెడల సుఖవిరేచనము గావించి మలబద్ధకమును నివారించును.

(బలహీనమునకు)

40 మినిములు యక్ట్రాక్టు డామియానా లిక్విడు
10 మినిములు టించర్ నక్సువామికా
20 మినిములు ఆసిడు ఫాస్ఫారిక్ డిల్యూట్
2 ఔన్సుల ఇన్ఫ్యూజన్ జంక్షన్

ఇది భోజనానంతరము సేవించు మిక్చర్సు. దినం రెండు పూటలు పూటకు ఔన్సు చొప్పున సేవించినయెడల, నరముల బలహీనము నివారించి మంచి బలము కలుగ జేయును.

(గర్భస్రావమునకు)

10 గ్రెయినులు క్వినైన్ సల్ఫేటు
10 మినిములు ఆసీడు సల్ఫూరికు
20 మినిములు టించరు డిజిటాలిన్
2 డ్రాములు యక్స్ట్రాక్ట్సు యెర్గాట్ లిక్విడు
3 ఔన్సుల జలము

దినము మూడు పూటలు, పూటకు ఒక ఔన్సు సేవించిన గర్భస్రావములు శ్వేతప్రదరములు నివారించి మంచి బలము కలుగజేయును.

( సన్నిపాత జ్వరమునకు )

6 డ్రాములు లైకరు అమ్మోనియా సిట్రెస్
1 డ్రాము టంచరు అరటి
15 డ్రాములు సోడా క్లోరసు
3 ఔన్సుల ఆక్వా అనీతి

దినము మూడుసార్లు వాడవలయును, పూటకు ఒక ఔన్సు మాదిరిగా వాడిన సన్నిపాత జ్వరములు, సన్నిపాత జ్వరములలో కలుగు బాధలు నివారింపజేయుటలో మంచి శక్తి గలదు.

( శుక్ల నష్టమునకు )

45 మినిములు గ్లిసరిన్
20 మినిములు స్పిరిట్సు క్లోరోఫారం

6 మినిములు షైకరు స్ట్రిక్నీ
15 గ్రెయినులు ఫెర్రమ్‌యెట్ అమ్మోనియా నిట్రసు
3 ఔన్సుల జలము

దినము మూడుపూటలు పూ ౹కు ఒక ఔన్సుచొప్పున వాడిన ధాతునష్టము నివారించి బల ము కలుగజేయును.

( తిమురు వాయువునకు )

30 మినిములు స్ఫిరిటు క్లోరోఫారం
15 మినిములు టించరు స్టాపాంతసు
15 మినిములు టించరు నక్సువామికా
3 ఔన్సుల జలము

దినమునకు మూడుసారులు పూటకు ఒక ఔన్సు చొప్పున సేవించుచుండిన తిమిరువాతము, కాళ్ళు చేతుల తిమ్మెర్లు నివారించి, బలము కలిగించి, మంచి పుష్టిజేసి వేడి కలిగించును. బహు జాగ్రతతో వాడవలయును.

( చర్మవ్యాధికి )

లే ప న ము

పైన వ్రాయుటకు ఆయింటుమెంటు.
3 భాగముల వైటువాజులేను
1 భాగము బోరికు 'పౌడరు
అర్ధభాగము " లిభాజాల్ " మాత్రలు

బాగుగా ఆయింటుమెంటుగా జేసి, వ్రణములను ముందు కార్బాలికు సబ్బుతో శుభ్రముజేసి, బాగుగా శుభ్రమైన తెల్లనిబట్టతో పుండుగలచోట చీమునంతయు పోవునట్లుగా తుడిచిన తర్వాత ఈ ఆయింటుమెంటును దానిమీద బాగా అంటించిన చర్మవ్యాధులు, కురుపులు, గజ్జి, దురదలు నివారించును. రక్తశుద్ధికి సిబాజాల్ ఇంజక్షన్ గాని లేక అయిరను ఆర్సినెటు ఇంజక్షన్ గాని, లేక సిబాజాలు మాత్రలు గాని రక్తశుద్ధి జేయుటకు దీసుకున్న యడల చర్మవ్యాధులు నశించి రక్తశుద్ధి కలుగును.

( 2 వ విధము )

1 భాగము కార్బాలికు ఆసిడు
10 భాగముల గ్లిసరిన్
2 భాగముల బోరిక్ పౌడరు

బాగుగా కలిపి పైన వ్రాయుచుండిన పుండ్లు, కురుపులు అన్ని చర్మవ్యాధులు తప్పకుండ నివారించును.

( గనేరియా వ్యాధికి )

( దీనినే సెగవ్యాధి అందురు. )

30 మినిములు బాల్ పంకోపేడా
30 మినిములు లైకరు పొటాసు
45 మినిములు టించరు హాయొసామి
30 మినిములు ఓలియం శాంటొల్

15 మినిములు ఓలియం క్యూబెబ్
1 డ్రాము స్పిరిట్సు యితరు నైట్రిసు
3 ఔన్సులు ఇన్ఫ్యూజన్ బక్కు

దినమునకు మూడుసారులు పూటకు ఒక ఔన్సు చొప్పున సేవించుచుండిన మూత్రమును శుద్ధిచేసి గనేరియా క్రిములను సంహరించును. మూత్రద్వారమున గల మంటను నివారించును. యెర్రసెగ, తెల్లసెగ, పచ్చసెగలు నివారించుటలో మంచి శక్తిగలది. దీనికి అనుపానము చందనినూనె పది చుక్కలు పంచదారలోవేసి దినము మూడుసార్లు సేవించిన సెగలు తప్పక నివారించును.

( మూర్ఛకు )

30 గ్రెయినుల సోడియం బ్రొమైడు
30 గ్రెయినుల పొటాసియం బ్రొమైడు
10 గ్రెయినుల అమ్మోనియం బ్రొమైడు
2 ఔన్సుల ఆక్వాక్లోరోఫారం
40 మినిములు వైకలు అర్సెనికాలిన్

దినమునకు రెండు మూడు పూటలు పూటకు ఔన్సు చొప్పున పుచ్చుకునేది. దీనివలన మూత్రవ్యాధులు తప్పక నివారణము కాగలవు.

( కలరావ్యాధికి )

3 డ్రాముల టించరు గ్యాయిషం
4 డ్రాముల స్పిరిటు క్యాంఫరు
5 డ్రాముల టించరు కాప్సికం
2 ఔన్సుల వేడినీళ్ళు

దినమునకు నాల్గుసార్లు వాడుక. పూటకు అర ఔన్సు చొప్పున వాడినయెడల వాంతులు భేదులను నివారించి కలరా నశించును.

( కామిలకు )

45 గ్రెయినులు అమ్మోనియం క్లొరైడు
15 మినిములు టించర్సు హైడ్రోక్లోరిక్ అమ్మోనియాటి
3 ఔన్సులు ఇన్ఫ్యూజన్ జన్షన్కో

దినము మూడుసారులు వాడవలెను. ఒక ఔన్సు మోతాదుగా పుచ్చుకొన్న యెడల కామిలావ్యాధి, తెల్లకామిల యకృత్ వృద్ధి నివారించును.

( తలనొప్పికి )

5 గ్రెయినుల ఆస్పిరిన్
3 గ్రెయినుల కాఫిన్ సిట్రిసు

నాలుగు గంటలకొకసారి మోతాదుగా నాలుగు సార్లు వాడవలయును. కాఫీతోగాని వేడినీళ్ళతోగాని సేవించిన తలనొప్పి, పార్శ్వపుశూల నివారించుటలో మంచిపని జేయును.

( కీ ళ్ళ నొ ప్పు ల కు )

30 గ్రెయినులు పొటాసుబైకార్బనేట్
39 గ్రెయినులు సోడాసాలిసైలిసు
45 గ్రెయినులు స్పిరిటు అమ్మోనియా అరోమెటికు
8 ఔన్సుల ఆక్వాక్యాంఫరు

దినము మూడుసారులు, పూటకు ఔన్సు చొప్పున వాడిన యెడల సర్వవిధములైన కీళ్ళనొప్పులు నివారించి, మంచి బలమును కలిగించి వేడిజేయును.

( జలోదరమునకు )

1 గ్రెయిను రసభస్మము
1 గ్రెయిను పల్విసు సిల్లే
1 గ్రెయిను పల్విస్ డిజిట్యాలిస్

యాక్ట్రిక్టుజన్షన్ మాత్రియగుట రెండు మాత్రలు జేసి దినము రెండు మాత్రిలు సేవించిన జలోదరము నివారించి ఆయాసము, బాధ తగ్గును,

( బ్రాంకో న్యూమోనియాకు )

చిన్నపిల్లలకు కలుగునట్టిది.

40 మినిములు వైకరు అమ్మోనియా అసిటెటిసు
20 మినిములు సిరపుటోలు
4 మినిములు టించరు బెలడోనా
2 మినిములు టించరుసిల్లా
1 గ్రెయిను అమ్మోనియా కార్బానసు
4 డ్రాములు ఇన్ఫ్యూజన్ సెనిగా

దినమునకు నాలుగుసారులు నాలుగవవంతు ప్రకారము వాడుచుండిన యెడల న్యూమోనియా నివారించును. మూడు గంటలకొకసారి కూడ వాడవచ్చును.

(చెవిపోటుకు)

1 1/2 డ్రాము గ్లిసరిన్
1 డ్రాము టించరు ఓపియం
29 మినిములు కార్బాలికు ఆసిడ్
1 ఔన్సు కొబ్బరినూనె

ఈ మిశ్రిత ఔషధము వెచ్చదనముజేసి, చల్లార్చి ఒకటి లేక రెండు చుక్కలు వేసిన చెవిపోటు, చెవుల నుండి చీము కారుట, దుర్వాసన అంతరించును.

---

శ్రీ

# ఇంజక్షన్ గైడ్

---

## ఆయుర్వేదిక్ కంపౌండింగ్

---

### —• ఆసవారిష్ట కల్పన •—

ఈ కంపౌండించు విధానమును నా యనుభవము మీద వ్రాయడమైనది. చూర్ణములు, ఆసవములతో నప్పటి కప్పుడే తయారుచేసి యిచ్చునవి. ఆసవారిష్టములైన రెండు మూడు కలిపి సేవించవచ్చును. కంపౌండింగు చేయు నప్పుడు, ఆసవారిష్టమునకు సమానము మంచినీళ్ళు కలిపి, మిక్చర్సుగా తయారుచేసి ఒక పూటకు యెంత చూర్ణము కలుపవలయును ? అను లెక్క మిక్చర్సుతో వ్రాయబడి యుండును. ఆంగ్లేయ ఔషధ మిక్చర్సు కంటె రెండు రెట్లు నిధానంగాపనిజేయును. ఈ విధిగా మిక్చర్సు తయారుచేసి సేవించుచుండిన, ఇందు చెప్పిన వ్యాధులు తప్పక నివా రించును. మేము వీనిని తయారుజేసి పలుమందికిచ్చి గుణము కనుకొని అనుభవపూర్వకముగా నిందు పొందు పరచడమైనది.

( మలేరియా మిక్చర్సు. )

1/2 తులము సహాదేవి చూర్ణము
1/2 తులము నేలవేము చూర్ణము
2 1/2 ఔన్సుల అమృతారిష్టము
3 1/2 ఔన్సుల మంచినీళ్ళు

కలిపి మిక్చరుగా తయారుచేసి, దినము మూడు పూటలు సేవించిన మలేరియా (చలిజ్వరము) పురాణ జ్వరములు, అజీర్ణములు, సన్నిపాత జ్వరములు నశించును.

2 వ విధము.

90 గ్రెయినుల తాళిశాది చూర్ణము
2 ఔన్సులు కిరాతకారిష్టము
2 ఔన్సుల మంచినీళ్ళు

కలిపి, దినమునకు మూడుసారులు సేవించిన మలేరియా జ్వరములు, వాతజ్వరములు, విషమజ్వరములు, పురాణజ్వరములు, సన్నిపాత జ్వరములను నివారించును. రక్తమును శుద్ధిజేయును. మంచి పుష్టి నిచ్చును.

(కడుపునొప్పికి)

150 గ్రెయినుల హింగ్వాష్టక చూర్ణము
3 ఔన్సుల దశమూలారిష్టము
4 ఔన్సుల నీళ్ళు

బాగుగా కలిపి, దినము మూడుసారులు సేవించిన కడుపుబ్బరము. అజీర్ణము, అరుచి, వాంతులు నివారించుటలో మంచి శక్తిగలది.

( 2 వ విధము )

90 గ్రెయినుల అష్టాంగలవణ చూర్ణము
150 గ్రెయినుల భాస్కర లవణ చూర్ణము
3 డ్రాముల శంఖద్రావకము
3 ఔన్సుల నీళ్ళు

కలిపి దినమునకు మూడుసారులు సేవించిన అజీర్ణము, కడుపుబ్బరము, కడుపునొప్పి, ఆమ్లపిత్తము, ఉదర వ్యాధులను నివారించుటలో మంచిగుణమును కలిగించును.

పాండు రోగమునకు

2 తులముల సుదర్శన చూర్ణము
120 గ్రెయినుల తాళిశాది చూర్ణము
2 1/2 ఔన్సు లోహాసవము
2 1/2 ఔన్సుల నీళ్ళు

కలిపి తయారుచేసి, దినమునకు మూడుసారులు సేవించిన పాండువ్యాధులు నివారించును.

దగ్గులకు

150 గ్రెయినుల దాడిమాష్టక చూర్ణము
150 గ్రెయినుల శీతోపలాది చూర్ణము

2 1/2 ఔన్సుల శవికాసవము
2 1/2 ఔన్సుల నీళ్ళు

కలిపి దినమునకు మూడుసారును సేవించుచుండిన దగ్గులు, సర్వవిధ కాసలు నివారించి, కాళ్ళు చేతుల తిమ్మెర్లు నివారణజేయును.

(2 వ విధము)

150 గ్రెయినుల సీతోపలాది చూర్ణము
2 1/2 ఔన్సుల కుమారి అసవము
2 1/2 ఔన్సుల నీళ్ళు

కలిపి, దినము మూడుమారులు సేవించుచుండిన దగ్గులు ప్రమేహములు, కాళ్ళుచేతులు చల్లబడిన తిమ్మిర్లు నివారణజేయును.

క్షయవ్యాధులకు

150 గ్రెయినుల సీతోఫలాది చూర్ణము
36 గ్రెయిలుల జాతిఫలాది చూర్ణము
2 1/2 ఔన్సుల కనకాసవము
1 1/2 ఔన్సులు నీళ్ళు

కలిపి దినము మూడుసారులు సేవించుచుండిన క్షయలు, ఉబ్బసము, జీర్ణజ్వరములు, రక్తపిత్తములు నివారించును.

(2 వ విధము)

150 గ్రెయినుల తాళీసాది చూర్ణము
2 1/2 ఔన్సుల ద్రాక్షాసవము
2 1/2 ఔన్సుల వాసారిష్టము
2 1/2 ఔన్సుల జలము

కలిపి తయారుచేసి దినమునకు మూడుసారులు సేవించుచుండిన క్షయదగ్గు, ఉబ్బసము నివారించి మంచి బలము కలుగజేయును.

జీర్ణశక్తికి

150 గ్రెయినుల హింగ్వాష్టక చూర్ణము
150 గ్రెయినుల భాస్కరలవణచూర్ణము
80 గ్రెయినుల అష్టాంగలవణ చూర్ణము
3 ఔన్సుల అశ్వగంధారిష్టము
3 ఔన్సుల పిప్పల్యారిష్టము
3 ఔన్సుల నీళ్ళు

కలిపి దినము మూడు పూటలు ఔన్సు చొప్పున సేవించుచుండిన అజీర్ణము, అరుచి, వాంతులు, కడుపుబ్బరములు నివారించి, జీర్ణశక్తి కలుగజేయును తినిన అన్నమును జీర్ణముగావించి, సుఖవిరేచనము గలిగించును.

## నీళ్ళ విరేచనములకు

150 గ్రెయినుల గంగాధర చూర్ణము
1 ఔన్సు కర్పూరాద్యారిష్టము
1 ఔన్సు నీళ్ళు

కలిపి దినమునకు మూడుసారులు సేవించిన నీళ్ళ విరేచనములు నివారించును.

## గ్రహణి వ్యాధికి

150 గ్రెయినుల దాడిమాష్టక చూర్ణము
2 1/2 తులం త్రివృత్యాది చూర్ణము
2 1/2 ఔన్సులు కుటజారిష్టము
2 1/2 ఔన్సులు నీళ్ళు

కలిపి దినము మూడుసారులు సేవించుచుండిన గ్రహణి రక్తాతిసారము, బంకవిరేచనములు నివారించి, జీర్ణశక్తినిచ్చి బలము కలుగజేయును.

## గుండె వ్యాధులకు

35 గ్రెయినుల చౌషష్టి పిప్పలి
2 1/2 ఔన్సుల వాసారిష్టము
2 1/2 ఔన్సుల నీళ్ళు

కలిపి తయారుచేసి దినము మూడుసారులు వాడిన గుండెవ్యాధులు, దడ నివారించి గుండెకు బలము, చురుకును కలుగజేయును.

## మలబద్ధకమునకు

300 గ్రెయినుల స్వాధిష్ట విరేచన చూర్ణము
2 1/2 ఔన్సుల అమృతారిష్టము
2 1/2 ఔన్సుల నీళ్ళు

కలిపి దినమునకు మూడుసారులు సేవించిన మల బద్ధకము నివారించి విరేచనము గావించును.

## బలహీనతకు

150 గ్రెయినుల అశ్వగంధాది చూర్ణము
3 ఔన్సుల అశ్వగంధారిష్టము
3 ఔన్సుల ద్రాక్షారిష్టము
3 ఔన్సుల నీళ్ళు

కలిపి మిక్చరుగా తయారుజేసి, దినము మూడు సారులు సేవించుచుండిన బలహీనత నివారించి దేహపుష్టి నొసంగి బలమును కలుగజేయును.

## శ్వేతప్రదరమునకు

150 గ్రెయినుల పుష్యానుగా చూర్ణము
2 1/2 తులములు శుక్రశోధన చూర్ణము
2 1/2 ఔన్సుల అశోకారిష్టము
2 1/2 ఔన్సుల దశమూలారిష్టము
2 1/2 ఔన్సుల జలము

కలిపి దినము మూడుసారులు సేవించుచుండిన స్త్రీలకు కలుగు వ్యాధులు నివారించును. దేహపుష్టి కలుగ జేసి శ్వేతప్రదరములను రూపుమాపును.

నంజులకు

150 గ్రెయినుల తాళిశాది చూర్ణము
2 1/2 తులములు త్రివృత్యాది చూర్ణము
2 1/2 ఔన్సుల లోహాసవము
2 1/2 ఔన్సుల నీళ్ళు

కలిపి తయారుచేసి దినమునకు రెండు సారులు సేవించుచుండిన నంజులు, నీరు వాపులు, నివారించి మల బద్ధకమును పోగొట్టి సుఖవిరేచనము గావించును.

శుక్రనష్టములకు.

150 గ్రెయినుల శుక్రశోధన చూర్ణము
150 గ్రెయినుల అశ్వగంధాది చూర్ణము
1 1/2 ఔన్సుల అశ్వగంధారిష్టము
2 1/2 ఔన్సుల ఉశీరాసవము
2 1/2 ఔన్సుల నీళ్ళు

కలిపి తయారుచేసి, దినముకు మూడు సారులు సేవించుచుండిన శుక్రనష్టము నివారించి, వీర్యపుష్టి గావించును. బలము గలిగించును.

### ఆమవాతమునకు.

150 గ్రెయినుల సారస్వత చూర్ణము
150 గ్రెయినుల స్వాధిష్టచూర్ణము
2 1/2 తులముల త్రివృత్యాది చూర్ణము
2 1/2 ఔన్సుల బలారిష్టము
2 1/2 ఔన్సుల కుమారి ఆసవము
2 1/2 ఔన్సుల నీళ్ళు

కలిపి తయారుచేసి, దినమునకు మూడు సారులు సేవించుచుండిన ఆమవాతములు నివారించును.

### చర్మవ్యాధులకు.

150 గ్రెయినుల అశ్వగంధాది చూర్ణము
3 ఔన్సుల ఖదిరారిష్టము
3 ఔన్సుల నీళ్ళు

కలిపి దినమునకు మూడుసారులు సేవించిన చర్మవ్యాధులు నివారించును.

### గనేరియాకు.

150 గ్రెయినుల ఫలాది చూర్ణము
100 గ్రెయినుల సీతోఫలాది చూర్ణము
3 ఔన్సుల ఉసిరాసవము
3 ఔన్సుల చందనాసవము
2 ఔన్సుల నీళ్ళు

కలిపి దినమునకు మూడుసారులు సేవించిన గనేరియా నివారించి మూత్రమును జారీచేసి పుండు, క్రిములను నివారణ జేయగలదు.

ఆమ్లపిత్తమునకు.

130 గ్రెయినుల భాస్కరలవణ చూర్ణము
120 గ్రెయినుల హింగ్వాష్టక చూర్ణము
130 గ్రెయినుల అజీర్ణ పంచానన చూర్ణము
110 గ్రెయినుల శివక్షారపాచన చూర్ణము
3 ఔన్సుల ద్రాక్షాసవము
3 ఔన్సుల బలారిష్టము
3 ఔన్సుల నీళ్ళు

కలిపి దినమునకు మూడుసారులు సేవించుచుండిన ఆమ్లపిత్తము, అజీర్ణము, అరుచి నడంచి అగ్నిదీప్తిని కలుగజేసి జీర్ణశక్తినిచ్చును. దేహపుష్టినిచ్చి బలము కలుగ జేయును.

సంపూర్ణము.

---

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు. (కృష్ణాజిల్లా.)



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TDLA1Q4B149 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 469 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B.B. |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Heena |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |